



# భారవి



## ద్వితీయభాగము - ప్రవాసాదికము.




క॥ హారాయిత కవితాంత
స్సార సుమప్రచయలగ్న సరసమహాదలం
కారమణీఘృణిపారా
వారసుధాతుషితసూరివర భారవికిన్॥


గ్రంథకర్త:
భువనగిరి విజయరామయ్య, బి. ఏ.,
లోకలాడిటాఫీసు, గుంటూరు.



మొదటికూర్పు 1000.

**1936**




[వెల రు 1-0-0.





# భారవి

## ద్వితీయభాగము - ప్రవాసాదికము.




క॥ హారాయిత కవితాంత
స్సార సుమప్రచయలగ్న సరసమహాదలం
కారమణీఘృణిపారా
వారసుధాతుషితసూరివర భారవికిన్ ॥

గ్రంథకర్త:
భువనగిరి విజయరామయ్య, బి. యే.,
లోకలాడిటాఫీసు, గుంటూరు.

మొదటికూర్పు 1000.

1936

 [వెల రు 1-0-0.

చీరాలపురోన్నత పాఠశాలా సంస్కృతాంధ్రోపాధ్యాయులగు

## మ.రా.రా.శ్రీ నారపరాజు సీతారామయ్యగారు

శ్లో॥ బహుభాషావర శ్రీభువనగిర్యన్వయాధిక
జయరామకవీంద్ర! త్వత్కృతి ర్భవతు నిస్తులా॥

శ్లో॥ మాఘభారవిశబ్దౌ తౌ యథా తత్కావ్యనామకౌ
తథా విజయరామం స్యా త్త్వదాంధ్రీకృతభారవి॥

శ్లో॥ తత్కిరాతార్జునీయం త ద్విజయస్య జయార్థకం
విజయస్య జయేనైవ రామా భవతి తత్కథా॥

శ్లో॥ కిం త్వేతత్కథనం శ్రీవిజయరామేణభాషితం
యథా భారవినామాఖ్యం రసవంతం మహాప్రథం॥

శ్లో॥ శ్రీమదాంధ్రకిరాతార్జునీయనామకభూషణం
జయ త్వాచంద్రతారార్క మేతత్కావ్య మహో! భువి॥



# తొలిపలుకు.

శ్రీమత్పాండిత్యకవి
త్వామేయరసజ్ఞపాఠకాగ్రేసరులా
రా! మనవి, మున్ను వింటిరి
గా మనభారవిచరిత్రఁ గళ్యాణంబున్ ॥

చ॥ పదపడి వానికావ్య మొకభంగి తెలుంగున నాలకించి నా
రిది కవిగాథలోఁగడమ యెల్లదయాహృదయావధానులై
చదివి తదీయయోగ్యత నెసంగుపసందు లసారత ల్సరి
న్విదిత మొనర్పుఁడీ! కొనుఁడి వేపది వేలగుమన్నమస్కృతుల్ ॥

ఉ॥ సోదెయొ తందనాలో యనుచు న్నిరసింపకుఁడయ్య! యిందుఁగ
న్గోఁదగు మున్ను భారవి యకుంఠితదీక్షఁగ నత్తియుంటఁ బ
ల్వాదుల కోర్చియుంట, పిదప న్మగధేశ్వరునోలగంబున
న్వాదుల గెల్చుకొంట కళవర్ధిలఁగా బడి నిల్చుకొంటయున్ ।

చ॥ అటనట నేర్చురీతిఁ గథయందుఁ గవిత్వకళావిశేషము
ల్ఘటితములయ్యెఁ గల్పితముకా దొకనిందుచరిత్రకాదు మే
ల్ఘటకులఁదేర్చు రెంటిపులగంబగునియ్యది కొంతయైనము
చ్చటనిడి తేర్చనే నదియె చాలుఁ గృతార్థుఁడనై తరించెదన్ ॥

గీ॥ దివ్యసుధ వెదజల్లుసందేశములను
గృతిని బూరింప నుత్సాహమతి నొనర్చి
రెవ్వ రవ్వారలకు మ్రొక్కి యిట్లు మనవి
వ్రాయు

గుంటూరు,
25—12—1935.

భువనగిరి విజయరామశాస్త్రి.

# పండితాభిప్రాయములు.

అస్మద్గురువర్యులలో నొకరును వధానశిరోమణులు నగు
శ్రీమధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు, గుంటూరు, 23-3-1935.

క॥ భారవి యర్థంబునఁ గడు
గౌరవముగలట్టిప్రౌఢకావ్యంబని యి
ద్ధారుణిఁ దెల్గించిన వా
ర్లే రది తెల్గించితివి బలే! యనఁదగదే! ॥

క॥ భారవిఁ దెల్గించుట "యసి
ధారన్వ్రత్యంబె" యనఁగఁదగు; నీదగువా
గ్ధారకుమెచ్చితి నినుఁ "బ్రతి
భారవి" యని పిలుతు విజయవత్స! కవీంద్రా! ॥

ఉ॥ ధారకు సంతసించితి సుధారసమూరుచునుంటచే, నసా
ధారణరీతిఁ దోఁచెను యథాకవిభావము నీకుతెల్గు, బా
ర్త్రీరిచినట్లు పద్దెము లతిప్రమదంబు ఘటించెనాకు; నీ
భారవి యెల్లకాలము నభంగురమై విలసిల్లుఁగావుతన్॥

బ్ర॥ వాజపేయయాజుల రామసుబ్బారాయడుగారు., బి. యె.,
స్నేహలతా కవితా సంఘసభ్యులు — కొల్లాపురము.

గీ॥ భువనగిరివంశచంద్రుఁడవు; కవిగణము
లోన నుత్తమకవివీవు; గాన నర్థ
గౌరవంబున సాటియే కానరాని
"భారవి"ని దెలింగింపంగఁ బ్రజ్ఞగలిగె॥

ఉ॥ భారవిసత్కవీశ్వరుని"భారవిఁ" దెల్గునసేయు టెంతయుం
భారము, జంకుఁగొంకనెడుమాటయెలేక, కవిప్రకాండ "మా
హా! రమణీయ" మంచుఁగొనియాడెడురీతి రచించుట న్సుధా
సారముఁ జిల్కుచుండెను రసజ్ఞులు హెచ్చుగ మెచ్చునట్లుగన్॥

ఉ॥ మక్కికి మక్కి యన్నటుల మార్చిరచింపఁగలేదు, భావమం
దెక్కడ మార్పులేదు రసహీనత మందునకైనలేదు; పెం

పెక్కిననేర్పుపెంపున రచించినసత్కవివీవుగాన నే
చక్కని జూచిన న్మిగులచందము నందముఁ గందళించెడిన్॥
శా॥ ఏదో గ్రంథముకాను వ్రాయుటకు మీస్వేచ్ఛానుసారంబుగా
వాదంబేటికి? నిద్ది భారవికృతంబైయొప్పు కావ్యంబుసూ
లేదామె న్నవమేనిదోస మెచట, న్నిస్సార మెందైనను
న్లేదామె, న్సుధఁజిల్కుచందమున వాగ్గీల ల్ప్రకాశించెడిన్॥
ఉ॥ సత్యముఁ దాఁపనేల? నరసంబగుశైలియుఁ గావ్యశక్తియు
న్నిత్యములైన పోకడలు నూల్కొనునట్లు రచింపఁగా నసా
చిత్యముఁ గానరాదెచటఁ జెప్పఁగనేటికిఁ? గల్గు జన్మసా
హిత్యము, మోక్షముంగలుగు నింతటిసత్కృతి వ్రాసినందుకున్.

---

బ్రహ్మశ్రీ మహారాజశ్రీ O. Venkatarangam Puntulu Garu, B. A., B. L., Ranganayakula Peta, Nellore, 21-9-34.

అభినవభారవులగు బ్ర॥మ॥శ్రీ భువనగిరివిజయరామయ్య కవిగారికి.....................భారవి ప్రథమభాగముఁ జదివియుంటిని. కిరాతార్జునీయముం జదువుకోరికఁ గొనియుండ నప్రయత్నముగ నదిల భించి చాల సంతోషమైనది. ప్రథమభాగమువలననే తమ అత్యద్భుత కవితాశక్తి గోచరమైనది. అవధానఘట్ట మాశ్చర్యకల్పనగ నున్నది.

---

## "గృహలక్ష్మి" 1—8—1934.

శ్రీమదాంధ్ర కిరాతార్జునీయము—అర్థగౌరవమునకు గుఱి యైన భారవి నాంధ్రభాషాగౌరవభూషితుని ఆంధ్రావళి మోదముం బొరయున ట్లొనర్చినకవిగా రెంతయుసంస్తవ్యులు. సంస్కృతాంధ్ర పదము లల్లిబిల్లిగ నల్లుకొనిన యత్యంచిత పదౌచిత్యము గంభీరభావ ముల అనర్గళగమనమునకు శోభఁగూర్చుచు కవిగారికి పౌరాణికకవు లలో నొకవిశిష్టస్థానము నిచ్చుచున్నవి. కవులకుఁ, బండితులకు విద్యా ర్థులకు, సత్కావ్యసాధారణపఠనాసక్తులకు నెల్లరకు వారి వారి కను వగు హాయినిఁ గూర్చును.

శ్రీమత్సౌగంధికాపహరణాద్యనేక గ్రంథకర్తలగు

బ్ర॥ భువనగిరి బుచ్చిపరదేశిసోమయాజులుగారు

సబ్ కోర్టు, గుంటూరు. 10—1—1936

ఉ॥ భారవిఁ దెల్గుఁజేసి, గురుభావము లర్మిలిఁదెల్పి, యాంధ్రసే
వారతిసల్పి, సూరికవివాక్సుమపూజల నంది, నైజధా
రారచనంబుఁ గల్పన సరాసరిఁ బండితు "లౌ" ననంగ నే
తీరునఁ గూర్చితో కవిసుధీవర ! యోజయరామసత్కవీ ! ॥

సీ॥ ప్రవిమలాగ్నిష్టోమసవనసంతృప్తుఁడౌ
పట్టాభియజ్వప్రపౌత్రుఁ డితఁడు
సంస్కృతాంధ్ర విశాలసాహిత్యపాండిత్య భాసి
మంగయశాస్త్రిపౌత్రుఁ డితఁడు
లౌకికవ్యవహారచాకచక్య వివేక
ధారి పట్టార్యుని దత్తుఁ డితఁడు
వైద్యంబునందు ధన్వంతరి, పేరొజ్జ,
పట్టాభిరామార్యు పట్టి యితఁడు
సహజవంశాగత కవిత్వశాలి, శీలి
ధైర్యగాంభీర్యశాంత సంతతులపేటి
హూణవిద్యాబియే చిహ్నమూను మేటి
విజయరామార్యుకవితకు విజయమగుత॥

సీ॥ ప్రబలవీరరసంబు భావంబుఁ జూపుచో
దిగ్గజసంఘంబు దిమ్మవోవు
కరుణార్ద్రరసపుష్టి కల్పనల్కల్పుచోఁ
గాఠిన్యహృదయముల్కరిగిపోవు
శోకహాస్యరసాల సోకలఁ దెల్పుచోఁ
దత్తద్విధాన మందముగ వెలయు
విరివి ద్రాక్షాపాకవిధిఁ గవిత్వము నల్ల
గంగాతరంగ సంగతులుపొల్చు
సరసకవితావిధాన ప్రశస్తశక్తి
విమలభాషాప్రయోగ వివేకసూక్తి
శాంతసూనృత సద్వ్రతాచారపూర్తి
రమ్యగుణకీర్తి ! మాజయరామమూర్తి ॥

భగవద్గీతానువాదియగు మ॥ రా॥ శ్రీ పాటిబండ సూర్యనారాయణ రావుగారు, Vakil, గుంటూరు. 12-4-1936.

ఆర్యా!

క॥ అవలోకించితి నీభా
రవి ధారాశుద్ధి, భావరమణీయత, స
త్కవితాపటిమయు, రసభృ
న్నవత్వగరిమంబు, కల్పనాచాతురియున్॥

గీ॥ అరయ నొండొండు చాటుపద్యములుగావు
తలఁపఁగాఁ గొన్ని చిన్ని పొత్తములుగావు
నేరుతురె చేయ నిప్పటివార లిట్టి
భారవిమహాప్రసిద్ధకావ్యత్రయంబు!॥

క॥ రుచిరగతి హయాణకళ బ్ర
హ్మాచారి వనుకొంత! సంస్కృతాంధ్రమహాధీ
ప్రచురుఁడ వనిచాటు భవ
ద్రచనము భువనగిరి విజయరామసుధీంద్రా!॥

---

తర్కవేదాంతవిశారదులగు బ్ర॥ శ్రీ॥ ముదిగొండ వేంకటరామశాస్త్రి గారు, అఖిలాంధ్రదేశీయపండితపరిషత్కార్యదర్శి, ఓంకారమందిరము, బెల్లంకొండపోస్టు, గుంటూరుజిల్లా. 17-4-1936.

భో! భో! భువనగిరి విజయరామకవికులావతంసా!

తాము పంపినట్టి స్వకృతభారవిగ్రంథప్రథమతృతీయభాగముల విమర్శనదృష్టితోఁ జూడఁ గడంగితినిగాని యుపర్యుపరిపద్యగతరసా స్వాదోత్కలికపూర్వాపూర్వగ్రంథరచనాపరిశీలనదృష్టికి నిర్విషయతను గల్పించె. యావత్ప్రబంధవ్యాపిబ్రహ్మానందసబ్రహ్మచారియగు తత్త దుచితరసము ద్రాక్షాపాకనిష్పాదితమై సంతతధారగ సర్వావయవముల

నిరర్గళముగఁ బ్రవహించుచుండె. క్షీరశర్కరాప్రాయములగు నాంధ్ర గీర్వాణముల ననువైనమైత్రి సల్పి శయ్యను గడురమణీయముగ నమర్చితిరి. ప్రథమభాగములోని చరిత్రరచనానుకూలయథోచితగ్రాంథిక వ్యావహారికభాషాసంగ్రథనము తమ యద్వితీయచరిత్రరచనాపటిమను వెల్లడి సేయుచున్నది. ఇందు నవీనచరిత్రవిమర్శనపద్ధతియుఁ బొడసూపుచున్నది. తృతీయభాగములో భాషాంతరీకరణమే ప్రధానోద్దేశ్యముగా లేక భావానువాదము నేముఖ్యోద్దేశ్యముగ నిడుకొని యనువాదమునకుఁ గల ప్రధానాశయము చక్కఁగ నెలకొల్పఁబడి తమ యసదృశానువాద నైపుణిని జాటుచున్నది. ఇయ్యది పూర్వకవిరచితప్రబంధముల స్మరింప సేయుచు నాధునికనిర్వాచనీరసనియమాబద్ధసామర్థ్యాభావకృతభావ కవితాదండహ్యమానసాంప్రదాయికసుకవికులోజ్జీవకసుధాపూర మనుటలో సందియములేదు. ఐనను, నిందు "సుదుర్లభాస్సర్వమనోరమా గిరః" అనుభారవిసూక్తివిరోధ మొందు సంఘటిల్లిన దనకతప్పదు. స్వాశ్రమోచిభంగభయముచే "నారాయణ" యనిమాత్రమే ప్రత్యుత్తర మొసంగు సన్యాసులభంగి యాత్మగౌరవభంగభీరువులగు కొందఱుపండితులవలె నతిక్లుప్తముగ వ్రాయసహింపకయు, ననేకపండితప్రకాండుల సదభిప్రాయములతో నిండఁదగిన నీగ్రంథభూమికను విస్తారములగుమదుక్తుల నింతకంటె విస్తరించుటయుఁగూడ ననుచితమనియు నెంచి యింతతో విరమించుచున్నాఁడ.

---

విమర్శకాగ్రేసర మ.రా.శ్రీ. నాగపూడి కుప్పుస్వామయ్యగారు, వకీలు,
తిరుపతి, 29—4—1936.

అర్థగౌరవంబునఁ గావ్యంబులలో నెల్ల మిన్నయని పండితులందఱు వినుతించు భారవిమహాకవిరచితకిరాతార్జునీయమును భాషాంతరీకరణ మొనర్చుట కడిందిపనియయ్యును మీరు దాని నాంధ్రీకృతముగావించుట కరంబు శ్లాఘనీయము. మీభాషాంతరీకరణవైఖరి మిగులఁ జక్కగానున్నది. ఇందలిశైలి భాషాంతరమని తోఁపింపక సరళముగా

లలితముగా నొప్పారెడు. మీరు లౌకికవ్యవహారములందు (Govt. Service) మెలంగుచున్నను సారస్వతంబున నింతటిప్రౌఢిమ గడించుటయు నిట్టిసరసకవనంబు నిర్మాణముసేయుటయుఁ గడుంగడువినుతిపాత్రంబులు.

---

శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, Retired Senior Sanskrit Pandit, Maharajah's College, Vizianagaram. 9-5-1936.

"కవివర్యా!, తమరు దయతోఁ బంపిన కిరాతార్జునీయపరివర్తనము, భారవిచరిత్ర మొదలగుపుస్తకములు కొంతకాలముక్రిందటనే చేరినవి. ( * * * * * ) ఇదానీంతన కవిపుంగవు లెందరో సంస్కృతకావ్యపంచకము నాంధ్రీకరించి ముద్రితములైన యాపుస్తకముల నభిప్రాయనివేదనముకొఱకు నా యొద్దకుఁ బంపిరి. వాని నన్నింటిని యథాయథముగాఁ బరిశీలించి నాయభిప్రాయము నాగ్రంథప్రణేతలకు వెల్లడించితిని. మీగ్రంథము కూడ నట్టివానిలో నేకతమమనితలఁచి యొకచో నుంచితిని. నమ్ముండి!. సత్యముఁ బలుకుచున్నాను!. కొలఁదిదినములతరువాత నొకనాఁడు యాదృచ్ఛికముగా మీగ్రంథమును దెఱచి యిది యెట్లున్నదో చూతమని కుతూహలము గలవాఁడనై యచ్చటచ్చట స్థాలీపులాకన్యాయముగాఁ గొన్నిపద్యములఁ జదువఁగా "నబ్బబ్బా! యిది కంకంటిపాపరాజుగారి యుత్తరరామాయణము, పుష్పగిరి తిమ్మన్న సమీరకుమారవిజయము మొదలగు ప్రాచీనగ్రంథములను బోలియున్నదే! దీని నుపేక్షింపఁగూడ"దని యెంచి తదనర్గళకవితాచాతురీప్రలోభ్యమానమానసుండనై మాతృకనుబట్టుకొని యామూలాగ్రముగాఁ బదునెనిమిది సర్గలను జదివి సత్కావ్యరసాస్వాదసాహిత్యపూర్ణుఁడ నైతిని. ఇది, ఆంధ్రీకృతప్రబంధముకాదు. తత్కథామూలకముగా రచింపఁబడిన యొకనూతనకావ్యము ("Original Poem") ఇందు శ్రీనాథుని ధారా

శుద్ధియు, పోతనామాత్యుని యంత్యనియమసౌష్టవము నిబిడబంధము కానవచ్చుచున్నది. కవన మతినిర్దుష్టముగా నున్నది. భారవిభట్టు చరిత్ర మత్యద్భుతముగాఁ జిత్రింపఁబడినది. ఇందు మూలశ్లోకముల రసము బాగుగాఁ బోషింపఁబడినది మొదటిమూఁడుసర్గలలోఁ బ్రతిపాదింపఁబడిననీతి పరివర్తనమందు జక్కఁగాఁ గానవచ్చుచున్నది. మూలము ననుసరించి ప్రతిసర్గాంత పద్యమునందు "లక్ష్మి"శబ్దము సంగ్రహింపఁబడినది. కవిసామాన్యము పదన్యాసముఁ జేయఁజాలని దుర్గమగర్భకవితారూపమార్గ మీకవిశిఖామణి కత్యంతప్రహతమై యున్నట్లు కానవచ్చుచున్నది. ఇట్టిగ్రంథములు మఱికొన్ని యీకవివృషభుఁడు వ్రాయుటకుఁ దగిన దీర్ఘాయురారోగ్యాదుల నొసంగుఁగాకయని సర్వశక్తియగు సర్వేశ్వరునిఁ బ్రార్థించుచు నింతతో విరమించుచున్నాను.

---

ఓమ్.

# శ్రీమద్భారవి—ద్వితీయ భాగము.

## భారవి ప్రవాసము.

క॥ భారవి, జననీ జనకుల
కోరిక నట్లుత్రోసి యాత్రకుంబంపి యెటు
ల్తీరిచెఁ బ్రాయశ్చిత్తము
నారూఢి న్వినుఁడి తెలుపుదంతయు నిచటన్॥

చ॥ జనకులు యాత్రమై నరుగ "శ్వశ్రుగృహంబున కెట్టిసాకుతోఁ
జననగు"నంచు భారవి భృశంబుగ యోజనసేయుచుండె నె
మ్మన మెటుఁబాలుపోక; కచట మామయు భారవితండ్రిలేక యం
దినఁగని భార్యచెంత కరుదెంచి విషణ్ణత వింత తోఁపఁగన్॥ 2

ఉ॥ "బంతికి రండటంచు శుభపత్రికఁ బంప విశేషకౌతుకా
క్రాంతులమైతి, మేమియనఁగల్గుదు, మామయు నత్త మొన్న నే
వింతగయాత్రకేగిరట పిల్లని నింటనె నిల్పి, యేమి కా
వింతము ముచ్చట ల్జరుగువీలు వచింతువె?" నాఁగ నామెయున్॥ 3

క॥ ఏమంటిరి! వియ్యపువా
రీమాదిరి నెవరెఱుంగ కేగ నగత్యం
బేమయ్యెనో? దానిగతికి
మీమామీమాంస మడ్డమే? వగపేలా?॥ 4

క॥ ఉన్నాఁడుమగఁడు తోఁచిన
సన్నాహ మొనర్చు శుభముసంగతి మన కం
పన్నాయ మవల నెటుకా
నున్నది యట్లగును తెలియునో విధివిధముల్?॥ 5

క॥ అని నిశ్చయించి పలుకఁగ
విని యతఁడుఁ "దథా"స్తటంచు వేగమె శుభలే
ఖను వ్రాసి విప్రవరునొ
క్కని నల్లునికొఱకుఁగా నెకాయకి నని చెన్॥ 6

క॥ వచ్చినబాపని గౌరవ
మచ్చుపడ బహూకరించి, యతఁడేగఁగ, న
మ్మెచ్చున సమరినసాకున
కెచ్చుగు సంతసము మేని నింతగఁబెంపన్॥ 7

ఉ॥ మిక్కిలి నాప్తుఁడై వెలయుమిత్రుని నొక్కనిఁజీరి "నెచ్చెలీ!
యక్కఱకల్గె నోపినసహాయము నీవొనరింప నాకు, నీ
మక్కువఁజూపెదో? వెఱచిమానెదొ? తెల్పుము, ముందె నీమనం
బెక్కవచింతుఁ 'గారణము నే'మని కోరఁగరాదు మత్కృతిన్"॥ 8

మ॥ అనిన న్నమ్మతిఁజూపి యాహితుఁడు హస్తాగ్రంబున న్బాసఁజే
సిన నబ్భారవి తెల్పె "నోదయితుఁడా! 'శ్రేయాంసి విఘ్నాని'నా
వినవే? నీసమయంబు సళ్ళఁదగ దేవేళన్, గడున్బాపవ
ర్తనమై దుర్యశమిచ్చు నేరికిని మిత్రద్రోహ మెందేనియున్॥ 9

చ॥ కలదొకసద్వ్రతంబు, కడఁగాంచిన నాకగు మేలిసౌఖ్యము,
ల్వెలలెద నేఁడె దీక్షఁగొని, వేడుకనైనను నాప్రవాసవే
ళల నెట్టులైతి నన్గళవళంబుననైనను నన్నుఁగూర్చి రా
వలదు, నను న్మది న్దలఁపవల్వదు నేనరుదెంచు నంతకున్॥ 10

శా॥ నాకున్నామెుగ నీవె యొజ్జవయి సందర్భానుసారంబుగా
సాఁకన్జూడుము పాఠశాల, మఱి నాస్వాస్థ్యంబు లింతేని బీ
ర్వోకుండ న్గనుఁగొమ్ము, వైళ మిటఁ జేరు న్దండ్రి, యందాఁక నె
ట్లో కష్టంబిదినాఁక, స్వార్థముగ నీలుం గూర్చి నన్దేర్పుమా!"॥ 11

తే॥ అనుచు సకలంబు నాతని కప్పగించి
వలయుద్రవ్యంబుఁ గొని కొన్నివారములకుఁ
జేరె భారవి తనయత్తవారియిల్లు
లాలసమనంబునం దుబలాటపడుచు॥

సీ॥ ఊరివారెల్లరు నొప్పులకుప్పలొ
వృషభరాజంబులఁ బ్రీతిఁజూడ
నెనిమిదారేడులయీడు బావమఱందు:
లెదురుగా దుముకుచు నేగుదేఱ

నంతర్గృహంపువా తాయనాంతికమునఁ
బారి భార్యముఖము దోఁ బూచులాడ
నెలమిమీఱఁగ నత్త యెఱ్ఱనీరముతో ని
వాళింప వాకిట వార్చినిలువ
కొండగుహనుండి యలవోకఁ గొదమసింగ
మట్లు భారవి శకటంబు నవతరించె
పసిడిమైతళ త్తళలతో బటువుమోము
కళలు మెలిఁబొఱి కనువారి గారవింప॥ 13

తే॥ ఆత్మగృహమున కేతెంచునర్కుఁ బశ్చి
మాశ సాంధ్యారుణచ్ఛవినటులె యెఱ్ఱ
నీరు భారవిచుట్టు సొంపూరఁ దివిచి
వెనుక దిగఁబోసె నత్త సంప్రీతి వెలయ॥ 14

వ॥ తనసతియాదివాంగనను దారసిల న్గమకించుభాస్కరుణ్
వనగిరిగంధవాహములఁ బ్రామి ఘనంబుల నల్లువెట్టి శ్రీ
రవిధిని దానమార్చి మది రంజిలుప్రాక్సతిరీతిగాఁగ నా
తని జలకంబులార్చెఁ బ్రమదంబున శ్వశ్రువు గోము తేఱఁగన్॥ 15

వ॥ "నవనవమైనయందమున నాథుఁడు మింటఁజరింపఁ దృష్టిపా
లవు వెసఁబోయి రక్షనిడవమ్మ" యటన్నదివాంగనాజ్ఞ మే
ల్సవరణఁ బ్రాగ్దిశాసఖి వలత్సుమసౌరభధూపమేయునా
సవఁ బొగవైచె నత్త సరసంబగువాసనలీనుద్రవ్యముల్॥ 16

ఉ॥ కఱకఱఁబ్రొద్దులేవఁ బులకల్కొను నీరజపాళితోఁ జరా
చరములఁ బ్రజ్ఞఁగాంచువరుస న్బలుతోమినముత్యమట్లు సుం
దరతరవిగ్రహుండయి కనంబడుభారవిఁజూచి పత్నియొ
క్కరితయొకాక యూరిప్రజ కాంచెఁ గుతూహలితానుమోదమున్॥

సీ॥ కడుఁబెద్దపీటలేకావు బంగరుజరీ
పట్టంచుసేలుప ల్కట్టఁబెట్టఁ
బిండివంటలెకావు వెండిపాత్రల ఖాద్య
చోష్యపానీయము లొసరిది నొసఁగు

వీడియంబేకాదు పేరుఁబొందిన మేటి
పన్నీరు న త్తరు ల్పయి నమర్చుఁ
దూఁగుటుయ్యెలయెకాదు కరంబుమె త్తని
పాన్పుల నాయ త్తపఱచి చూపు.
"భారవీ!" యనిపిలుచుట పనికిరాదు
పండితుఁడుగారు బావగా ర్వారు వీరు
ననుచుకా క త్తవారింట నంద ఱతని
నాప్రవాసాదిదివసంబులందు నెందు॥ 18

క॥ "ఆగర్భశ్రీమంతుం
డాగౌరవ మెందులోపమగునొక దే!" యం
చాగుబ్బుఁగొనుచు శ్వశ్రువు
తాఁ గడఁక న్వలయువానిఁ దలఁచి ఘటించున్॥ 19

ఉ॥ చేసినపిండివంట మఱి చేయక పూటకొక్కరీతి నా
యాసమునా కమర్చు రుచు లన్నిఁట స్వర్గ మిఁకడ్డ్రవేలటై
డాసిన దన్నటు ల్తగి బెడంగగుమోద మెసంగఁ గ్రొత్త విం
తైసొగయింప న త్త బలమానుబలాటము శ క్తిఁబెంపగన్॥ 20

ఆ॥ చిన్నబంతి మున్నె చేసియుంట నతండు
వచ్చువెనుక వలయువానిఁ గూర్చి
ముచ్చట ల్చెలంగ మూఁడవరోజునఁ
బెద్దబంతి జరిగె ఫెళ్ళుమనగ॥ 21

క॥ "ఏమండీ! వరుఁ డ త్తయు
మామయుఁ జుట్టములు మంది మార్బల మఖిలం
బేమయ్యె? నన్నిటికి నొక
రే మీరైతిరె? యటన్న నెకసక్కెములున్॥ 22

క॥ "దరివెముఁ బఱవక యూరక
యరసెద రదియేమొ? యెఱుఁగరా! తోడిసమ
ర్త? ఋజువులేల? యింతటి
విరసమొ?" యను గేలిపలుకువిసరులు మలసెన్॥

సీ॥ "ఇంటికొనల్లుఁ డిం పెందులకే తెంచుఁ
బేరంటమున నైన ప్రీతిఁగాక?"
"యుండదే 'యుత్తమంబున్న తాసన' మని?
యెక్కుఁడీనయిదిబ్బ కెలమిమీఱ!"
"లేదె 'శ్రేష్ఠంప్రవాహోదక' మ్మనుమాట?
పెరటికాలువను జూపింప రేమె!"
"యాగుఁ డేమది! చూడుఁ డలిగినాఁ డాఁదూడ
పలుపుఁ దేరా! శాంతిపఱుపవలయు"
"నరయఁగా బావ యాడంగులందు జతక
దమ్మ! పెండ్లము పే ర్జెప్పుదాఁక మొగము
నుఱుఁగుఁ బో నీరుఁ బోయకుండుద"మటంచు
మేలము ల్బుట్టుఁ జెలరేగె మేరమీఱ॥ 24

క॥ వరుసలతో నరిశెలతో
దురుసులతో దొడ్డబంతి తోరఁపుముదము
న్గురిసెఁ బకపకలఁ బాటల
సరసంబుల వెలితిలేని సంరంభములన్॥ 25

క॥ సీతాశోకచిలుకలన
శ్వేతారుణముఖరవర్ణశృంగారములన్
బ్రీతినిడుచిలుకుచీరెల
నాతటి నైదువుల కట విహారము వెలసెన్॥ 26

॥ బంగరుగిండ్లతో మరునిబండ్లొకొ నా వలెవాటు పైఁటనీ
డం గడుగుత్తమాఱవికటంగుబిగి స్వప్రథఁజేసి చన్గొన
ల్పొంగుల నిక్కఁగా సొగసుపొంకము లంగజు మేటిమావులై
నింగికి నంగవింపఁ బసనింపిరి సొంపులపేరటాండ్రటన్! 27

॥ వరుదరిఁబీట్పై వెలయవచ్చుచు సాధ్వి సమర్తపెండ్లికూఁ
తురు తలవంచియు న్మెఱుఁగుదొంగలిరెప్పలఁ బక్ష్మరాజిలోఁ
దెరువుల నోరచూడ్కులఁ బతి న్దమిమీఱఁబ్రదక్షిణించి సం
బరమును హృదంబరంబున గబాగుబిఁజిందిడఁ జేరెఁ బీఠమున్॥ 28

మ॥ మోవి లడ్డంబయియుండఁ జెంగలువసొంపు ల్జందఱుం డెంతని
క్కియుఁ గన్గొఁగలఁడే? యటు ల్వరుఁ డట స్సీఁజూడ్కి నెక్లెంతతా
ర్చియు లజ్జానతశీర్ష యౌసతి ముఖశ్రీఁ జూడలేఁడయ్యె నా
పయి పెల్చ న్దలకట్టు స్వాక్షిరభసవ్యాపారము ల్నిల్పఁగన్॥ 29
మ॥ "చల మిట్లేటికిఁగొంటి నాపయిని లజ్జాదేవతా! మున్ని యే
న్గొలుపు ల్నీకొనరింతు నవ్వల, దయ న్గోపింప కొక్కింత నా
వలపుఁబ్రాణిముఖంబు నాకగుపడ న్నైబకెత్తఁగాని" మ్మట
న్దలఁపు ల్వ్యర్థములయ్యెఁబో చెవిటిచెంతన్ శంఖనాదంబుగన్॥ 30
ఉ॥ పూషుని బ్రొద్దుదిగ్గుడుపువుల్వలెఁ ద న్నెడమీక చెన్ను సం
తోషముఁ జూపుచూడ్కుల నెవఁరొక్కనుకాంతల కంటితోరణా
ల్భాషలఁగొల్పి యంటుశిల పట్టుగ దూఁకెడిసూదులై పడన్
బ్రోషితచిత్తుఁడై తనదుమోమును వంచు వరుండు మున్పునన్॥
శా॥ ఒయ్యారంబున 'సువ్వి-సువ్వి' యనుచు న్యోషామణు ల్చిమ్మిర్రి
న్నయ్యాటంబులఁగూర్చి పంచమముఁ బ్రస్తారించి దంప న్గిరు
ల్మ్రయ్యాట న్దివి ముప్పున న్బృథివి సంభూతోరుకంపంబుల
న్దియ్యంబిచ్చె సువాసినీ బహుసుధాదివ్యన్మహత్త్వంబునన్॥
ఉ॥ హారతిఁబట్టి మైదువలు హాయిగఁ బాటలఁబాడ నామని
న్నేరుపుఁ జూపుకోయిలల నిగ్గులు, వానలఁ గేకి షడ్జపు
న్దీరుపులు న్వరత్నమయదీప్తమరాళకలస్వనాళి యొ
య్యారము లాచు సుస్వరరసామృతవాహినిఁ గొల్ప నచ్చటన్॥ 31
చ॥ ఉబుసులు నెక్కసక్కెములు నొక్కెడ, వాయన మిచ్చుసందడు
ల్గబగబలాడుపిల్లబలగంబుల మాట లొకొక్కెడ న్మనం
బుబుకఁగఁజేయుపాటలు మఱొక్కెడనై తొలిప్రొద్దు పుల్గుకూఁ
తబిగిజిగి న్హసించుపసఁ దన్కె నట న్సకలస్వరప్రభల్॥
క॥ నగల న్నగవులఁ గొనినశి
నగలు న్జిమ్మిరి విడెంబు నవకంచుకము
న్దగునొడుల నొడికములతో
మ్ముగువలు చని రెల్లరధ్య మంగళమొనయన్॥

ఉ॥ ఆమటునాఁడు వేగుసమయంబున భారవి యాసుపోకకై
మామయుఁ గూడరాఁబొలమమంచియుఁజెట్టయుఁ జూడనేగియా
రామములు న్మడు ల్పయిరురంగములు న్బ్రకృతిప్రభ న్గళా
స్తోమముల న్గనంబరుపఁ జొక్కి కవిత్వరిరంస రేఁగఁగన్॥ 36

మ॥ వ్రతసంపూర్తికి నెన్నినాళ్ళగునో? నిర్వ్యాపారినై శ్వశ్రుసం
ధితసౌఖ్యంబులఁ గాలము న్బ్రథను జెందింపఁగ నేలా? యొదే
కతఁ గావ్యంబొనరింప మేలనుచు సంకల్పించి ద్వైపాయనో
దితమా భారతసంహిత న్సరళరాష్ట్రి న్గోరెఁ గర్మస్థితిన్॥ 37

ఉ॥ "ఎన్నియొగాధలుండ నదియేలొకొ చప్పన నామనంబు పో
యె న్నరుఁ డాకిరాతుఁడగునీశ్వరు నస్త్రము నొంపుదారిఁ? గా
నున్నభవిష్యదర్థముల నూహలె నాఁడు లటుండు రెండుఁ గా
నున్నది కాక మానఁగలదో?" యను నాత్మనిరూఢిఁబూనుచున్॥ 38

క॥ "భారత మష్టాదశప
ర్వారభటి న్వెలయుఁ దగదె యష్టాదశస
ర్గారోపణ మిందే"నని
కూరిచెఁ బెంపున్ ఘటించుకొని పదకంబున్॥ 39

॥ తక్కనభాగము ల్నిలిపి తా నటఁగాంచు ప్రకృత్యశేషస
మ్యక్కమనీయత ల్కవనమంగళదర్పణసీమ సత్సుధ
న్గ్రిక్కస్వరూపము ల్గొని ప్రకాశిల శిల్ప మనల్పనైపుణిన్
జెక్కె కరంబుజీవకళచె న్నడుగడ్డునఁ గైపుఁ గూర్పఁగన్॥ 40

॥ తనతోడ న్జనుదెంచువారు ప్రకృతిస్థప్రాభవోద్గానమం
చునె భావించి ముదంబుఁజెంద దిన మచ్చుద్దింపు గీర్వాణభా
షను నానాస్థలదర్శితాఖిలవిశేషంబు ల్సుధామాధురీ
ఘనధారాంచితసాధురీతిఁ దగువాక్కళ్యాణము ల్పెంపుగన్॥ 41

॥ పరికృతి న్జూచినచూడ్కితోనె రసవద్భావంబు చూపుం దెర
న్సకళ న్నెకొన నిశ్చలుండగుచు నంతర్యోజనాసక్తుఁడై
సకలంబుం గనునట్లు కన్గవ నిమేషత్యక్తమైయుండె నే
నొకటిం జూడఁడు తత్కళన్గవితపై నొప్పించుచిత్రక్రియన్ 42

శా॥ ఛాయాగ్రాహకమైనయంత్రముపయి న్సాంద్రోరునీలాంబర
వ్యాయామంబునుబోలి కన్గవపయి న్వర్తించుభ్రూక్షేపము
ల్సాయంబీయఁగ రెప్పలున్విరియఁ బక్ష్మద్వంద్వ మడ్డఁగ ను
చ్ఛాయప్రాకృతరూపము ల్సుకవితారంగంబుల న్గల్కుచోన్॥ 43

ఉ॥ పయ్యరతియ్యము న్విరులవాసన లెండప్రచండత ల్కడున్
డయ్యుట బాటసారులదడాదుడి సోపడువేళమించుట
ల్కయ్యుడుగోవుల న్గనఁడు గొణ్గుచు లక్ష్యము లేనిపోబడి
న్గొయ్యియు మెట్టునాక తిరుగు న్గవితావరసృష్టిఁ గొల్పుచున్॥ 44

శా॥ వింధ్యాప్రాంతముల న్జరించునెడఁ దద్వీథీవనాగ్రాళిపై
సంధ్యారాగముతోడఁ దెమ్మెరలు హెచ్చ న్రంగసౌందర్యసౌ
గంధ్యశ్రీల ననేకయోగములుగాఁ గన్పింప గీర్వాణికా
వంధ్యప్రౌఢిమ నల్లు శ్లోకతతి భావంబెంతొ సంధిల్లఁగన్॥ 45

మ॥ గిరిపై కేగెడిచోఁ గనంబడునదీకృత్స్నోరుసంపాతము
ల్దఱియంజేరి ప్రపాతభిన్నజలవేల్లచ్ఛీకరావర్తఘో
రరయోద్వేగబహుప్రచారగురుసంరంభంబుల న్గంటిముం
దఱఁ గన్పించునటు ల్రచించు సువచోనైపుణ్యపుంజిత్రముల్॥ 46

శా॥ గిర్యుత్సంగమున న్శిలాసనమున న్గద్దిండుగా వ్రాలి సా
కర్యంబుం జిఱుగాడ్పుకూర్ప దిగువ న్గన్పించు కేళీవనాం
తర్యామిక్రియమాణలీలఁ గనినంత న్దివ్యశృంగారవా
గ్ధుర్యత్వంబునఁ దత్ప్రదర్శనము పొందు ల్దింపు శ్లోకావనిన్॥ 47

శా॥ వర్షద్వారిదమందుఁదూఱి రవిభాస్వచ్ఛాఖ లావైపున
న్హర్షంబిచ్చుచు శ్వేతమేఘమునఁ బెక్కాభ ల్ప్రదర్శించుటై
కర్షాముఖ్యజగంబు చిత్కళికలోఁగాఁదూఱి గీర్వాణిలో
శీర్షప్రాయకవిత్వమై గురుయశశ్శ్రీనిల్పె నబ్భారవిన్॥

సీ॥ హారితపున్మోకమాలు హరువు తివాసులా
గడ్డిపట్టుల నవకంబుఁ బుణికి
సుత్త్రెవే ల్లమరుక్రొంగ్రొత్తసీసపురేకు
నెఱిసీటితళ్కు లన్నియుగ్రహించి

పచ్చరాసుంద్రంపు పరవళ్లుగా నూఁగి
పడుపైర్ల గొనబెల్ల వడియఁగట్టి
రిక్కమిన్కులమిన్ను రీతిఁ దొమ్మిదిరాల
మెఱుపుకొండలసొంపు మించనూఁది
మహితసంజీవనౌషధిమాద్రి దివ్య
కవిత కావ్యాకృతి స్జీవగఱ్ఱగాఁగ
ధ్వన్యలంకారపటిమ లాదముల వెలయఁ
బరపె సత్కృతి భారవిబ్రహ్మ లీల ॥ 49

ఉ॥ ఇంటికడ స్జైలంగునపు డెల్లెడఁ దా గుణియించు శ్లోకము
ల్గంటముఁ దాఁటియాకుఁగొని క్రమతరాక్షరరూపమిచ్చు, నీ
వెంటఁ బ్రవాసవారములు వేగుచునుండఁగ నత్త యొక్కనాఁ
డొంటరి బువ్వఁబెట్టి పెడనుండి యిటుల్వచియించె వానితోఁ॥ 50

క॥ “అల్లుఁడుగారూ! మానఁగ
నొల్లక మర్యాద కెద్దియో చేసెద, రా
ట్టలజులవిం దెఱుఁగుమీా
యుల్లంబున కివియుఁ దృప్తి నొసఁగంగలవే? ” 51

శా॥ “ఉప్పే హెచ్చెనొ? కారమేమిగిలెనో? యొక్కింత పాకంబులోఁ
దప్పేకల్గెనొ? లోపమయ్యెనొకొ? చెంత న్నీజను ల్లేమినో?
పప్పు న్నార్వలదందు రేల? యివె యీపచ్చళ్లు బాగుండవే?
యప్పాలైన రుచింపవే? బిడియమేలయ్యా! వడ ల్తెత్తునా? ” 52

ఉ॥ ముప్పొరిఁ గావ్యసృష్టి మనము న్బనవేయుచునుంటచే నతం
డెప్పుడుఁ దద్గతాత్ముఁడయి యింతయెఱుంగఁడు బానసంబులో
నుప్పెకొ అంతయో యెది యెటుండెనొ? నిత్యవిధానమాత్రమై
చొప్పడె భోజనం బతనిచొప్పు విచిత్రముకాదె యత్తకున్॥ 53

ఉ॥ “పిల్లలకోడికట్టు లెడపిల్లలెకా కొకచంటివానిని
న్జల్లనిదైవ మిచ్చు టదిసంతసమైనను జద్ది వేఁడి వ
రిల్లఁగఁజేయ నొక్కతన. తేకువఁ బూనిననైన వంట సం
ధిల్లదు వేళపట్టునకు నీకెటు నచ్చునొనర్చుదాననో! ” 54

ఉ॥ సిబ్బితికత్తెకూఁతు రది చేసెడిసుంతయుమాని మూలల
న్గబ్బిగఁదూఱు, నబ్బురము! కార్యముపట్టుల సిగ్గెఱుంగ, మా
యబ్బ పొలానకేగి తఱికందరు ప్రొద్దటుప్రాలుదాఁక, మా
కబ్బెసమయ్యెఁ గోమలుఁడ వాఁగుదు వెట్టుల నీవు నంతకున్॥ 55

చ॥ ఇరువదియైన లేనువయ సింకను లేముకుపచ్చలాఱు వా
ర్తురకటులే సజీవపితరుండవు నీకును నీమమేల? న
ల్వురుపసివాండ్రతోఁ జలిదిభోజన మానుము రేపునుండియు
న్జిఱుతలు మూడుపూటలు భుజించుట సౌఖ్యముఁబాట కాదొకో?॥”

తే॥ అనుచు గొడవగఁ బల్కెడి యత్తఁ జూచి
“నీకుమారులలోపల నేనొకండఁ
గాఁగ నఱయుంగదమ్మ! శంకలఁ ద్యజించి
యత్తయన నమ్మయనఁగ వ్యత్యాసమున్నె?”॥ 57

మ॥ అని యల్లుండు వచింప “నబ్బె! నను నీ వల్లెంచవ న్బుద్ధిఁగా
దు, నయంబు న్మది నీవెఱుంగవొకొ! యేదోపిచ్చియుంబాటిగా
ననుచుందు న్మడిమైల కొక్కరిత నేనై యుంట, నన్యంబుగాఁ
గొనఁగాఁబోకుము, సాధ్యమైనసుఖము న్గూర్పంగ శంకింతునే!॥ 58

తే॥ చంటివానికి నుగ్గిడి జలకమార్చి
నిదురఁబుచ్చి మఱందుల నీటఁగడిగి
చలిదిఁగుడిపించి పాల్చేసి చనఁగవలయు
నేటి కల్లాటఁ జెప్పఁగా నింతవలనె॥ 59

క॥ కోడండ్రిరువు రొకట నీ
రాడంగాఁ బుట్టినిండ్ల కరిగిరి భర్త
ల్వాడల జాడల ద్రవ్యముఁ
గూడంబెట్టుకొనువాంఛఁ గొని చనినారల్॥ 60

క॥ ఈబాన తండ్రితోఁజనుఁ
దా బోనముఁ దినుటకొఱకు దప్పిన నిటకు
న్రాఁబోఁడు, బయట లోపలఁ
గాఁబట్టేనవల్ల నేన కనుఁగొనవలయున్॥ 61

శా॥ అమ్మాయీ! పెరుఁగిమ్మటంచఱచి జాగయ్యె న్నీవన్నేదె? యే
మమ్మా! తెచ్చినదాన వాగడప చాఁపారీతిఁగాకున్న ని
ట్లిమ్మె న్నుంచినఁగాదె, సిగ్గయినఁ బోనిమ్ములి దేపెర్గునా
సొమ్ములోప్పవునో? నోటిముత్యముల కచ్చో ప్రాలుటల్కల్గునో?॥

ఉ॥ ఊరకపల్కరే తెలివియొప్పినపెద్దలు కాపురంబు లిం
పారుట కంగన ల్పనుల నారయ మంత్రిగ సేవ దాసిగా
మీఱినచెల్మితో మగనిమెప్పు గడించుట సేమమంచు? నీ
తీరిది, యన్న తండ్రి వ్యథఁద్రిప్పుట లమ్మొయి, నేమిసేయుదుర్? ”

క॥ మొదలిడిన సోదె వదలదు
చదురును సాధింపు నీతిసందర్భములుం
బొదివి కలగూరగంపగ
గుదులువడ న్పణుగు సహజకోపన యగుటన్॥ 64

సీ. అత్తవారింటికిఁ గ్రొత్తల్లుఁడే తేఱ
ముఱిపెంబు ముచ్చట మూఁడునాళ్లు
తరువాతఁ బరిపాటిఁ దారసిల్లును “బజా
ర్లోవోయి! పిల్లలఁ బోరుతీఱ
నాడింపవోయి! యుయ్యాల నూఁచఁగదోయి!
వాగునీరంబులఁ దేఁగదోయి!
పాల్తీయవోయి! యాపరగడపొలమువై
పేగి కూరలఁ గొనిరాఁగదోయి!

తే॥ లేవువి స్తళ్లు కుట్టంగ లేవె? జీత
గాఁడు నడ్డబడె న్బాలికట్ట యదిగో!
కట్టెల న్నన్నఁగాఁ జీల్పఁగలవె! యనుచు
మెట్లవరుసను మర్యాద మిడికి యుడుగు॥ 65

క॥ అలుసెక్కనెక్క గాలికిఁ
బలుచనమై జీతగాండ్రఁ బనిపంపునవ
స్థలకు గుఱియగును మెలకువఁ
దెలియక యత్తింట నిలుచు దైబెకు వరుసన్॥ 66

చ॥ రుసరుసలాడుకొంచును నోరులివ్వనుఱెంచక కుక్కపిల్లిపైఁ
గసరులలో నిడన్నెడను గానివియైనవిఁ జొన్పి రంజన
త్త సరసవృత్తి మెట్లుదిగుదారిని దొల్తఁ బరాపదేశవా
గ్విసరము లాపయి న్వదలి కేవలభాషఁ బ్రయోగమూనెడున్॥ 67

ఉ॥ భారవి తాను పెన్జదువువాఁడయిన న్గలిమిన్జెలంగిన
స్వైరుగడించియుండినను బెద్దగరూపసియైన మిన్నున
న్దారుచు నేల నుట్టిపడిన న్బరిపాటిగఁ జెల్లుతీరుపు
ల్మారుప నేరుపొందునె క్రమంబునకు న్దొలఁగంగనేర్చునే? ॥ 68

సీ॥ "పిల్లవాఁడేడ్చుట వినరాదె యేరికి
నేమిజాణతనంబొ యెఱుఁగమమ్మ!
గోళ్లుగిల్లుకొనుచుఁ గూర్చున్నఁ బ్రొద్దెట్లు
పోవునో యెఱుక కాఁబోవదమ్మ!
కూర్చుండి కుండల గుఱ్ఱముల్తోలెడి
మగవారు మగువలే యగుదురమ్మ!
తిరిగి యాడుదిసెడుఁ దిరుగక మగవాఁడు
సెడునంట పెద్దల నుడిగదమ్మ!
తే॥ కలుగుమాత్రంబుఁ దిని యొడల్కదలకుండ
నట్టనడిమంచమున బరుండగను గ్రొత్త
లేఁతబాలింతయని మందలింపరమ్మ!"
యనుచు వార్వ్వరితో నత్త యాడుచుండ॥ 69

క॥ వినియు న్విననట్టులు కవి
తనుఁగాదనుకొంచుఁ గొంతతటకాపడు, నా
యన యమ్మ మును తెలిపియుం
డిన యనుభవమునకు నాంది డిగె నని తలఁచున్॥ 70

తే॥ తద్దయును గైతలోఁ బరధ్యానుఁడయ్యెఁ
దెలివిలోనఁ జిచింద్రిపోకలను మించు
చుఱు [illegible]గలవాఁడు భారవి చూడలేఁడె
యింతకంతకు [illegible]డుగు మర్యాద నచట? ॥ 71

సీ॥ పెద్దపీటలు వానిపెంపు ప్రమోయుటమాని
యటుకపైఁ దమపెంపు లమరవెలసె
వెలసెల్లు దుస్తులు వెండిచెంబులు 'దృష్టి
యనియేమొ భోషాణమందుఁ దూఁగె
తూఁగుటుయ్యెల యింట జాగ చాలదటంచు
వెలిముట్టుగదిలోఁ బ్రవేశమొందె
నింద్రజాలవిశేషమేమొకో! పిండివం
టలు పోయి పెటుకుతంటలుగ మాఱె
తే॥ గారుగీరు లంతంతకుఁ గాఱులగుటఁ
ద్యాజ్యమట్టులుగాఁ బరిత్యాజ్యములయి
మైపులేకుండనణఁగె రావయ్య! రార!
యనెడుమర్యాద లచ్చోటులాక్రమింప॥ 72
తే॥ ఆవినీలాంబరమున సాంద్రాసితాంబు
దంబునాఁ బాలకడలి విషంబు నాఁగ
భారవి కవిత్వసృష్టి వెన్నాటునొంది
మడఁగఁ జెలరేగె నిత్యావమాన మచట॥ 73
వ॥ అంతనొక్కనాఁడు గృహస్థు భార్యం దఱిసి॥ 74
ఉ॥ "బంతికి వచ్చినాఁడు, బహువారములయ్యెను పోఁడు వింతలో
వింత యిదేమొ! తండ్రికిని వీనికిఁ బోరెదియైనఁ గల్గెనో!
శాంతుఁడతండు పెన్నరభసంబున యాత్రలకేగనేల? యీ
చెంతల వీని నిల్పుకొనఁ జెల్లదు, నిందకుమూలమయ్యెడున్॥ 75
మ॥ 'ఇదియేమీ?' యనరాదు, 'వాదెసఁగు నీ విందుండ'కన్నాదు 'పో
యెదవీవెప్పు' డనంగరాదు యువకుం డీతండెటుల్పల్కునె
య్యదిగానెంచునో? కాన మంచిగనె సేద్యంబందుఁ జొప్పింప భీ
ప్రదమా దానికిజంకి వాఁడె యరుగు న్సవ్గ్రాహమొందంచునున్॥ 76
వ॥ అనిసంప్రతించుకొని మఱునాఁటి యిష్టగోష్ఠిలో॥ 77
సీ॥ "కలప్పులోనే స్థితగాఁడేల మన"కని
గోముగా మామయ్య గొణిగెఁగొంత

"తితిక్షఁ గలఁడు సందేహింపఁడితఁ"డంచుఁ
దీటుగా నత్తయ్య తీర్పుఁజెప్పె
"నెండవానలఁ జేల నేనొక్కరుఁడ నేల"
పంపుఁ డీతని"నంచు బావ మొఱగె
"పనిపాట లేకుంటఁ బాఠంబుపేర్జెప్పి
మమ్మేఁచు" ననుచాడి మఱఁది కలిపె
తే॥ లేని వున్నవి యురక కల్పించి "వట్టి
వ్యర్థుఁ డితఁ"డని సేవకు ల్వాదరి రిట్టి
తంపులన్నియు మిగుల వాస్తవము లనుచు
నత్తమామలు భారవి నజలు కోర॥ 78

తే॥ మాటకోర్వని పరమాభిమాని, యిట్టి
వేళలందెల్లఁ బోరి గంతువేయు చిత్త
వృత్తి కవయవములు సముద్వృత్తిఁ దొడుగ
యత్నమున లోనసేమ్రింగు నతఁడు ధృతిని॥ 79

సీ॥ 'వలదురా'యని తండ్రి వారింప వినఁబోక
సాహసంబునఁ గ్రేళ్లు సాఁచినాఁడ
గొలగొలఁ గన్నీరు లొలయ వేడెడుతల్లి
మురిపెంబుసెడ వెన్ను విఱిచినాఁడ
నింట రోష్టాకయింతయేని లే కుండెడు
తల్లిదండ్రుల వెల్లఁ దఱిమినాఁడ
నాయొజ్జతనమునే నమ్మినమిత్రుల
కాంక్షలన్నియు నీటఁ గలిపినాఁడ
తే॥ సౌఖ్యపదమని స్వర్గంబుసాటి దనుచు
మించుకుతుకాన గ్రుక్కిళ్లుమ్రింగినాఁడ
మొదటిసాహసమున మేలిబుద్ధిఁగొనక
మఱల నీ తెంపుఁ గయికొంటి నరయ లేక॥ 80

తే॥ గీ॥ సలుపరా దెట్టిపని నేని సాహసించి
యాపదలపుట్టయవివేక మరసి తలఁచి

ఫ్రాన గుణములకై వాఁచిపోవు సిరులు
తమకమెగయంగ వరియించుఁ దమకుదామె॥ 81

సీ॥ ఆదరభయముల నడఁగి పెనంగుమ
ర్యాదఁ జూపెడి నాఁటి యత్తకాదు
గౌరవంబు ముదంబుఁ గడఁకయు మిగులఁ బ్రే
మముఁ జూపు నాఁటి మామయునుగాఁడు
స్నేహంబు నడఁకువ నించి యొప్పిడు నాఁటి
యాబావమఱఁదులునైనఁగారు
కనుసన్న సేవఁ జక్కఁగనొనర్చెడి యోర్పు
గల నాఁటి దాసులుంగారు నేఁడు
భళిర! వెకలుండనై నేను పన్నుకొనిన
గాలిమేడలు బుడబుడ న్గూలఁదొడఁగె,
భార్యయొక్కతె మిగిలె నాబారుబూరు
వీరితోపాటకాకుండ వేఁటుపడునె!॥. 82

తే॥ మిగులుచనవున నిరసనమేషలంబు
హెచ్చురాపిడికిని మంటయేషలంబు
కలిగె నొక్కటి యింతకుఁ గడుపునిండ
నేనును శరింప రాకుండునే విరసము॥. 83

మ॥ ఇసిరో! యంగముల స్బలంబఱుగ నిట్లేలా! అధైర్యంబు పై
ముసరున్? జా, ల్మనుముం దిఁకెంతకలదో మూన్నాళ్ళకే యిట్టిపె
న్విసువుంబూన భవిష్య మెట్లుజరుగు న్విశ్వేశ విశ్వాసినై
దోసఁగో మంచియొ మానమూని భరియింతు న్మద్విధాపూర్తికై॥

క॥ అనునిశ్చయమున నెవరే
మనిన న్మఱుమాటఁ బలుక కొంతఁడు పనులం
బొనరింపఁ దొడఁగె జడభర
తునివిధమున; నొసటివ్రాతఁ దుడుపన్గలరే?॥ 85

క॥ ఒకపనినైనను మునుసే
యకయుండుట నన్నికొత్తలై, ఫూనినవా

నికి యవకతవక తొడరుటఁ
బ్రకటపుఁజీవాట్లు ముసిరెఁ బ్రతినిమిషమునన్॥ 86

సీ॥ పాలఁదీయఁగఁ దోడుపాలచెంబీయఁ బూ
ర్తిగఁదీయలేక దొర్లించె దానిఁ
'గావడి నీరంబుఁ గైకొని ర'మ్మన
న్బట్టెఱుంగక పంట్లు పగుల నడిచెఁ
'గవ్వంబుతో మజ్జిగ న్జిల్కు' మనఁ ద్రిప్పు
వీ ద్రామిచేఁ గుండ వ్రీలఁ జేసెఁ
'బసరాల బీటిలోపల మేపు'మన నిర్గు
పొర్గువారల జట్టిపుట్ట నడిపె
'నరక దున్ను'మన న్వాలు నరయలేక
కఱ్ఱుకొన యొద్దుగిట్టెలో గాడఁదోలెఁ
బండితుండగు భారవిభట్టు స్వాను
భవకళాశాలఁ దొలిపాఠపఠనవేళ॥ 87

సీ॥ 'పోటేయు' మన దంపుపొత్తు రాకడరించె
ఱోఁకలి రోఁకళ్లు డీకొనంగఁ
'బిండిగుబ్బ' మనంగ బెడిసెడియులవలు
రోటిచుట్టుం జింద మీఱెఁ బాత్ర
'యింధనంబులఁ జీల్చుమీ' యన గొడ్డలి
కఱ్ఱ విఱుగవైచెఁ గాటుపడక
'పాపటంబునఁ గల్పుఁ బాయఁదోలు' మనంగఁ
బైరుచాళ్ళే లేచిపాయఁ దోలె
నత్తయుంభార్య యొకట ముట్టైన వంట
సంకటియు ననుబాంసుగా సంతరించెఁ
బండితుండగు భారవిభట్టు స్వాను
భవకళాశాలఁ దొలిపాఠపఠనవేళ॥ 88

ఉ॥ ఎప్పుడు నెండకన్నెఱుఁగ కెంతయొగోమున నుండుపిల్లవాఁ
డిప్పుడు ప్రొద్దుతూలువఱ కెఱ్ఱనియెండఁ బొలంబుఁగాయ మై

నొప్పిన కుందనంపుజిగిమెప్పులు కంది పసందు డిందఁగాఁ
గప్పినయ న్మలంబునవకంబును మాతెను నాఁడునాఁటికిన్॥ 89
చ॥ వ్రతమునఁబట్టు, బిట్టనుభవంబు గడించుతలంపుతెంపు ను
ద్ధతముగనుంట నోర్చి నతఁ డన్యుల కోర్వవశంబె సేద్యపు
వ్రతనమునందుఁ బ్రత్యహము సంభవమౌపెనుసంకటంబు? సం
తతముఁ దదీయవృత్తియె ప్రధానముగాఁగనువారు తక్కఁగన్॥ 90
ఉ॥ కంపలు కండెలెక్కఁ బెనుకంటకము ల్మొయినిండ గాడ నో
రెండఁగ బొబ్బలెత్త నడుమెంతయొనొవ్వఁగఁ గాళ్ళు నేలపై
నుండక త్రొట్రునొంద క్షుధ యోర్వఁగరాకచెలంగుచుండఁ బే
రెండల నిండువెన్నెలల నెట్టులుండఁగఁబో ల్పొలంబులన్॥ 91
ఉ॥ కాళులఁ బిట్టిగడ్డ ములుగాఁబారి గ్రుచ్చుకొనంగఁ జేనిలోఁ
జాళులు వంపులేక కొనసాగఁగఁ గొంట్రలు తప్పకుండ నె
వ్వేళ నిటట్టు లెడ్లురక పీకఁగనీయక మేఁడినాగలు
ల్వాళిఁ గయిన్గ్రహించి తిరుగాడుచు దుక్కిని దున్నఁగావలెన్॥ 92
మ॥ సరిచా ళ్ళాపయిమూలచాళ్ళు మడక న్సాధించి పైచా ల్వెద
ల్వఁజల న్బాపట మంతఁదోలి కలుపు ల్పాలించి కాపూని యే
తిరుగాటే న్దిన మెన్నొ యామడలుగా దేహంబు నొవ్వెత్త 'ను
స్సు' రన న్దీరిక సుంతనీక యలయించు న్సేద్య మెవ్వారలన్॥ 93
చ॥ పశువులబంతి నూటిపిడిపట్టునఁ గాళులు గడ్డిచిక్కన
న్గశలగువడ్లముండ్లఁ గడగండ్లుపడ న్నడినెత్తిమాఁడ నూఁ
గు శలములై యొడల్నవయఁగుచ్చుకొన న్దగ రేఁగ దుమ్మునె
న్గశికగ ముక్కునిండ దడ గ్రాచఁగఁ దోలఁగఁబోలుఁదాలిమిన్॥ 94
ఉ॥ ఎంతటిగాసిసోఁకిన 'నిదే' మని సాంత్వనమూనువారు లే
కంతయు లోననే కుములు నాత్మకృతంబయియుంట నోర్చి కా
సంతయు నొండ్లకు న్దెలుప కాతఁడు కృత్యము లాచరించుచో
వంతకువంతకాదె పయి వంకలుపెట్టెడువారలుండినన్॥ 95
సీ॥ ఎండసోఁకున నన్నమిందకుండినఁ జేలఁ
గంకు లొల్చితె యంచుఁ గంకువారు

పదము బొబ్బల గుంటఁ బొతిన నేరేయి
గోడదూఁకితి వంచు గొణుగువారు
తొడలు కండెలుకట్టి నడక గెంటిసలాడ
నమ్మసొమ్ములుసోఁకె ననెడివారు
నానాఁటఁ దనువున నవకంబు నవయంగ
కడ్డిపాటెడినంచుఁ గ్రాచువారు
మోఁపు కడుఁబెద్దదే! యెట్టులోపి తెచ్చి
నాఁడ! వీఁక గొడ్లు బలియవే! యనెడువారు
గాఁగ నత్తింటఁ గలుగుసౌఖ్యమున నతఁడు
పరవశత్వంబు నిజముగాఁ బడయుచుండె॥ 96

వ॥ "కెలడస్కో" పికచిత్రరూపములపోల్కి న్నిత్యముం గ్రొత్తవింతలకై నేతలమార్పులన్ బ్రకృతి చింతల్బాపి కావ్యాంగభూషలకౌ భాషల కామెత లోకులుపుసత్సామగ్రి పెన్నిండుగా వెలయింప న్గవి కొంతకొంత మఱచు న్వేంద్రడంబుతీంద్రడంబులన్॥ 97

చ॥ మనసు దృఢంబెయైనఁ గవిమాన్యుఁడు భారవి గాసిపెల్లు సోఁకినయెడ గుండెజాఱఁ బెడక్రేవ నొకండయి తొంటి స్వప్రవర్తనమును నేఁటిపాటు లెడఁద న్సరిజూటఁ జెలంగఁ బొర్లుపొర్లున విడిఁబొఱువంత నెటులో దిగమ్రింగుచు నిట్లు వావిడున్॥ 98

వ॥ "అమ్మా! నేను బలవంతమొనర్పఁ దండ్రి శ్వశ్రుగృహప్రవాసమును నాకు శిక్షగా విధించునాఁడు నాపైఁ బ్రేమమున నట్లున్మలించితి వనుకుంటిని కాని నీజాలినుడులే యనుభవసిద్ధములని యెఱుంగనైతి. జననీ! 99

తే॥ "అడిగిన న్బెట్ట కపరాధ మరయుచోటఁ
గటికచీఁకటిఁ గష్టంబుఁ గనినచోటఁ
గథలుఁ గారుణ్యము లటంచుఁ గసరుచోట
మిట్టమిడియొడఁ బొలమేగ నెట్టుచోట" 100

వ॥ నాపసికూన నెట్లునెట్టసమకట్టితి రంటివికాదే? ఆహా! ఏమివాక్యములు! నాకిప్పు డెట్టులనుభవమునకు వచ్చుచున్నవి! 101

తే॥ అడిగిన న్బెట్ట కపరాధ మరయుటేమొ!
యడుగుటకె లేమ తప్పెన్ను టధికమయ్యె;
కటికచీఁకటిఁ గష్టంబుఁ గనమియేమొ?
రేఁబవ ల్చీఁకటియె దాపరించె నిచట॥ 102

తే॥ కథలుఁ గారుణ్యములటంచుఁ గసరుటేమొ?
ఆకుఁ జేపట్టఁ దప్పయ్యె నమ్మ మిగుల!
మిట్టమిడియొడఁ బొలమేగ నెట్టుటేమొ?
పొలమె యిల్లయ్యె నేమిచెప్పుదును తల్లి!॥ 103

సీ॥ దుముదుములాడు చెందును దోసములెయెన్న
నత్త బాడింపు సుంతైన విడక
తుమ్మలలోనఁ బ్రొద్దుం గ్రుంకు చందాన
మొగముగంటున మామ ముడిగిసురుగు
తంపుకాండ్రము ప్రల్లదంబుల నుడుకుఁజూ
పుల బావమఱఁదులు గొలుపుఁచుఱుకు
నీసడింపుల గేలియికిలింపులను బొర్గ
త్రిమ్మరు ప్రోసంపుఁ జుమ్మఁ బెంతు
రూరిపెద్దలుఁ బెనుజాలినొప్పకనుల
గబ్బినుడుల సంతాపంబు లుబ్బఁ గాంత్రు
కుడిచి కూర్చుండి చెక్కెరా కూఁతుజబ్బ
యనఁగఁ బైఁ దెచ్చికొంటి నిట్లార్తి నకట! ॥ 104

తే॥ మామయఁట! యత్తయఁట! బావమఱఁదులంట!
భార్యయఁట! పెద్దగంపంతబలగమంట!
పాఁడియఁట! పంటయఁట! గొప్పభాగ్యమంట!
నేఁటినిప్పచ్చరమున కన్నియును దవ్వె॥ 105

* తే॥ ఆప్తులుండియు నేకాకియైనవాని
కెద్దియును రమ్యముగఁ దోఁప దింతయేల?

---

* తదా రమ్యాణ్యరమ్యాణి ప్రియాఃశల్యం తదాసవః తదైకాకీ సబంధుస్స ష్టేన రహితో యదా॥

తుదకుఁ దనప్రాణములనె చెందును విరక్తి
నిస్సహాయత కొలుపదే నిస్పృహతను ?॥ 106

ఉ॥ హాయి నికామగామియయి యన్ని తెఱంగుల మాపుదాడుతోఁ
బోయెడిమానసం బిపుడు బొత్తుగ విప్పఁగొనంగఁబోదు పై
డాయుచు ముంచు చిక్కులకడంగరము ల్పొరమీఁదట న్పొర
ల్మాయుచుఁ జుట్టుముట్టుకొన బూడిదబ్రుంగిన నిప్పుపోలికన్॥ 107

మ॥ అణఁగన్ద్రొక్కెడుచింత పెల్లదుమ నన్యాయత్తుఁడైయుండ ధం
ధణల న్మామయె బావయో దరిసి “దొంగా! దుంగ! పైర్గాచుల
క్షణమా యియ్యది !” యంచు దద్దటిలఁ గేకల్వెట్టి ధట్టింపఁ ద
త్క్షణమే మాంద్యము పాఱిపో నడిసెల న్దాఁటించు రాల్చెనిపై॥
తే॥ బావిలోనికి దిగుచుండువాని కాదిఁ
బ్రాణ ముక్కిరిబిక్కిరి యౌచుఁ బిదప
నచటిగాలికిఁ బనుపడునట్టు లతఁడు
వఱలుదినచర్య కం దలవాటుపడియె॥ 109

చ॥ ఇటులు ప్రవాసమందుఁ దన కేర్పడుతాత్కికశిక్ష నాతఁ డ
ప్పటికను వైనపోబడిని వర్తిలి రోజులు బుచ్చ లక్ష్మి యా
ఘటకునిభార్య యేవరుసఁగా గ్రెలెనటందువె ? పాఠకార్య ! య
చ్చటిసకలంబును న్మనవిసల్పెదఁ గౌతుకమెల్ల తీఱఁగన్॥ 110

తే॥ తల్లితో వేగుచుక్కతోఁ దాను లేచు
జనని కలసటఁ దొలఁగింపఁ బనులొనర్చుఁ
గంటఁబడకుండ మగనియక్కఱలఁ దీర్చు
నుఱుము లేని తటిల్లత యొప్పు మిగుల॥ 111

తే॥ గూఁటిలోఁ బుల్గుపిల్ల దాఁగొనెడిభాతి
మెఱపు మొయిళుల నడుమున మెఱయురీతిఁ
బూర్ణశశి మబ్బుతెఱల దోఁబూచులాడు
పోల్కి నునుసిగ్గు నొయ్యఁ దెంపుఁగొనుచుండ॥ 112

సీ॥ గడిఁధూటి తలుపులక్రంతలారసి బాగుఁ
జేసి చూచుట వెన్కఁజిక్కఁగొంత

చాటుననిల్చి డబ్బాటుగాఁ జెయిఁజాపి
వస్తులనుంచువెన్నాటు సడలె
స్వారిగుజ్జము మించుఝురి భూషలులియ నిం
దంపు దాఁటెడు బిడియంబుఁ దఱిగె
జంత్రపుంబొమ్మల సరణి మౌనముఁబూని
నడయాడుబెఱుకు సన్నగిలఁజొచ్చె
నాఁడునాఁటికిఁ దనమనోనాథునక్క-
ఱలను దనపైననే తల్లి క్రమత వదల
లజ్జకుతుకము కౌతూహలంబుప్రేమ
ప్రేమచనవుగఁ దలఁపులూరించుచుండ॥ 113

ఉ॥ పుట్టినయింట నట్లు పతి పొందెడుమన్ననలంపు మార్పు క
నట్టినయట్లు ప్రస్ఫుటముగా దినముం గనిపించుచుండుఁ దా
నెట్టులు కల్గఁజేసికొను ? నింకను దల్లిమఱుంగుబిడ్డ లోఁ
దొట్టెడురోసము న్వగపుఁ ఘుంపుడుకు న్మది నెంత రేఁపినన్॥ 114

తే॥ చలిది పిల్లలతోఁబా టొసంగునపుడు
దినదినంబును బతిమేనఁ దనరుసిలుగు
లరసి లోలోనఁగుములుఁ దా నంతవంత
నైన నతఁ డుండె నిలఁ గతం బరయలేక॥ 115

ఆ॥ ముదురుసజ్జఁ గాయఁబోయి భారవి
రేయి బడలి నిద్రవోయె, నంత
దైవఘటనమేమొ తద్రాత్రి యాఁబోతు
మేసిపోయెఁ గొంతమేర చేను॥ 116

వ॥ ఆకథ వారివీరివలన నత్తయెఱింగి, భారవి మఱునాఁటి యుదయమున నింటికిం జేరి స్నానాదికంబులుతీఱ నారగించునెడ నయ్యేడకరుదెంచి॥

ఉ॥ "ఏమిది? పోతురాజువలె నింతకునింతగ మ్రింగియేగి పై
రామెయిఁ జూఱఁబుచ్చితివి? యంకిళులాడవె? పల్కవేమి? నీ
మోమునఁబెట్టుకొంటి దినము న్జడిక్కూర్చినయేటికష్ట మో
సోమరి! నిద్రకైన నిటుఁ జోటగుపింపదె చేని కేటికో? "॥ 118

మ॥ అనిన న్భారవిశీర్ష మానతముగా నన్నంబు వడ్డించుల
క్ష్మి నటద్భ్రుకుటితోడ నిప్పసెగ లక్షిద్వంద్వమందూర మో
మును రక్తాక్తముగాఁగ నిల్వఁ గనియమ్మా! కోపమోనీకుఁ జా
లును, ప్రారబ్ధముపండ నిట్టిపతిచెల్వ ల్నచ్చె నీబుద్ధికిన్॥ 119

క॥ పండితుఁడఁట! గండరిపెను
గండండఁట! నోట నాల్కకనరా దహ! మూ
ఢుండోకొ! విరసుండోకొ! మూ
ర్ఖుండోకొ! నీవ్రాతకోలఁదిఁ గూర్పంబడియెన్"॥

చ॥ పతిమన మిట్టిదంచుఁ గనుపట్టమి మార్పలుకంగనోడి యు
ద్ధతిఁ దనలో నణంచుకొనెఁ దత్సుత; పిమ్మటఁ దల్లియమ్మ! నీ
గతి కిట నావురమ్మదముగల్గెడి, నేడ్వక వ్యర్థుఁడైన దు
ర్గతికుని వెన్కవైచుకొనఁగా నిటు చూచెదవేల బేలవై?॥ 121

ఆ॥ ఆడువారివెనుక నాడుటకును మించు
పోళె మితనియందు పొదలుచున్నె?
గ్రుడ్డ నప్పగించి కూర్చుండుఁ గిక్కఱు
మనక మెట్టి యడవిమనుజుఁడొక్కొ?॥ 122

ఉ॥ చక్కనివాఁడు, సూరియు, రసజ్ఞుఁడు, నేర్పరి, వీఁడటంచు మో
జెక్కఁగ నిన్నొసంగితిమి, యెక్కడిదాపరికంబొ? చుక్కలం
జుక్కవు, జాణల న్దెలివిఁజూపెడు జాణవు, కాపురంబు నీ
కెక్కరణి గ్రహించునో? నికృంతములైచనె నన్నికోరికల్॥ 123

చ॥ ఇలు సవరింపలేఁడు, పొలమేగి సమర్థతఁ జూపలేఁడు, కా
వలసినవెచ్చ ముఁగమలపజ్జల బేరముఁజేయలేఁడి కెం
దులకొకొ వీని పాండితి? యధోగతిహేతువుకాదె? లౌక్యవృ
త్తులఁ గొఱకానివారలకుఁ దోఁచునె తద్గతభాగ్యభోగ్యముల్॥

క॥ విగ్రహముపుష్టికలదు స
మగ్రతఁ గనఁ గడుపునిండునట్లుగ, సుగుణ
వ్యగ్రత సున్న, సమృద్ధిప
దాగ్రము నైవేద్యనష్టి యయ్యకుఁ జూడన్॥ 125

క॥ తినమొండే, పని మొండి, యి
తని కొండొక తెల్వి యున్నదా? యోపికనిం
డునఁ గాఁగడాలతో నెమ
కిన నింతయుఁగనము నీబిగింపేమిటికో॥ 126

క॥ చేసినపను లగుపడవసి,
కోసినముక్కగుపడు న్నగు వ్రే లింట
బై సుంతమేలిపని కల
దే సెప్పుము! వట్టిరోసమేమిఫలంబో॥ 127

చ॥ పరుషముగావచింతునని పల్మఱుగుంజుకొనంగ ధర్మని
ష్ఠురతకు మార్పుకల్గునొకొ? చూడుము! చేయఁగనైనదానిఁ జే
యరు, మఱి మానఁగాఁదగినయట్టిదిమానరు, కష్టమబ్బ ట
బ్బురమె? యొకొక్కఁ డెంతలుగ మొట్లుగడించునొ లౌక్యవృత్తులన్॥

ఉ॥ అల్లుఁడటంచుఁ గూఁతురని యందఱియట్టుల నాకుఁ బ్రేమసం
ధిల్లకపోదు, కాపురము దిద్దుకొనంగ స్వయంకృషి న్బ్రవ
ర్తిల్లిన నాకుమెప్పగును దేబెలుగా గడిదేఱి యెప్పుడు
న్బల్లుకబుర్లతో నొరులప్రోపున కొగ్గిన సంతసింపఁజూ!”॥ 129

క॥ అని రుంజిరుంజి గిట్టునఁ
జనె శ్వశ్రువు, తిండి యెట్లొ సలిపి పొలముపై
పునకరిగె భారవియు నా
తనిసతి పాల్వోనిమనము తద్దయు నేఁపన్॥ 130

ఉ॥ “పాండితిమెండటంచు ధనవంతులటంచుఁ బ్రసిద్ధి వీర లి
ట్లుండఁగతంబదేమొ? ‘చనవోయి!’ యటంచనురీతి నమ్మ వా
గ్దండముఁగొల్పఁ గోపమును దాల్పక మాఱన కోర్చి మొండికి
న్మొండిగ నన్నుఁగాదనెడిపోల్కి నటింపఁగ నేమిమున్గెనో?॥ 131

తే॥ కనులు పెడతలలంటె మైఁగప్పుతోడిగె
డొక్క వెన్నంటుకొనుచుండెఁ బ్రక్కయెముక
లెల్ల బయలయ్యె, నయ్యయో! తల్లిదృష్టిఁ
బడవొ యివి? చూచియును లెక్కయిడదొ యామె?”॥

క॥ అటువల్లభు డిటుతల్లి య
కట ! యిటుకాదిట్టులనఁగఁ గానిసమస్యం
దిటముసెడుచుండ బాలిక
యటమటఁబడు రోసపడు "సహా!" యని మఱుఁగున్॥

వ॥ ఇట్టురియాడుమనంబున నబ్బాల సావిడి నిలిచియుండఁ దల్లి మంచి
నీరయిపోవుట వానిందేఱ నిత్తడిబిందె నందుకొని వాఁగున కేగు
టగుపడ నొక్క దాఁటున నడ్డమఱిగి॥ 134

ఆ॥ "వంటవేఁడి నవయుబాధ చాలదె తల్లి?
నిప్పుటెండ నేటినీరములకు
నీవ యేగవలెనె నేనేమిచేసెద?
బిందె నీయుమమ్మ వెళ్లివత్తు॥" 135

మ॥ అన "బిడ్డా! యుదయంబు నీమగని నేనన్నట్టి వాక్యంబుల
న్గానముం గాంచక దెప్పఁజూచెదవె? బాగున్నాగు! గ్రుడ్డేగి పి
ల్లను గొట్టన్గమకించునట్లు; లిటనేలా? పోయినీభర్తకే
యనువౌ సాయ మొనర్చుకొమ్మెఱుఁగలేనా నీకువైదగ్ధ్యమున్॥

క॥ కాసుంగడియింపనో? యఱ
పీసముపనిఁజేయనొక్కొ? విస్మయమగు ప్రే
లేసిమగకుట్ట లెంతెం
తేసిపొనర్చెదరు? చూడ మిట్టివెడంగున్!॥ 137

ఆ॥ ఉన్నమాటననిన నున్నయూరచ్చిరా
దన్నవరుస దగరనైతి నీకు
మునుపుఁజెవులకంటె వెనుకమొల్చినకొమ్ము
లెక్కుడయ్యె నెంతకింతెకాదె?॥ 138

తే॥ అక్కలిరువురమగల నీవరయలేదె?
ముచ్చటయకాదె వారి యేపోబడియును?
మచ్చునకునైన నిట నొక్క మంచికలదె?
కాపురం బింక నేరీతి గడ్డలగునో? 139

క॥ కవియఁట! కవికిన్ లక్ష్మికి
మిపులపగ యటంట వినమొ? మిన్నంటుకవి
గ్గవియక మానదు లేమిడి
శివమిడు కృష్యాదు లభ్యసింపని కతనన్॥ 140

ఉ॥ చూడవె? పిచ్చివానివలె చూడ్కులనిట్టటు తార్చు చెద్దియుం
జూడనిచుమ్మ గ్రుడ్లు తలచుట్టుఁ జరించుచు నింగినేలఁ ద
ట్టాడఁ జెవు ల్బయల్కుయికి నగ్గముగాక ముడుంగ గొణ్గుచుం
గూడును నిద్ర కేగు తఱిఁగూడ నెఱుంగని వీని పోడుముల్॥ 141

శా॥ కబ్బంపుందిరిస్రోఁకి యీవరుసఁ జిక్కన్వాఁడదేకల్మి పె
ల్లుబ్బుంగల్గినవాఁడు గాని చెడఁడొక్కో? బంట్లుపాలేరువాం
డ్రబ్బెరాగికిఁ జిల్లిగవ్వయును రా నంగుంబొసంగింతురే?
యెబ్బెబ్బే! సిరిచేర నిల్వ ననువానే బైసి నాశిల్లదే! ॥ 142

ఉ॥ మూఁడవయన్న వేఁకిఁబడె మున్నటు లేగఁగలేఁడు చేనికి
న్నేఁడటు మంచినీర్గొనుచు నీవ చనన్వలె, నేది యెంతగాఁ
బాడొనరించిన న్గడుపుపబ్బము తప్పదుగాదె మైలప
న్లీడక చెల్లఁజేయు మట కేగెదు వంటముగించుతోడనే"॥ 143

చ॥ జనని యిటుల్వచించి చన, జాలియు మోదము సిగ్గుమూఁగి ము
మ్మనుములుగా నెడందఁ జలము బలము న్వలపు న్బొరింబొరిం
బనుపడఁజేయ లోగదికిఁ బర్విడి దోఁసిలికప్పమోముతో
నునుపఱుపందుఁ బోర్లఁబడి నూల్కొని కొంతకు లేచి నిల్చుచున్॥

క॥ నెఱి ముంగురు లలజడిఁ దా
మరమోమునఁ గణతలందు మల్లడి గొనఁగాఁ
జిఱు చిగురుచేతఁ జక్కం
బఱపి నిగుడుతలఁపు తొట్రుపాటమర వెసన్॥ 145

తే॥ పెండిలికిమున్ను మగఁ డిట్టి పెంపుకాఁడ
టంచు వచ్చినకమ్మ నం దరసి తీసి
దానివార్తకు నేఁటిచందాన కెసఁగు
వారఁ గన్గవ నీర్నింగువాఱఁ జదివె ॥ 146

తే॥ "జగ మెఱుంగు బ్రాహ్మణునకు జందెమేల?"
యనెడి సామెతగా దిశావ్యాప్తయశుని
వరుని భారవిఁగూర్చి వ్రాయునేర్పు
కలుగునే నాకు? యత్నంబు సలుపువాఁడ॥ 147

చ॥ తెలిసితిగాదె మాతులుగతి న్ఘనపండితుఁడౌటఁగోరి య
ట్టు లతఁడుపోయియుండుట, కడు న్ఘనుఁడై వరపండితప్రకాం
డులను వివాదఁగెల్చుచు మణు ల్పతకంబులు సేలువ ల్ధనం
బులుఁ బెనుబండ్లఁగాఁగ నతిమోదముతో నిలుసేరె మామతోఁ॥

చ॥ కళలను బూర్ణుఁడై యెటులుగాఁ బెరసూరుల నాక్రమించెనో
కళలను బూర్ణుఁడై యటులె కంతజయంతముఖాతిసుందరాం
గుల నిరసించి మించె నతికోమలహైమసమానదివ్యదీ
ప్తులువెదజల్లుమేన సరిదూఁగు స్ఫురద్రుచిరాంగసంగతిఁ॥ 149

క॥ వచ్చినమఱునాఁ డమరులు
మెచ్చఁదగినదివ్యసభ సమీచీనజయ
ప్రోచ్చలిత సకలమనమై
హెచ్చుగ ముదమిడె మహాపరీక్షలలోనఁ॥ 150

క॥ అవధానంబుల బహువిధ
కవనంబుల గానదివ్యకలన నుపనిష
ద్వివరణగరిమను నింతటి
ప్రవరుని గనివినియెఱుంగ బహుకాలముగఁ॥ 151

క॥ ఎంతని వ్రాయుదు వ్రాసిన
యంతయు నాతనిమహత్త్వమందు శతాంశా
క్రాంతమునుగాదు వైళమ
యాంతికమున కీవె వచ్చి హర్షింపఁదగుఁ॥ 152

వ॥ ఇట్టు లాలేఖను ముమ్మారు చదివి 153

క॥ ఇంతటి తెలివికి గడనకుఁ
బంతుఁగలిగి తేంద్రరచ్చఁ బసదనముల మే

ల్పాంతమున గెలిచికొను పస
సంతనగలవీరు సిలుగు సడిఁ బడనేలో! ॥ 154

మ॥ కనలే నానవత న్మలుంబొడుపునాఁగా సాఁగునాయెత్తిపా
డ్పును సుంతే న్వినలే న్గతుంబెదియొ చెప్పాండంచుఁ గోరంగలే
ననుచు న్బెద్దిగులుబ్బ బాల వలవంత న్జారుకన్నీటిధా
రను గోకంచునఁ గొంచుఁ గొంతవడిఁ దేఱన్బాబులుకన్దమ్ములన్॥ 155

క॥ వెరవుంగనినట్టులు సం
బరముఁ గుతూహలము జమిలిపరువంబున న
త్తఱి నొడలి కుఱువొసంగఁగ
నిరువున నోకచీటివ్రాయు నెగపున నుండన్॥ 156

వ॥ అట భారవి పొలంబున కరుగుచుండి॥ 157

ఉ॥ "కాఱుమొయిల్లలో మెఱుపుకందువ, చిమ్మను చీఁకటి న్రుచు
ల్దేఱెడు దివ్వె, రోగములఁదీర్చు సుధామయమైనమాత్ర, ని
స్సారత జోపునోషధి, ప్రశస్తతరంబగునాశ, లోకము
ల్వారని దానిశక్తిఁగద వర్ధిలుచున్నవి నాఁడునాఁటికిన్॥ 158

చ॥ అడలుననుంటచేతఁ గననైతిని మున్నతిమోము, యోగ్యతం
దడవఁగనైతి, నోర! ప్రమదంబును నబ్బురమయ్యె, రోషముం
దొడరుల తమ్మికన్నులును, దొట్రిలు నయ్యధరంబు నెత్తనం
దొడిగెడు చెక్కిళు ల్నెలపుతుంపుడు కిప్పుడుఁ దోఁచునల్లదె!॥ 159

ఉ॥ కంటిని శ్రద్ధఁ బెండ్లియగుకాలమున న్మఱి నేఁడుకంటి వా
ల్గంటి పరిస్ఫుటంబగుచుఁ గన్పడు నేఁటి కడింది చెన్ను ము
క్కంటికి వేగనుల్దొరకుఁ గా దిఱువేఁగనులున్నవానికిం
దంటతనంబున న్బలుక ధైర్యముచాల దటంచుఁదోఁచెడిన్॥ 160

క॥ దర మాకంతం బతిసుం
దర మాచిగురాకుమోవి ధర్మచరిత్రా
దర మాకన్బొమ యొన్నం
దరమా! పరమాత్మకైనఁ దద్గారవమున్!॥ 161

క॥ కనులా యవి! సోయగపుం
గనులా! రసతటిదుదారఘనులా! వలపుం
దోనలా! భావంపుంబెం
దోనలా! చిత్తజునికళకు దోనలా దోనలా!॥ 162

మ॥ నలినదళోపమానము లనందగునెట్టు లమోఘధీప్రభా
లలితములు న్మనోగతవిలాస నిరూఢములు ప్రసిద్ధక
జ్జలసుముఖీకృతావయవజాలములు న్సరళంబులైన యీ
యళికులవేణినేత్రము లయారె! కడున్శతపత్రజైత్రముల్॥ 163

చ॥ ఖరకరుకాంతి కాచకళికన్బడి యవ్వలఁ బెక్కువెల్గుల
న్బరఁగెడిరీతి నీతరుణిభావము నేత్రయుగంబుఁదాఁటి చూ
పఱులమనంబుల న్వివిధభావము లుప్పతిలంగఁజేసె న
ద్దిర! యిటువంటిచూడ్కి కలదే పెఱకాంతల కీధరాస్థలిన్॥ 164

ఉ॥ రింగులువాఱు ముంగురులు క్రేవల గండములందు మేలుకీ
విం గయిసేయఁ గన్బొమ గభీరత నాస్యమునందు నింప దృ
క్సంగతి యెల్లర న్దివియఁజాలు విలాసముఁగొల్ప వేఱ పూ
సింగిణియేల? మన్మథుని చేష్ట లవేటికి? పౌనరుక్త్యముల్॥ 165

సీ॥ ఆనుసురే గోటి కానుసురేపున
కాపూర్ణశశులు వేయారులైనఁ!
జాలుసురా పంటి చాలు దురాయి మీ
ఱఁగ వజ్రి మన్నించు మగువలైనఁ!
దగుదురా చెవుల వింతగు దురాసదలక్ష్మి
కాశ్రీశుఁ డెదమెచ్చు నతివలైన
నెనయుటే చెక్కుల నెనయ ఠేవునవెల్గు
మేరువోమెడు స్త్రీల మెఱుఁగులైన
వాడవాడల సొగసుల జాడలందు
నీడఁబోవని సతులైన నీడుగారు
రంగుఁ గుదు రున్నమాత్ర గౌరవముకలదె?
యిటులు భావప్రసాదంబు నెగపవలదె?॥

సీ॥ పాగ సుడియుచు లేచు వగఁ బక్ష్మము ల్బొమ
లుబ్బంగుచు ల్దలకట్టు మూఁగి యెగుర
వెడలించుబిలములై వెడఁదకన్గవ క్రమ
క్రమముగా విప్పారి గండునుమియఁ
జంక్రమించెడిశిఖాచయమునఁ జుఱుకుఁజూ
డ్కులు పొరింబొరిఁ జద ల్కలయఁబ్రాకఁ
దప్తలోహము కాఱుదారి గండములపైఁ
గన్నీ రెనసి యెఱ్ఱగాఁ గొలుప
నెగపుధ్వనియన నుచ్ఛ్వాస మినుమడింప
నాస్య మొకచిచ్చుకొండయో యనఁగ రోష
పావకార్భటిఁ జూపిన ప్రౌఢిమంబు
భావ మిగిరించు మేల్చెన్ను పట్టుగాదె! । 167

—♦ భారవి ధనపాల సమాగమము ♦—

క॥ అని ప్రథమాత్యుక్త్యంబునఁ
దనసతిరూపంబు నిపుణత న్దలఁపుఁదెర
నినుచుకొనుచు భారవి యటు
చనునెడ నెదురేగుదెంచుసాది కనఁబడెఁ॥ 168

సీ॥ పసిడిజరీపాగ బటువుగా మెలిఁబాఱి
తలపైనఁ బెనుతళ త్తళలనీన
నీలమండలదాఁక జీరాడు పట్టుకో
టునఁ బైఁడి బొత్తాము లనలఁగొలుప
ముంజేతి కంకణంబులుఁ జెవితమ్మంటు
లును మంచిరాల వెల్గులను వెలుప
నీలమేఘుచ్ఛాయఁ దేలుమోమునఁ దిఱు
మణియు శ్రీచూర్ణంబు గొనబునిలుప
డాకయి న్గల్లెమును గొరడాను గుడిక
రంబునను బూని మేటిగుఱ్ఱంబుపైన

స్వారిఁ జనుదెంచుచుండె మేల్వర్తకుం డో
కండు ఖురదాటి ధరణి బింకముగ ద్రోయ॥ 169

చ॥ నడు మవనిన్ స్పృశించెనె యన న్జరణంబులు సాఁచి ముద్భుతె
ప్పుడొ కనరాక మించు తనపోకను రోదసి మ్రోత భూమిచ
ప్పుడు ద్రుతతాళయుక్తమగు మోహనరాగపదంబుఁ బ్రస్తరం
బడరఁగఁజేయఁ దోఁచె జవనాశ్వముస్వారి మహాద్భుతంబుగన్॥

క॥ ఓరంతయెడముననె తుర
గారభటి న్నిలిపి, "యెవరి నరసెదనిట! శ్రీ
భారవిమహాశయులె? నా
ప్రారబ్ధముపండెఁ గొనుమి వందనమార్యా!"॥ 171

క॥ అని యుత్తమ తురగము దిగు
మనుజుని గుర్తింపలేక మల్లడిఁగొను బు
ద్ధిని నిలుచుభారవి న్గనుఁ
గొని వణిజుఁడు తనను దెలుపుకొన నిట్లనియెన్॥ 172

క॥ "ఉజ్జయినీపట్టణవి
ద్వజ్జనపాండిత్యగురువిభాపటలంబు
ల్లుజ్జగములెన్న భాస్కరు
పజ్జం దివ్వెలగునట్లు పఱపితిగాదే! "॥ 173

సీ॥ రంగులరా ల్మకురంపుచౌకములట్లు
గోడల నిమిడి నిగ్గులను గుఱియ
మణిమయాసనరుచు ల్మాటికి బహులతా
కృతులఁ గుడ్యములపైఁ గీలుకొలుప
కలసముద్రమ్ములుఁ గులపర్వతములుఁ గో
ఱాడులై శాస్త్రార్థమావహిల్ల
రసికుఁడై దాతయై రాజుసింహాసన
స్థాయియై జరుగుచర్చలను వినఁగ
వీనులకువిందుఁ గనఁబండువైనపారి
షదమున న్మీరు కాంచినజయము నెట్టి

మందుఁడైనను గనివిని మఱవఁగలఁడె
రమ్యధీసాంద్ర! ప్రథితభారవికవీంద్ర !॥ 174

ఉ॥ ఎచ్చటినుండి యెచ్చటికి నేగెద రేపనిమీద? మోదము
న్మెచ్చున నాపినాఁడ కుశలింపుఁడు నాచనవు, న్వణిక్కుళ
న్వచ్ఛితి నాఁటి కాపురికి, భాగ్యముకల్మి భవత్ప్రసంగము
ల్మెచ్చుటమీఱ వింటిని, మిముం గనుఁగొంటిని నేడుధన్యతన్॥ 175

చ॥ కళకళలాడు మీతనువు గాసిలియుండఁగ నేల? రాట్సభా
స్థలుల విపశ్చిదగ్రిమపథంబులలో గురుకీర్తిడోలికా
చలనముల న్విలాసత నెసంగఁగఁజాలినమీర లిట్లు లిం
దులఁ గడుదీనత న్నవత తోఁపఁ జరింపఁగ నేమిహేతువో!॥ 176

వ॥ ఆకనంబడు పల్లెయే నాకాపురము. మీరు నందుండియే వచ్చు
చున్నట్లు తోఁచెడి. భవచ్చరిత్రంబు నెఱుంగఁ గౌతూహలినగు
నాకుఁ దెలుపఁగూడినం బలుకుమ రే” యని మృదువచనరచన
వెలయ వినయంబుపెంపున నడిగిన నబ్బారవి. 177

చ॥ “వణిజ! సిరు ల్నిరంతరము వర్ధిలుఁగావుత నీకు, ధర్మమే
గుణలవ మిమ్మెయి న్వలచి కొండలుగా స్తుతియింప? సత్పరా
యణతను జాటు నీమవినయంబునకు న్మదిమెచ్చినాఁడఁ, గా
రణమును గోరకుండ సుకరంబగు సాయము నొండొనర్చెదే?”॥

చ॥ అనినఁ “బ్రసాదమయ్య! తమయంతటివారల కేవిధాననై
నను బరిచర్యఁజేయు సుదినంబు లభించుట నామప్రాక్సువ
ర్తనము ఫలంబుకాదె! సిరిరా నెదురొడ్డెడువారు నుంద్రె? పా
లనమొనరింపుఁ డెట్టిముదల న్దలమోచి ఘటింతుఁ గార్యమున్”॥

మ॥ అనుచు న్భక్తియుఁ దృప్తియుత్సుకత యాస్యంబందు ముక్కారుఁపా
ర్లున వర్తింపఁగఁజేయుచూపుఁదరఁగ ల్పొల్పాఁడుకన్దోయియే
పున నాబద్ధకరాబ్జుఁడై నిలుచు నాపుత్త్రి న్సరి నీక్షించి గ్రు
‘డ్డిని మెల్ల’ ట్లిది కొంతమేలె యనుచూఢి న్వానితో నిట్లనెన్॥ 180

ఉ॥ “వర్తకశేఖరా! విను భవత్కుతుకంబును దీర్పరానిదై
వర్తిలు నొక్క సద్వ్రతము పారముముట్టినవెన్కఁగాని నా

వర్తన మిట్టిదంచుఁ దెలుపన్దగ, దట్లయియుంట నీవు న
న్నర్తిడనట్లె యుండఁగదఁగు న్మనమెం దెపురాట కల్గినన్॥ 18

మ॥ వ్రతపూర్తిం గనునంత కుండెద భవద్గ్రామంబునందే, మదీ
ప్సితముం దెల్పితిఁ, దక్కు సంగతులు నీవే యూరిలో విందు" వం
చతఁ డంటన్ వ్యథితాత్ముఁడై, విఫలమానాశ న్ముఖం బొందుదీ
నతతోఁ గోమటి వింతయుంగదిసి యాజ్ఞన్ గౌరవంబుంచుచున్॥

ఉ॥ "ఆర్యుల రెట్టి తీర్పిడిన నట్టిటు లాడుట కాదు నాకు మీ
కార్య మదేవిధంబయినఁ గాని సమర్థులుగానఁ బ్రాపు దు
ర్వార్యముగాక కోర, రొకపట్టున నట్టిది కల్గెనేని ధీ
ధుర్య! కలాఁడువీడని మనుత్సవ మొంచుడు పోయివచ్చెదన్"॥ 183

మ॥ అని యాయూరుజుఁడేగ భారవియు నీయాయోజన ల్మానసం
బున నొక్కింత కలంతఁ గూర్పఁ దుదకు న్బ్రోద్రోసి నైసర్గికం
బనఁగాఁజెల్లు కవిత్వసృష్టి యనివార్యంబౌచు సంధిల్లఁ గా
వ్యనిచోళావృతుఁడై తమంతఁబదము ల్న్యాసింపఁ జేరెన్మడిన్॥ 184

ఉ॥ గట్టులఁ గండ్లఁ బూడ్చి చెఱుకల్గుల మట్టినిమట్టి నీరము
ల్వట్టినపంపు కాలువలుపాఱఁగ బాగొనరించి చేని న
ట్టట్టుల కేగిచూచి యవల న్మఱల న్గవనంబుఁ జేనుచు
న్మెట్టపొలాలకేగి యటమించెడు కల్పును దీయుచుండఁగన్॥ 185

—♦ భారవికి భార్య నుడి ♦—

శా॥ అల్పాహారము మంచినీరుఁగొని భార్యారత్నమే తెంచుచు
న్జల్పద్భూషణరాజి చీరయును నిశ్శబ్దంబులైయుండఁ గ్రొం
బొల్పాస్యంబునఁ జిందులాడఁగఁ బదంబు ల్మెల్లఁగాదాఁట సం
కల్పాధీనమస్కఁ జిత్తహరు వెన్కం జేరి యల్లంతటన్॥ 1

చ॥ నిలిచి వడంకుచేతి కొకనిబ్బరము న్సమకొల్పి కట్టలో
పల నిడియున్నచీటిఁ గొని పాణి నొకించుక సాఁచి మీఁదె నం
గుళి నది భర్తమున్పడి మెగుర్కొన, నంతట సిగ్గు పైకొన
న్మెలఁకువ సళ్ళఁ గైముడిచె మెడ్డున గాజులొకింత ప్రోయఁగన్।

చ॥ నిశి దివిరాలుచుక్కసరణి స్తనముంబటు జారు తాళప
త్రశకల మక్షియుగ్మక పథంబున గీటిడి వ్రాలఁ జూచి కై
తశమన మొంద, సద్దు చెవిఁదాఁకి ప్రబుద్ధునొసర్ప, వింతను
ల్కి శిరముఁద్రిప్పి కాంచెఁ గలికి న్నతశీర్ష నతండు నెమ్మితోన్॥

చ॥ అట నునుసిగ్గు దాడుఁగొన నల్లన మేన్మలఁగ స్తటాక్షసం
పుటులను మించుపోకడలపోలికఁ దొంగలినల్పు రెప్పసం
దిట నటియించుచూడ్కి పెనుదీప్తుల, మేలిముసుంగుఁ గేల నొ
క్కటగళసీమఁ బట్టి పెఱ్కై బరువూనినజాయ కన్పడన్॥ 189

ఉ॥ కన్నులు విప్పదేఱఁగ, మొఱగంబుపయిం జిఱునవ్వ చేఱ, లో
నున్న మనోవ్యథ ల్మలయనోపక యెచ్చటికేనిఁబాఱ, నా
యన్నన నన్నుపైన రభసాత్తులపర్వులుమీఱఁ దన్ను నే
తెన్ను నెఱుంగ కాతఁడు పదింబదిఁ గాంచి యొకింతతృప్తుఁడై॥ 190

ఉ॥ ఒంటరితావు దాఁదమకమూనినఁ బర్విడునేమొ, కాక తా
నంటఁగ వీలులే దొకటియయ్యెడుదాఁక నటంచు నెంచి వా
ల్గంటి మెఱుంగుఁగ్రేఁగనులు కమ్మదెసంబడుచుంటఁ గాంచియా
దంట 'యదేమొ! చూత' మనిదానిఁ గనుంగొని యుబ్బుప్రబ్బఁగన్॥

తే॥ "మానసాంభోవిహారియా మానసౌక
సంబు పడియలబురద నెసంగఁగలదె?
యచట నిలుచుట వీలుకాదయ్యె నేని
లేదె పాలేఱు విహరింపలేదె యచట?"॥ 192

చ॥ అనులిఖితంబును స్తనివియూరఁగఁ బల్మఱు లోఁబఱించి మా
ళినెగచి భార్యమోమునరళింగన బుగ్గలతోడఁగన్ను లం
దెసయుగులాబిరంగుపయి నేత్తెఱఁ గ్రమ్మెడియశ్రుపూరవ
ర్తనములఁ బొల్చె హైమజలతంద్రితసభ్రమరాబ్జయుగ్మమై॥ 193

ఉ॥ కమ్మయుఁ గన్నులున్ స్ఫుటముగాఁగ వెలార్చెడిభావము ల్ప్రివా
సమ్మునఁ దాను పొందు విరసమ్ములకు న్వెనుకిన్క యాత్మగే
హమ్మునకేగకున్కిఁ గడునార్తియుగాఁగ నెఱింగి పొంగుమో
దమ్మున నాతఁ డాలిపిఱుఁద న్జనుదే నొకమంచెక్రిందికిన్॥ 194

మ॥ చని యచ్చోటఁ బచేరఁ బూని స్వగతచ్ఛాయల్గ "మన్మానసం
బును బాలే ఱిటనుండ వేఱచటికే న్బోనేటికో ? యింద్రజా
లనిరూఢి న్బడియ ల్పుధారసనిధుల్గా మాఱి మార్చెంగదా
మును పాలేఱులె రొంపిపట్లగు నసమ్మోహంబు నేఁడెంతయున్"॥

క॥ అని యల్పాహారమ్మును
గొని నీరముఁ ద్రావి కొంతకూర్చుండి శిరం
బునువంచి నిలచునర్థాం
గినిగని కెలవోలయుచూడ్కి కెరలఁగ ననియెన్॥ 196

క॥ "చుక్కానివాఁడు సంభ్రమ
మెక్కింతయుఁగొనక నడుపుచుండఁగఁ గలమిం
దెక్కరణి నొందు నాపదఁ
బొక్కఁగ నెందవసరంబుఁ బుట్టంగలదో!" 197

క॥ చక్కనిచుక్కవటంచును
వక్కాణించెంగదా భవజ్జనని భ్రమం
జిక్కని రిక్కగదక్కితి
వెక్కెనె నాహృదయదివికి నేయులజడులున్॥ 198

క॥ మీయమ్మకసరు లన్నియు
నాయెద కుపదేశవాగ్గణములగు సంతు
ష్టాయత్తచిత్తవగుమి యు
పాయం బొకయింతలేదు వగపూనుటకున్॥ 199

మ॥ అనుచున్లేచి పొలంబుచాయఁ జను చిత్తాధీశుతో నాఁపి ప
ల్క నెద న్నందడిఁ గొల్పు సంగతులు కుల్కన్మడ్డుసి గడ్డమై
చనువుం గైకొననీయకుండుటయె వాక్సంకోచకృద్బంధమా
ట నిలీనాత్మ నొకింతనిల్చి చనె నాడన్బాసి యాలక్ష్మియున్॥

మ॥ మఱునాఁ డెయ్యెది యెట్టులైనఁ బలికింపం దెంపు సొంపూని యు
త్తరముం దత్తఱ మాస్యవీథిఁ దళుకు ల్దాఁటింప మున్వెన్కతోం
దరఁ గన్పర్చుసతీస్థితి న్వరుఁ డొకింతం జూచి యామోము మే
ల్మిరమ న్బాపు తలంపులే కరయు మిర్మిట్లాడు క్రీఁజూపులన్॥ 201

ఉ॥ "కాటుక కంటియంబుదము క్రమతరంబగు చీటిమె ర్పిటం
బాటిలఁజేసె నిన్నుఁ, బలువన్నెల నేఁటి ముఖాబ్జజోదయం
బేటిసువాక్సుధార్ద్రవము నీహృదయావని నింపి మోదస
స్ఫాటవి సత్ఫలంబొసఁగు నయ్యది సుంత యెఱుంగవచ్చునే?"॥ 202

మ॥ అనఁ గేల్జంటను గంబమూని వసుధాయత్తాక్షియై కాలిబొ
టనవ్రేల న్భువిరాయుచున్నసతి యడ్డంబైన యాగబ్బిసి
గ్గు నొకంత న్విదలించి వీణెనుడిగిల్కు న్మించుపల్కాడెఁ జి
ట్లినదానిమ్మఫలంబునాఁగ రదము ల్కెమ్మోవుల న్మిన్కనన్॥ 203

ఉ॥ "బుద్ధియెఱుంగనప్డె పరపోషణ నిల్చు పికం బెఱింగి కా
కోద్ధతి కగ్గమై నిలుచునొక్కొ తదీయకులాయమందు? స
త్పద్ధతికైనయంచ కుఱుచైఖరి మాటినఁగూడ బాతుతో
నిద్ధరఁ గూడియుండునె యథేచ్ఛల మానసకేళి కేగదే?॥ 204

చ॥ అపుడటు పిక్కటిల్లుపస నందముఁ జిందెడియంగము ల్కృశిం
చి పరువమెల్లఁ బో నెముకచీలలుఁగన్పడ బక్కచిక్కి యే
రిపులును గుర్తిడ న్గనిరీతికిఁ జేరుట కానరాదె? చూ
చి పితరు లెంతపొక్కుదురొ చిత్తమునం దొకయింత తోఁపదే?॥

చ॥ నిలువఁగనీనిపో ర్ముఖము నేలకుఁ గొట్టుకొనంగఁజేయుమా
టలు విదిలింపులు న్గడబిడ ల్దినము న్మసర న్విమంబునొ
త్తులఁ జెడుమొక్కల ట్లొదిగి త్రుంగఁగనేటికి? తెంచుకొంచువె
ల్వలఁబడ నెంతు నేనె మగవారల కీసహనంబు లొప్పునే?॥ 206

చ॥ పొడిచెడి సూటిపోట్లు వెలిఁబుచ్చు నలక్ష్యము లీసడింపులు
న్దొడుగు నసాళముందగులు తొరఁపునిందలు నొప్పఁజెప్ప దం
దడిచదురు ల్విన న్విలలె తద్దయు మార్మసలంగనొ నన
న్బడుగులరీతి శీర్షమునువంచి పడ న్గతి యేమిపట్టెనో?॥ 207

సీ॥ బావలఁ బెద్దఁజేసి మిముఁ బల్మరు దూఱుట నాలకింపఁగా
నావఁదినక్ బొగల్నెగలు నంగమున న్వెలిఁబొఱునట్టులై
తీవరమెత్తునా కె!, యటుతిట్టఁగ తిమ్మఁగ నొక్కరీతియా
మీవిధమెంచి యూరిప్రజ మి మ్మెటులెమ్మెయి నాడిపోయునో!॥

చ॥ కరుణయొకింతలే "కుటుకకల్గిరిగా"యని యడ్డమైన చా
కిరి సలిపించుకొంచు నులికించుచు నొంచెడి వీరిపైనఁ గూఁ
తురనగు నాకె యేవము ప్రతున్నమతి న్గనియించు నింతని
బ్బరమున నీపరాభవము భంగము నోర్చుటకేమి హేతువో?॥ 209

ఉ॥ అత్తకుమామకిట్లు వినయంబున నడ్గులమడ్గులొత్త నా
యత్తులె యల్లురెంచు "నదియ ట్లిదియి" ట్లని వంకలెన్ని వా
ర్తత్తలుమొందునట్లు వడిఁదాల్పరె? యల్లుఁ డికొక్కగామునా
నుత్తదియానె? మెత్తదన మూనితి రీగతి నేమియెంచియో?॥ 210

ఉ॥ ఇంతటిసాధులై సభల నెట్లు నృపాలురమ్రోల సూరుల
న్బంతముఁ జూపినా? రచటిపాటవమంతయు నేమియయ్యె నీ
చెంతల నింతలోపల? "నిసీ! బడుగా!" యని సాటివారు గే
లింతల టుర్రుగొట్ట బయసేగతినిల్చునొ గ్రామసీమనేన్?॥ 211

మ॥ తలిదండ్రుల్ కడుకాలమయ్యెఁ జని యాత్ర, న్వచ్చిరో లేదొ, యే
కెలనన్నిల్చిరొ, కన్గొనన్వలదె? స్వక్షేత్రంబు లేమయ్యెనో?
యిలు గొడ్లు న్మజిజీతగాండ్రు నట నేయేరీతి నున్నారొకో?
తెలియంగావలదొక్కొ? మీ కిటులవర్తింపంగ నేకర్మమో?॥ 212

ఉ॥ అక్కలు బావలుం దిగుడు రందఱు నోముల కంచుఁగూడ నీ
కక్కటితి న్బరాభవము కల్గకమున్నె తొలంగమేలు, మీ
కెక్కవచింపఁజాలుదునె? యింతకు నక్షమియించి సైఁచి నా
మక్కువఁ దీర్పఁజూడుఁడు నమస్కృతి వేడెద మాటిమాటికిన్॥ 213

చ॥ అని యట మోడ్పుమోమున నతాననయాసతిఁ జూచి యాత్మలో
"మన కొకక్రొత్తచిక్కుపు డమందగతి న్బ్రభవించె, వ్యాసమె
ల్లనిజమె, దీక్షవీడుట కళంకము కీర్తికి, కార్యమెద్దియే
న్గొనఁగనెరాదు కైకొనినఁ గూడమ భీతిలి వీడ మానికిన్॥ 214

ఉ॥ అందును బాపనిష్కృతికినై కయికొన్నవ్రతంబు వీడఁగా
నిందును నందుఁ జెట్టఁ గను కేటికిఁదప్పెడు? నెద్ది యెట్లుగాఁ
జిందిన దీనియంతుఁ బరిశీలన నోపికఁజేసి చూడ కే
డించఁగనీను పూన్కి, వికటించిన ముంచిన' నంచు నెంచుచున్॥

ఉ॥ "ప్రేయసి! నీమరూపుపస బీజముగా మొలకెత్తెఁబ్రేమ, మా
రా! యనిపింపఁజాలు ముఖమందలిభావముఁ జూపు నేర్పున
న్నామెవనిండెఁ, గైతకు మనంబును బూర్తిగ దింపుహేల కా
ప్యాయత చూపు! వెల్లివిరియుంబడుచున్నదిమేన నంతటన్॥ 216

ఉ॥ కౌరవు లేఁచి చేయునపకారములెల్లను నెత్తిచూపి రో
షారభటి న్నరుం బిరుసువ్యాసమున న్నిపుబాణమొందఁగా
వీరతఁ బ్రోత్సహించు పరవీరభయంకరమైనకృష్ణయా
కారము నిన్నుఁజూచి పలుక న్నెమక న్బనిలేమ నాయికా! ॥ 217

ఉ॥ భ్రూముడిపైనఁ గుంకుమము బొట్టును వీక్షణతీక్ష్ణరోచులు
న్నామనివారణంబునకుఁ గాలగళుండు వహించునాకృతి,
న్భీమముగాఁగఁగాళి సరవి న్మహిషాదులఁ గూల్చువేషము
న్నామదిఁ గొల్పి కొల్పెను ఘనంబగుమోద మసంశయంబుగన్॥

ఉ॥ మామనిరాసనంబు, వ్యాది మాడ్చెడి యత్తవచోహతు ల్పర
ల్ప్రాము ననహ్యభాషలు భరంబులు, వీనికిఁదోఁకు నీవు నే
యామఱు క్రిందచూపుల నోయారివాొమైన మదీయపాప ము
ద్దామతఁబండియుంతు, బలె! తప్పె నపాయము, చింతలేదిఁకన్॥ 219

ఉ॥ బింకమునందుఁ బెట్టినదిపేరగు నాయెద కెక్కఁజాలు వీ
రాంకవు నీవునాకు సఖివౌట యదృష్టముపెంపుసూవె! నా
కింకొకకింక లక్ష్యమ? సఖి! కడుసమ్మదమయ్యె, నీనుడిం
బొంకము పొంకులేని యొకపొల్లగుమాటయు రాదు మెచ్చితిన్॥

చ॥ అనుభవ మింతలేనియొకయాడనిసుంగట! యారితీబుధీ
జనము నొకొక్కచోఁ బలుకఁజాలని హేతునిబద్ధమై నయం
బెనసి సమగ్రతస్ఫురద నింతటిదక్షతఁ బల్కనేర్చు! బొం
దును గడునబ్బురంబగుచుఁ ద్రోయఁగరానిదిగాఁ జెలంగదే? ॥ 221

చ॥ అయినను ముందువెన్కరయ కాతురముబ్బఁ దెగించి కార్యని
ర్ణయమెదిలేక పూనఁగ ఘనంపుటనర్థము లుద్భవిల్లుఁ, బ్ర
త్యయమున బాగునోగుఁ గని యవ్వల నేర్పునఁ గార్యమూన ని
శ్చయముగ సంపద ల్వెలపెసంగఁ దమంతట్లఁజేరు నింపుగన్ ॥ 222

ఉ॥ కోపము దట్టమౌమునుగు కొంచెము గొప్పయు, మంచిచెట్ట, మే
లాపద, వీలుఁజాలుఁ, దగునా! తగదా! యని యెన్నలేని దా
యేపునకు న్వివేకి చలియించునె? వాగెల రొతు మావున
ట్లాపస తెల్వియైఁ దఱికి నందఁగఁ జూపఁడె బుద్ధిధారలన్? ॥ 22

* తే॥ కార్యబీజాళిని వివేకకంకణముల
నించి పాలించువానికే నిండుఫలము
లంబుదమువలె వాఁడె లోకాగ్రపీఠ
వర్తియై సంతతసుఖంబుఁ బడయుచుండు॥ 22

ఉ॥ కావున, శాంతమే యిపుడుకార్యము, దానికి హేతువుండియు
న్నేవచియింపరాదిపుడు, నిల్చుకతం బది లేఱువెన్క నీ
తావును నాలసింపక విడన్గలవాఁడను నిక్క మంతకు
న్నీవును నాకుఁగా క్షమగణింపుము నోపికఁజిక్కఁబట్టుమిా! ॥ 22

ఉ॥ అనఁగ ననమ్మతిం దెలుపునాస్యమునందు సతీత్వభావసం
జనితమనోజ్ఞత ల్వినయశాంతరసాంకము లుద్భవింప నే
గు సబలఁ గాంచి యాతఁడనుఁ "గోమలి! చింత నిఁకంద్యజింపు మే
డి! నగుమొగంబు మేల్తొగరుదీప్తులు చెక్కులఁ జిందిపర్వఁగన్॥

ఉ॥ నీనగుమోముచందురుని నిగ్గులెసూ ననుముంచు మేఘముం
బోని విపత్తముం బడలిపోనడలింపఁగ! రాయియైనసా
మానసముం ద్రవించుగరిమ న్గనఁజేయఁగ! నేవి! క్రమ్మఱు
బూనుము మందహాసమును బోముదు తొట్రిలెదేల? నెచ్చెలీ!

చ॥ తమకెదనంచునుం జడిసెదా! యిదె దవ్వున నిల్చువాఁడ, రా
సమరికిఁ దొట్టుచిర్నగవు నాపకు నోటికెలంకులందుఁ, బ్ర
క్కమొగము వెట్టు నాహరాయలు కారణమై యదె! వెల్గుచీఁకట
ల్సమత నిటట్టును న్వెలయుచక్కనిమేరువు నూహఁగొల్పెడిన్॥ 22

ఉ॥ ముసిముసినవ్వెచాలు ననుమోదమొసంగెడి, పొడ్పుగుబ్బకా
దెస శశిచేరినంత నలుదిక్కులుఁ దేటలఁ దేఱుఁగాదె? ప్రే

* అభివర్షతి యోఽనుపాలయ న్విధిబీజాని వివేకవారిణా।
స సదాఫలశాలినీంక్రియాం శరదం లోక ఇవాధితిష్ఠతి॥ భా. స ౨. శ్లో 3

యసి! మెదిమెట్టులైన హృదయంబునఁ గుందకు, కుందు నైన సం
తసముగఁ గాంచువారలకు దాపుసుమీ! యపవర్గసౌఖ్యముల్॥
శా॥ నాదేహంబున నేవళమ్ము మిసుము ల్నానాఁటఁ బోచుండెస
న్నేదం బూనకు మేలిగాలిఁ బొలముం దేయుండి ప్రొద్దెండలో
కేదాడి స్థగుపాటుచేతనె సుమీ! కేకత్తె నారోగ్య; మా
హా! దైవాజ్ఞవిచిత్ర! మన్నిఁట నచింత్యానందనే త్రోఁచెడిన్॥ 230
ఉ॥ అడియుంగా కిటఁ దోడివార లొసరైనపైలఁ "జటారాపికా
పడలన్ దోషను"సంతు సాము లొనరింపఁ జూచి యొఁగూడి నే
ర్చెడ బాణా వడిఁద్రిప్పఁ గన్గొనుము తచ్చిత్రంబటం చాలు స
మ్మోదిపన్ బహుభంగుల న్వాలయుసాము లూచ్చె నాతం డటన్॥
మ॥ వెలిపెబ్బ ల్సరిపొటుపులు న్విసరులు న్వాన్కూత్తులు న్దాటులు
న్మలుపు ల్మార్కొనుట ల్మలంగుపరుగు ల్మధ్యాహతు లూచ్చుపుత్రి
ప్పుల బాకా తనచుట్టుఁ జిత్రవలయంబు ల్గొల్ప వక్షంబువి
ప్పలయ న్గాళులు వింతదాట్లఁగొన నెంతో నేర్పుఁ జూపింపఁగన్॥
చ॥ భయ మఱువెన్కనబ్బురముపాటు పదంపడి కౌతుకంబుఁ ద
న్నెయిదఁగ, లక్ష్మి, యాగరిడియేపుల నేటుల నుబ్బుభావము
ల్పయికొన హస్తపాదగతి భర్త కెటుల్పడుచుండె నట్లు తా
నయి వెనువింత సమ్మదము నాతని కేర్పడఁ జేసెఁ బెల్లుగన్॥ 233
ఉ॥ ఆగఁటి పొడ్పు లంగముల, నాసరి దూఁకులు కాలుసేతులం
దా గరువంపుఁ జూడ్కి పరు వక్షుల నాతని మోజుఁ బెంప, "న్హో
హో! గరితా! కుతూహలము యోగ్యతఁ గన్గొన బాణవిద్య నీ
కాగతమా సుసూక్ష్మముగ" నం చొకకోలను జేతికిచ్చుచున్॥ 234
తే॥ "గట్టిపిడికిటఁ గోల నిక్కరణిఁ బట్టి
యిట్టు లీరీతి నీచాయ నిట్లు త్రిప్పు"
మఱుచు మెలమెల్ల నావిద్యయందు సతికిఁ
దివురు కుతుకంబుఁ బెంచె భారవి కరంబు॥ 235
ఉ॥ బాల్యము లౌల్యముం జనవు భర్తృసమాదృతి పైకొన న్దిశా
ఖ్యాల్యము సన్నగిల్లిచన, చాన, క్రమంబుగఁ గొంకుజంక, సా

కల్యముగాఁగఁ దత్సమయగౌరవనీయ సతీస్వకావనా
మూల్యతదీయచంక్రమణము ల్దివసక్రమయుక్తి నేరిచెన్॥ 236

ఉ॥ ఎట్టనియెండవేఁడి యొకయింతయు విఘ్నముకాదు, త్రిప్పుడుం
గట్టల వంకర ల్నిలుపుఁ గల్పనసేయవు, కందిచేనిలోఁ
దెట్టలె సాముప ట్లచటఁ దేఱినబోదెలు మిట్టపల్లము
ల్నెట్టెలు నాఁడునాఁట నడనిగ్గులలోఁ గొనియె న్సమత్వమున్ 237

ఉ॥ కాలిటుమెట్టఁగావలయుఁ గైనిటుత్రిప్పఁగవీలటంచుఁ దా
నాలిని దిద్దువేళలఁ దదంగము సోకిన మేన గగ్గురు
ల్దేలి నవీనసౌఖ్యమునఁ దెంపున జల్లనుగుండెదాఁటుల
న్వాలికచూడ్కుల న్మెలఁ చుపట్టుల మన్మథుఁ డాడు నట్టువల్॥238

చ॥ అపుడు మగండు ప్రేమజనితార్భటి నిండినచూడ్కిఁ జూడఁగా
రెపరెపలాడు మానసమురీతి బలంబయి లక్ష్మి తెప్పల
న్దపతపఁగూర్చెఁ దద్రుచిరనాట్యము తిర్గెడుదీపగోపురం
బుపస నొసంగె నుబ్బఁగొనుమోహమహాబ్ధి భ్రమించు వానికిన్॥

ఉ॥ రైకఁ బిగుల్చు చన్నుఁగవ రాయిడి పైటకు బింకమీయఁ గ
న్దూఁకులఁ జెక్కిళు ల్తొగరుతోఁపుల నుబ్బఁగొనంగ వీఁక ధా
ధాకలఁ గల్వకంటిలగుడంబులు మాటికిఁ బైఁబడంగ న
ట్టాకల బిట్టునొంచెఁ గుసుమాస్త్రుఁడు భారవిఁ బొంచుపోటులన్

ఉ॥ మోహముకైపునన్ మిగులముగ్ధుఁడు భారవిభట్టు పూర్వస
న్నాహముమాని కౌఁగిలిని నాఁచుకొన న్జెయిఁ జాచుచుండ నా
యూహ నెఱింగి తుట్టనె నవోఢ, భయంబొ విలాసమొక్కొ సం
దేహమువీడ కాతఁ డటనిల్వఁగ నాతనిభార్య దవ్వనన్॥ 241

చ॥ "తమకెదనా?" యటంచుఁ గడుధైర్యము బాసనొసంగనాథ్యులా
తమ కెద యింతలో బిగువుఁదప్పుట తప్పట, తప్పెట న్బికో
త్తముఁడు కుహూకుహూనినదధాటిని జాటెడి; నేఁటి కాట చా
లు, మగుడుచుంటి నింటి", కవి లోలశుభేక్షణ కేలుమోడ్చినన్॥

మ॥ అరచేముద్దున హస్తమెత్తి "భళి! వహ్వా! నెచ్చెలీ! భ్రాంతియొ
క్కరవంతేనియు లేనిరిక్కవన నిక్కంబయ్యె మేల్కొంటి, నా

పొరపొటొంచుచు రేపు రావెటచెదేమో! నమ్ము మీమాటు ని
బ్బర మింతేని జలింపనీ" నసుపతి న్బల్మాఱు వీక్షించుచున్॥ 243

ఉ॥ "ఇంతటికల్పుకోల్తనము నీసయిదోషములఁ గూడురక్తి యీ
మాంతసమంపు నిష్కపటమాధురిఁ జిమ్మెడిపీరు పల్కరిం
పింతయులేమి నెట్టుల వటించిరొకోమది నిన్ని నాళ్లు లీ
సంతనయే మహౌషధము సాగెడుఁగావుత మిట్లు నిత్యమున్" ॥244

మ॥ అనుచు, న్నాటికి మళ్లిచూచుచు, మగం డావంకఁ జేవీవ వం
దనముంజేయుచు, నేగులక్ష్మి నతఁడు న్గజ్జాపుమే రేగునం
దనుక న్నిల్చి, నిజార్హ్యకృత్యములలోన న్శ్రద్ధఁబూను న్గ్రిమం
బున, నిత్యాంబిటులే సమాగమము తెంపుల్లేక వర్తింపఁగన్॥ 245

సీ॥ పులుఁగుకూఁతలకు నింపులు నేర్పుపొలికేక
నొడిసెల న్విసరుఁ దానొక్కదినము
బంధుపూవులకు మేల్కాంతి సంధిల్ల నా
చెంత నొక్కొకనాఁడు చేరిమలయు
కలుపు మాకేగాని కాదు నీకన్నట్లు
కలు పొక్కహంబునఁ గడఁకఁదీయుఁ
గౌతుకంబునఁ బెద్దరౌతుగా నొకప్రొద్దు
చిఱుగుఱ్ఱమున స్వారిఁజేసి డాయు
కఱ్ఱ నొకదానిఁ బాఁతి లక్ష్యముగ సాము
సాధనమొనర్చు నొకపవల్ సారసాక్షి
మగఁడు ఫలహారముంగొని మంచెక్రిందఁ
బంచెఁ బఱిచి పయి న్విశ్రమించుతఱుల॥ 246

మ॥ "తొలిరో జొందినమారవిభ్రమము నెందు న్గ్రిమ్మఱన్జాప రే
యలుక న్బొందినజాడయుంగలుగ దాహా! నాఁడటు ల్పర్వున
న్దొలఁగంజాఱిన లోఁజివుక్కురుమన న్దోషంబుదోషంబుత్రో
పుల నేయార్తి ఘటిల్లునో" యనుచు నల్పు న్లక్ష్మి సేవ ల్తమిన్॥

ఉ॥ కన్నులకుబ్బి కుత్తుకకు గట్టిగమూఁగి గగుర్పుతోడ మై
యన్నుకొనంగ రేఁగి మనసా! ధడఁ దాట్రిలసాగెదేల?, ని

న్మన్ననఁజూపి యాతఁ డభిమానముఁదక్కి వరింపకున్న నీ
తెన్నదియో!" యటంచును సతీమణి బెగ్గలుఁ జిన్నవోవుచున్॥

ఉ॥ అంతికమందె యాత్మలఁగు నైనను లాభముసున్న స్వవ్రతం
బెంతయుఁబొంగి వార్నిధిగ నేపుల మధ్యమునొంది పోరుల
న్వింతయెడంబుఁ గూర్చు, సతివేడుక లెక్కనె చిత్తవీథికిన్?,
గాంతచన న్విరాళియెసఁగ న్గడుచేరువ నిల్చినట్లగున్॥

ఉ॥ ఆచిరునవ్వుసోయగము నాయరవాల్చినమోము గోము నా
మేచకవర్ణనేత్రముల మేకొను క్రీఁగనుచూపుకోపు నా
వాచవి నూరిమీఱు రసవన్మధురోక్తుల తీపియేపు నే
రా! చతురాస్య శేషదివిజాధిపులే న్బలుక న్వలంతులే? ॥

చ॥ అరుదుల భ్రూవిలాసనిచయంబుల నుద్ధతుల న్గ్రమించుచు
న్బిరబిరదాఁటి సూటి నలబిత్తరి క్రేఁగనుచూపుటంపఱ
ల్బులుకుచుఱుక్కన న్నిగుడ చుమ్మలువాఱెడిమానసంబు ప
ల్మఱు మరులూని మారుఁడను మాంత్రికుఁ డుంచినడోల సోలుచున్

—♦ లక్ష్మీ భారవుల కార్యమునందు భారవినిష్ఠ ♦—

ఉ॥ ఈవిధమై యెడందల రతీశవిలాసమెసంగఁ బైకి నా
భావమొకింతయు న్వెడలఁ బాఱనివైఖరి వార లందు నా
నావిషయప్రసక్తుల దినంబుల నెట్టుచునుండఁ గూఁతు తే
జోవిధ మాత్మ శంకకును జోటిడఁ దల్లి ప్రమతంబ నాధునిన్॥ 252

ఉ॥ చేరి "యిదేమిబింకమొకొ! చిన్నతనంబనికాని, కృత్యము
ల్భారములంచుఁగాని వలవంతఁ గొనం డొకనాఁడునేని, నే
కారణమొక్కొ! నే ననెడికాఱుల కుల్కక తుష్టి నవ్వు సొం
పూరుముఖంబుతో మెలఁగుచుండు నితం డిట నిందుఁదాలిమిన్! ॥

క॥ జననీజనకులపోలకువ
పినమింతయు, వారు యాత్రవెడలి బహుదినా
ల్చనియె, నిలుసేరకుంటకు
ఘనమగుభేదము విరక్తిఁ గలిగించెనొకో?॥ 254

మ॥ మనకు న్నాకిరి సేయఁగాఁ గుదిరె నేమాటేటి కన్యాప్తి "గ"
మ్మని మీరూరకయుండ "నిల్లటము తెమ్మా! భాగమం"చీతఁడా
డిన రేపెట్టుల?, "పూర్వసాధితముమాటే లేదు నాస్వార్జితం"
బని వియ్యంకుఁడు సున్నవెట్ట గతియేమా వీనికి న్జూడరే?"॥ 255

చ॥ అని సతి చెప్పి చూపువ్యవహారపుఁజిక్కుల నాలకించి "యే
మనవలెనే? కతంబడుగ నట్టిటుఁబల్కఁడు వీఁడు వారివ
ర్తన మిదియుం చెఱుంగఁదగు దారియుఁ దోఁపదు, పొమ్మ"లేచిపో
మ్మనఁగలమే? యతండుచన నవ్వల దానికి నేదిమార్గమా?॥ 256

ఉ॥ యాత్రనో పారియాత్రనో తదన్యమునందొకో? వారిపోక యే
మాత్ర మెఱుఁగరా, దితని మాతులుతావుననైన లే, రస
చ్ఛాత్రులు వీనియూర నిదిచాయయటంచు వచింప రింకనే
సూత్రము లేదు కాఁగలది చూచుచు నూరకయుంట తక్కఁగన్॥ 257

మ॥ పతిపల్కుల్విని "యట్టులేని నిఁక నిల్ప్రాదు కార్యంబు నీ
గతి నొక్కింటఁ జరించు వీరలకు నెక్కాలంబునం దెట్టులౌ
నో? తగ న్మూర్తముఁజూచి జ్యేష్ఠసుతల న్దోతెం, డిటెవ్వారిదు
స్థితి కెవ్వారలు పూఁచికాఁగలరు? ప్రాప్తి న్మార్పఁగా శక్యమే?"॥ 258

ఉ॥ నావుడు, భార్యపల్కులు మనఃప్రియము న్ఘటియింప, "నేను నీ
భావము నూనియుంటిఁ, గడుబాగుగఁ దెల్పితి వీవు మే", లటం
చావసుధామరుండు సమయజ్ఞుల పెద్దల సంప్రతింపుతో
నావిధి వెళ్ళఁబుచ్చెఁ, దనయాప్తులె చేరిక వేడ్కసేయఁగన్॥ 259

ఉ॥ అక్కలనాఁటికార్యముల నైనవిలాసముల స్మృతాంశము
దక్కమిఁ జిన్నవోవువనిత, న్దనయుండినయుక్కి హేతువై
యెక్కరణి న్వినోదము వహింపనిభారవిభట్టు నొక్కటే
ప్రక్కకుఁజేర్ప నేరి కట భవ్యసుఖంబని పల్కనేర్తుమో?॥ 260

చ॥ గడెపడెఁ దల్పు, తల్పమునఁ గాంతుఁడు కన్బొమ మోడ్చియుంటకు
న్గడెపడె లక్ష్మిచిత్తమునఁ గారణమేమియొ పోల్పలేమి, న
య్యడరుఁగ్రహించి భారపి రయంబునఁ జేరఁగనేగి "ప్రేయసీ!
జడియకు రమ్మ! నీవలన సాయముఁ గోరెద నాలకింపుమీ!"॥ 261

మ॥ అనుచు న్నయ్యుకు దాపుపీఠముఁ నధ్యాసీనఁగాఁ జేసి తా
నును సెజ్జ న్దటిగా వసించి, చెలంగంచు న్జేతుల న్మ్రాని వా
ల్చినవాని న్నిలుచున్న జాయఁగని, "యోసీమంతినీ! నెచ్చెలీ!
వినవేవింటివిగా వ్రతం బెసఁగున వృత్తాంత మీవింతకే?॥

మ॥ వ్రతసంపూర్తి యొసంగుదాఁక నియమవ్యాపారము ల్వీడు టు
న్నతికి న్జేటగుఁగాన సంతవరకు న్సాంగత్యము ల్గూడునే?
పతికిన్భార్యకు?, దీని నెవరుసఁ దెల్పన్వచ్చు నీ కంచు నొం
దితిఁ జీకాకొకయింత ధైర్యమును గొంటి స్థిర పీవేటచేన్॥

మ॥ అతనుం డైదుతల ల్ధరించు తనదివ్యాస్త్రంబు నాపై సము
ద్ధతిఁ బంపం, బలమేది లోఁబడెడు నాప్రాణంబులైదు, న్గడు
స్మృతి నాయారవప్రాణమీవు, నను శాంతిన్దేల్చెదో భ్రాంతికా
మెతగా ముంచెదొ, భారమంతయును గొమ్మీ! దారిఁ జూపింపుమీ!"

చ॥ అను పతివాక్యము ల్విని, వయస్య, శుచిస్మితదృష్టి నాథుమే
నున కొక చామరంబగుచు నుక్కట మీదికిఁ గ్రింది కాడు వీ
వనయన హాయిఁగొల్పఁ, బతిపాదసరోజపుటంబులందుఁ గే
ల్లనల నిగుడ్చి పుణ్కి నయనంబులఁ గైకొని పల్కె నిట్టులన్॥ 26

చ॥ "తమ కనుసైగ యాజ్ఞగ సతంబును గొల్చి తరింప నున్న నా
కమరునె వేఱుభావము?, నయజ్ఞులు మీ రెటునిర్ణయించి రా
యమరికయే మదీయపథమయ్యెడు, నయ్యది యట్టులుండ, ని
త్యముఁ బరిచర్యకైనను దయ న్సెలవిచ్చినఁ గొండనెక్కెదన్॥ 26

ఉ॥ ఈమనపొందు నేఁడు విధియించినపెద్దలకోర్కి నుంచుఁ డే
నే మిడిమేలఁపు న్బిడియమేనియుఁ బోవిడి మీయసడ్డచే
నోముట తక్కి చిక్కి మిము నూఱటసాక ఘనావకాశ మి
ప్డీమెయి నొందినందుల కివే పరమేశునకు న్నమస్కృతుల్"॥ 26

చ॥ అన ముదమంది యాతఁడు శయానుఁడుగాఁగఁ బద్ధంబు లొత్తుఁ
స్దనహృదయేశ్వరుండు కనుదమ్ముల మోడిచి నిద్రఁ జెందునం
దనుకను సేవఁ జేసి సతి ధారుణి వేఱొక సెజ్జఁ గూర్కె, నీ
యనువునఁ గాలమేగఁ దటియయ్యెను శ్రావణమాసపుంతటిన్॥

ఆ॥ వె॥ జ్యేష్ఠసుతకుమార్తెయే తనరెండవ
కొమరుభార్యయగుటఁ గోరి కార్య
మునకు వచ్చియున్న తనయలఁ బతులతో
నిలిపె నోములను గణించి జనని॥ 269

తే॥ పెద్దకోడలు మనుమరాల్వేడ్కచెలఁగ
నోములకు సిద్ధమగుచుండ నామతించి
తల్లి యప్పలు వారి కంతయును దిద్ద
నడుగు వాల్లేక లక్ష్మి తారాడుచుండె॥ 270

శా॥ "నామాటే తలపెట్టదమ్మ, పరులందఱ్వారిసంతోషమే
ప్రాముఖ్యమ్ముగ సంచరింత్రు, విడువన్నానట్టివీనోము, లే
నేమంచు న్జని, 'తల్లి! నన్దలఁపవేమే' యంచుఁ బ్రార్థింతుఁ 'బో
పో! మామయ్యయొ యత్తయో మగఁడో ముద్దు న్గూర్చునాఁజాలదే?॥"

క॥ అడుగ న్మరమెరపడు, మఱి
'యడుగకునికి నోము జరుగునా'యని యడుగ
న్దొడరు, గడునెడరుటవమతి
పొడమునోయని యడుగు టుడుగుఁ బొలఁతి చిడిముడిన్॥

శా॥ చిన్నంబోయినమోముతో నెడఁబెడన్జేరు స్రవం తేరు త
న్గన్న న్గౌతుకమిచ్చుకంబుఁ గొలుపంగాఁజూచు వారేది'తె'
మ్మన న్గొబ్బునఁ దెచ్చియిచ్చుఁ, దుది నేరైన న్వినోదార్థమై
న 'నీవు న్నరిక'మ్మటందురనుచింత న్గోర్కు లత్రాడఁగన్॥ 273

క॥ "ఔరా! యీనిరసన మీ
తీరగునతిశయము! వీరితె న్నిఁకనేలా
కోరఁగ?" నని ధీరతఁగొను
నారీమణి లక్ష్మి మఱి వనట లోఁగుములున్॥ 274

ఉ॥ ఆడుగుదునా! పతిన్? యుడిగమం దిటనుండినవారి కెల్లచే
పడియెడు రొక్క? మేయుపమఁ బల్కుదురో, యిఁక వారుగాక నా
యెడరువినంగ నిందెవరు నేని నెనంగిరె? వీనొసంగిరే?
తడసిన యేరుపా టొకటి తాఁదనయంతనఁ గల్గఁబోవునే?॥ 275

శా॥ అమ్మా! యింతటిచిన్నచూపటవె? భాగ్యంబున్నఁ బైఁబూసికొం
టిమ్మెంఁ జెందుకె లేమిడి? న్సరులఁబోని మ్మావె 'నాప్రేగె' నాఁ
కిమ్మాడ్కి స్బెడమోముఁ బెట్టుటయె? పోయెన్ప్రేమమున్నాలి, యా
యమ్మన్బోలినదాన నేను, జనని న్వ్యాచ్న న్సమీపింతునే?"। 276

క॥ అని యనుకొనులక్ష్మి కరం
బునఁ జుబుకముతో గవాక్షముందట నెదియుం
గనక విడఁ బాఱుకన్నవఁ
గనుపడఁగాఁ జూచి తల్లి కడురభసమునన్॥

ఉ॥ "మూతిముడుంగఁ గన్బొమలు మూఁగ నిలంబడ నేమిలాభమో
కూఁతుర! యత్తవారు సమకూర్పఁగఁదగ్గవినోము, లేమి తా
నీతటి సల్పునో యడుగుమీ! మగని, న్గుఱచూచెదేల? నీ
వ్రాతకు నుమ్మలింపుమ యెవం డిట నెంతటిదాఁకఁ బ్రాపిడున్॥

శా॥ కార్యంబం దొకచిల్లిగవ్వయును దేఁగాఁబూనఁ డెవ్వారు నా
శ్చర్యంబొందిరి, మచ్చటా! పలుక! చాల్చా ల్సాబడంబయ్యె!, నీ
దైర్యం బేమియొ బిడ్డనిక్కడవు చేతా కేమిచేకూర్చునే?
వార్యాదు ల్గనిపొమ్ము చేని కిటనిల్వ న్నిల్వసొమ్మబ్బునే॥

చ॥ కడసరికూఁతువం చొరులు కాననిరీతిగ మంచిచెట్టల
న్గడపితినెట్లొ యిందనుక గౌరవయుక్తముగా దినంబు, లె
ప్పుడు నటులే యొనర్చుటకు బుగ్గయె పెన్ననియో యెసంగ దిఁ
దెడనెడఁ గల్గు దెప్పుడుల కే నిఁకఁ దాళఁగలేను తెల్పితిన్"॥

క॥ అని కొసరుకసరుతోడ జ
ననియేగిన యుడుకుఁగొనుమనంబున లక్ష్మి
వనితయు వలసినవానిని
గొనిచనెఁ బతిఁజేరి తెల్పుకొనఁ బొలమునకున్॥

— భారవి స్నేహితుఁడగు నారాయణుఁడు యతివేషమున వచ్చుట

ఉ॥ అంతకుమున్నె యచ్చట మహాత్ముఁడు భారవి శాలిపాలనా
క్రాంతమనంబున న్వెలయఁ బ్రాంతపథంబున వచ్చునొక్కఁ డం

దంతట నింతట న్నిలచి యాతనిఁగన్గొని నిల్వనీఱుగా
వంతమునింపఁ గుంది "భగవానుఁడ! ఘోర"మటంచు నార్తుఁడై॥

క॥ ఒకతాఁడిబోదెవెన్కఁ జ
తికిలంబడి "నిర్దయావిధీ! యీతని నిం
తకుఁదెచ్చితివె? చెడునోడుదు
డుకుల న్మము వేఁపుటే కడు న్నీకలరే? ॥ 283

క॥ ఓప్రాణసఖుఁడ ! వ్రతమని
నాప్రాణముఁదీసి బాస నన్నట నిలువ
న్వేప్రార్థనము లొనర్చి, య
హా! ప్రారబ్ధానుభోక్త వయ్యెదె యిచటన్?॥ 284

క॥ అనుకొనినయంతయైనది
కనఁగల్గుదు నత్తవారికడ నిన్నని తో
ల్తనె యిందు వచ్చి నందుల
కు, నమస్కారముల భక్తిఁగూర్తు న్వారికిన్ ॥ 285

సీ॥ రాట్సభాద్విజకోటి రంజించునీపాటి
యీద్విజారవధాటి నెగపనగునె!
కేదారకళమీటి వాదించునీపాటి
కేదారకళఁ బాటు నూఁదనగునె!
పేరుకాల్వలుదాఁటఁ బెడలొత్తునీపాటి
పేరుకాల్వలు మాఁటఁ జేరనగునె!
మేటిసూరులఁ బోటి మిడికించునీపాటి
మేటిసూరులగాఁటు మెలఁగనగునె!
తే॥ నృపుబికారిగ మఱి బికారిని నృపునిగఁ
జేసి రంగాంతరంబులఁ జిత్రనాట
కంబు లెసఁగించు హరిప్రపంచంబురీతి
దుఃఖమును నిర్భరసుఖంబుఁ దూఁచు త్రాసు ! ॥

సీ॥ గంటంబువోయి నాఁగలి మేఁడి చేఁజిక్కె
నే కవిత్వావనీనేత కిచట?

పదచాలనం బిట్లు పదచలనంబుగా
మాఱెనే కావ్యనిర్మాతృకిచట!
ధారణయెల్ల సాధారణకృషిమాత్ర
మయ్యెనే యవధాని కకట! యిచట!
ధ్వన్యలంకృతు లసధ్వన్యలంకృతులుగా
నమరెనే సూరిజనాగ్రణి కిట!
తే॥ మహితవేదాంతవాక్యార్థమహిమ మేగి
బహుళసీమాంత సీమంత పటునటనము
వఱలెనే యిందు మేటిసర్వజ్ఞునకును!
భారవీ! యేల నీ విట్లు చేరితోయి?॥ 287

సీ॥ ప్రకృతిశోభలఁ బుణ్కి పలుమెఱుఁగుల నూర్పు
నూఁదుటో నీబోటియోధున కిది?
యూహాల జిలుగు చెన్నొడికంబు చికిలచే
జీవమిచ్చుటె యేమిత్రో వర యిది?
వ్యక్తులభావసంపదల దక్షతఁ గావ్య
రంగంబుల న్గొల్పుక్రమముర యిది?
రసధునీబహుళతరంగసంప్లావిత
చిత్రకథాకళాశిల్పమ యిది?
తే॥ తురగధారానుకారివాగ్ధోరణులను
జిత్రబంధకవిత్వవిశేషములను
రసికత మెలర్పఁదగు విహరణమ యిద్ది?
చేలవై యేలరా యిట్లు జాలిఁబడితి?॥ 288

ఉ॥ ఒట్టిడి యాంక్షఁగట్టి వెఱయుంచితి వక్కటా! నీదుమ్రోలకే
నెట్టుల వచ్చువాఁడ నిది యిట్లని సర్వముఁ దెల్పువాఁడ? నా
కట్టిడి బమ్మ మర్త్యులకుఁ గష్టముఁ గొల్పుచు దాఁటువాలు క
న్పట్టఁగ జేయకున్న మనవంటి మహార్తుల కేదిదారియో?॥ 289

సీ॥ నీయెడబాటు మున్నే సగంబు కుదించె
మిహిరుచేఁ గడమయు ఖిడికిపోయె

నింక నా కేసౌఖ్య మేటి కన్న విర_క్తి
దిగఁదీయ దిగఁదీయఁ దెగువఁజేసి
తల నున్నగావించి మోలఁ గావిని బిగించి
పావకోళ్లు ధరించి భయము డించి
దండంబు సంధించి కుండి కై మెఱయించి
జందెంబు మొలనూలుక్రింద నెట్టి

తే॥ నొసటిపై భూతిరేఖలు పొసఁగ బొంగు
ప్రోత మాటలు వెడలంగఁ బొందుఁగూర్చి
వెరవుమై యతివేషంబు వేసినాఁడ
నిన్ను నెమకు తలంపులు నింగిముట్ట॥ 290

తే॥ పోల్చుకొనకుంటివో మేలు పోల్చుకొనిన
ముంచుకొనిపోవునది లేదు పొమ్మటంచు
ధైర్యమూనితి బాస నింద్యమగు ననుచు
చి_త్తశుద్ధిఁ గృతు ల్జయం బె_త్తకున్నె?"॥ 291

క॥ అని లేచి హుటాహుటిగాఁ
దన పావా లులియ నడుచు దండిని గని భ
_క్తిని భారవి ప్రవరనుడివి
మును సాష్టాంగప్రణామమును గావింపన్॥ 292

క॥ "ఏరా! భారవివా! నీ
పే రటనటవింటి మంచివిజ్ఞుఁడవఁట యే
దీ! రమ్ము! కొంత యూతరు
తీరమ్మున గోష్ఠిసలుపఁ దెమ్ము జలంబున్"॥ 293

చ॥ అనఁగఁ బునఃపునఃప్రణతు లర్పణఁజేసి సమర్హ రీతి న
ర్చనము లొనర్చి "త్వాదృశులసన్నిధి నోరు మెదల్పఁజాలువాఁ
డనె? మిమువంటివారల కడల్కొనువత్సలభావమే తరిం
పను సుగతిం జరింపను భ్రమల్బెడఁబాపను నాకుఁ బ్రాపగున్॥ 294

—♦ భారవి దిగ్విజయ యాత్రాకథనము. ♦—

క॥ నావుడు జటి "విద్యకలిమి
కీవినయము వన్నెవెట్టు నింపయ్యె బలే!
నీవామగధ న్నృపసం
భావన మేరీతిఁ గొంటి పలుకుము వత్సా!॥ 295

మ॥ అన "సర్వజ్ఞులు మీ రెఱుంగనిది కద్దా? సత్కృపాదృష్టిపెం
పున నేఁడెల్ల వినందలంచుటలు నాపున్నెంబ, స్వోత్కర్షగా
ననుకోకున్నఁ ద్వదాజ్ఞఁ గైకొని తదీయాస్థానిలో నాఁడు క
ల్గినసర్వంబును విన్నవించుకొనెదన్ గ్లుప్త ప్రకారంబుగన్॥ 296

తే॥ అధ్యయనమెల్ల పరిపూర్తి యైనపిదప
గురులసెలవొంది నామామ కూడరాఁగ
దేశదేశసభాస్థలు ల్తిరిగి తిరిగి
చేరుకొంటిమి మగధ కా యూరిలోన॥ 297

మ॥ మజిలీ చేసి తదీయపారిషదసంపచ్ఛోభ దర్శించు ని
చ్ఛ జనింప న్పురవీథుల న్వెడలి సంచారంబు సల్పంగ నొ
క్కజమీందారుని ప్రాంగణంబునను మూఁకల్గాఁగ విప్రోత్తము
ల్ప్రజలు న్నిల్చుటఁజూచి యందొకఁడు తెల్ప న్హేతువాలించుచున్॥

మ॥ నిలువ న్లోపలినుండి వీనులఁబడె న్నిర్నిద్రరావంబుతోఁ
"బలుమాట ల్వచియింప నేమిటికి సర్వజ్ఞుండ నేనంచు నిం
దుల రాజేంద్రనియుక్తపీఠమునఁ దోడ్తో నిల్చుచున్నాఁడ ధీ
బలవంతుల్గలరేని రం డిదెసవా ల్వాదింపగావించెదన్!" 299

శా॥ ఈగంభీరవచోవిరావ మొకమా టిమ్మాఱు ముమ్మాఱుగా
సాగ న్మామనుజూచి వారికడ నుత్సాహంబు గుర్తించి "యే
మీ! గర్వోక్తి! సభాసదు ల్పలుక రేమీ! మాఱుమాట! న్భళీ!
యాగజ్ఞాలుట కొక్కపండితుఁడు లేఁడా"! యంచుఁ బ్రశ్నించినన్॥

ఉ॥ దాపుననున్నవారు కనుదమ్ముల నబ్బురము న్భయంబును
న్దోఁపఁగ నోటిపైనఁ దమదోయిలులుంచి 'కుమార! యింత లే

వీపగిది వ్వాసింతువె? మదేభముఁజూచి మొఱుంగుకుక్క చే
నేపని నెగ్గు సాహసమునె త్తకు' మన్నలహా వచింపఁగన్॥ 301

ఉ॥ "ఆఁచి యిటు ల్ననుం జడియనాడెద రేటికి? లేవె భూమిపై
తేఁచులు మత్తనాగములు తిచ్చవడ న్దరియింప? నీసభ
న్గాచి సవాలు నందుకొనలేనియశక్తుల్రమోల భీతవా
చాచతురత్వము ల్మనవిసల్పుఁడు నాకడఁ జెల్లవీనుడుల్"॥ 302

మ॥ అనుచు న్లోనికి నేనుమామయును ధైర్యస్ఫూర్తిమై నేగుచుం
డినచో 'మేల్భళి! మాటలేమిటికి? పో! డీకొమ్ము! డీకోక డిం
దునె నీహెచ్చ'ని 'పెద్దవానికిని లేదో బుద్ధి? యం "చేల? పో
యినఁబోనిం డెఱుఁగంగ శక్యమగు నే యేపుట్ట నేపామొకో? "

మ॥ అని చుట్టుంగలవారు పల్కుకొన నీయాగుబ్బునాలించి తేఁ
డిన దీప్తిస్ఫుటదృష్టి నందుఁగనఁగా "నేమేమియూస"ద్దటం
చును నందున్న ప్రధాని వాకొనఁగ'నుసో! త్రొక్కరాచేయి వీఁ'
డనువారిన్ క్షమియింప వేడి సభమధ్యంబందు నుచ్చైర్ధ్వనిన్॥ 304

శా॥ "ఓరాజేంద్ర! సదస్యులార! సభలో నుద్దండుఁడై యీఘనుం
డీరీతి న్వివదింపఁగోర మునులై యిట్లుంట న్యాయంబె? ధై
ర్యారంభంబున నెత్తికోల్కొనిన గెల్పన్మాటలేకున్న నీ
సూరిశ్రేష్ఠుని కీర్తి నల్వురకు మచ్చు ల్చూపఁగాఁ బోలదే?॥ 305

మ॥ ఉరకే వజ్రము వజ్రమన్నను దదీయోత్కృష్టత ల్తోఁచునే?
కఱకు న్సానల తాఁచి తేర్చికొనినంగాదే మనోజ్ఞంబులై
పరఁగు న్దత్కళ లన్నిదిక్కులను, దద్వాదంబుఁ బాండిత్యము
న్మఱియున్వెల్గుత వాదఘర్షణముచే మాన్యుల్ప్రశంసింపఁగన్॥ 306

ఉ॥ పెద్దలు నానమస్కృతులఁ బ్రీతిగ్రహించి యనుజ్ఞనిండు" నా
నోద్దిక రాజు నన్బిలిచి 'యోయి! వటూత్తమ! నీదుసాహసం
బద్దిర! మెప్పుఁగూర్చె!, వినయంబును ధైర్య మెసంగునీనుడు
ల్ముద్దులఁగొల్పె, నీవసతి పుట్టుక నామముఁ దెల్పుదే?" యనన్॥

చ॥ అడఁకువతోఁ 'బ్రసా'దమని యాదలవంచి యెఱుంగఁజేసి 'నా
యొడయఁడు మేనమామ దెసలొత్తెడి దివ్యయశోవిశాలుఁ డీ

తఁ'డనుచుఁ జూప నంతికపథంబున నాసనమిచ్చి "మేలిబా
పఁడ! భవదీయశిష్యుఁడు వివాదముపూనెడు సమ్మతించితే?" 308

క॥ అని భూపాలుఁడు తన నడి
గిన 'నవధా'రనుచు మావు "గెలుపోటమి వా
దనమునకు మున్నె యెఱుఁగ
న్గనునే ఫలితమునఁగాక సౌజన్యనిధీ!॥ 309

ఉ॥ తాము వినోదమంచు దయఁదాల్చి యనుజ్ఞనొసంగఁ బూని యు
ద్దాములు తీవ్రవాదములఁ దద్ద స్వశక్తులఁ గొల్పి యింతలో
నేమరగింత్రు నీసభికహృత్ప్వనజంబుల మధ్యవర్తియై
యేమహితుండు నిల్చునొకొ యేర్పటిపింపుఁడు రాజసత్తమా!"॥

క॥ అనిన మహీపతి యన్నియు
ననువుపఱుప వాదకునకు నభిముఖముగ నా
సనమున నాసీనుఁడనై
మును గురుదేవాభివాదములు ముగియంగన్॥ 311

క॥ "విద్యాఘనపదమునకొ
నుద్యోగమునందె యెదురునూనెదఁగా కో
సద్యశ! యితరంబుల న
స్మద్యజనార్హుఁడవు కొనుము సన్నతినార్యా!॥" 312

మ॥ అన యోగ్యుండగునామహాత్ముఁడును నాకాశీస్సులన్బల్కి, వా
దనము న్బూనఁగ సప్తరాత్రముగ నత్యంతంబుఁ దీవ్రంబుగాఁ
దనరె న్దర్కము సర్వశాస్త్రముల నంత న్మధ్యవర్తిత్వమూ
నినవార్వాది చలించుటల్కని కడు న్నిష్పాక్షికాంతస్కుడై॥ 313

క॥ వాదిదెస న్బరికింపఁగ
నాదివ్యుం డోటమిని మహాశాంతుండై
'భూదయిత పిట్టకొంచెమె,
వాదముఘనమయ్యెఁ బ్రీతిపడె నామనముఁ'॥ 314

క॥ ఒసఁగుఁడు సర్వజ్ఞత్వం
బసదెఱుఁగని యితని' కనుచు నాపీఠముపీ

డి సనన్లేవఁగఁ దత్పా
దసమీపంబునను నేను దండం బిడుచున్॥ 315

"తొలుత నెల్పితిఁగాదె మాదృశుల కెందు న్వందనీయు ల్మహా
త్ములు మీరంచును వత్సలత్వమునఁ బెంపుంజూపి నాకోర్కి మీ
రలె సర్వజ్ఞపదంబునన్నిలిచి యీరాజన్యుని న్మమ్ము స
భ్యుల సంతోషతరంగితాత్ములుగ సల్పుం"డంచుఁ బ్రార్థించినన్॥

రాజును మెచ్చి యిర్వురము రంజిలఁ గానుకలిచ్చి పంపె న
య్యా! జటివర్య! చిన్నతన మప్పుడు, విద్యలఁదేటిక్రొత్తయా
టాజయవాంఛ, యాకుతుక, మాగడుసుంగొని కాలుఁద్రవ్వట
ల్గాఁజనె నాఁటిఘుస్రములు, గర్వము సర్వమునున్ క్షమింపుఁడీ!"॥

క॥ నాఁగన్, "క్షమియింపఁగ నిం
దేగట్టివచేతకలిగె నేయీాడున కా
రాగవియోగవిరాగవి
భాగద్యోతనము ప్రకృతిబాటయెకాదే!"॥ 318

క॥ అని కృతకముని వచించిన
విని జననీజనకు లెచటవెలయుదురో క
న్గొనఁగోరి "యోగివర! మీ
రనయము దేశములఁ దిరుగునట్టిర కారే?॥ 319

క॥ నాతలిదండ్రులు యాత్రకు
నై తరలినదాది వార్తయందదు వారి
న్వేతావునఁ జెలఁగుదురొ
కో! తెలుపన్గగిన నంతేయుం దెలుపుదురే?" 320

క॥ అని భారవియడిగిన "నేఁ
గనియెఱుఁగన్వారి, నైనఁగానిమ్ము తన
ర్చినదివ్యదృష్టి నిఖిలం
బునుజూచి వచింతు" నంచు మునివరుఁడంతన్॥ 321

న్నులు మూసికొంచుఁ జుబుకంబు నొసల్మకుఁదాఁకునట్లుగాఁ
న్నిన జుత్తిలి న్నిడుపుశ్వాసముతో నొకకొంతనిల్చి, క

న్గొన్న సమస్తముం బలుకఁగూడను కొంతవచింతు వారు బం
దిన్నలువొందువా ర్మగధదేశమహానృపుదివ్యశాలలన్॥ 322

ఉ॥ వారలయాస్తి సుంతయు నృపాలునిచే హరియింపఁగాఁబడెఁ;
న్నారుఁడు మించిన త్తమునఁ జుర్కుఘటింపఁగసాగె నేబయ
ల్దేఱఁగఁబోలు మీఁదిమజిలి న్భసయేర్పడెఁ బోయివచ్చెదన్
ధీరుఁడవీవు పొందుము పదింబదిగా శుభసౌఖ్యసంతతుల్"॥ 323

—♦ భారవి తాకట్టునిమిత్తము శ్లోకమును భార్య కిచ్చుట. ♦—

క॥ అని మాయాసన్యాసి చ
నిన భారవి చింతపడుచు నిలుచునెడకుఁ జే
రెను లక్ష్మి యిరువురును మం
చెనుజేరి సమర్థాకృతులు చెల్లినవెనుకన్॥ 324

మ॥ తలిదండ్రుల్ చెలిఁగొందనేలనెడి చింత న్దాఁబరధ్యానుఁడై
కలఁత న్లోఁబడు భర్తమోముఁగని శంకంగొన్నచిత్తంబుకో
పులఁ దా నష్టముగందలంచినది త్రోపుంజెంద దాపొంది యా
జలజాతేక్షణ కంటనీరొలయ స్వస్వామి న్విలోకించుచున్॥ 325

ఉ॥ "ఎంతటికష్టమేని సహియించి భరించుచు నవ్వ మోముపై
గంతులవార్చు మీ రిపుడు కప్పున నాస్యముమోడ్చి యీగతి
న్జింతిలనేల? కాళులును సేతులునొచ్చెనె? కాఁకదాఁకెనే?
మంతనమేమి? తెల్పరె? ప్రమాదము లెయ్యెడనేని సోఁకెనే?॥ 326

ఉ॥ సేమమె యత్తమామలకు? చేరిరెయింటికి? సర్వబాంధవ
స్తోమ మనాకులంబె? దొన దొడ్డి పసు ల్పయి రెల్లభద్రమే?
మీముఖచంద్రుఁ డేమిటి కమేయసుధారుచి నింప కార్తిమే
ఘామసమావృతి న్గనియె నయ్యది సుంత యెఱుంగఁబల్కరే?॥"

క॥ అన రానినవ్వ పెదవికొ
నను సుంతకదల్ప నతఁడు "నాతీ! సర్వం
బును దైవకృపనెగడు నై
నను నీనోములకు సాధనం బెటులౌనో?॥

క॥ దానికిగా యోజించెద
మానందగునె గరితలకును మంగళకరము
ల్కాని మిగ్లాశ్లోకము కును
వైనందిడుచు పెద్దబేరి నడుగుము ధనముక్." 329

క॥ అనితాంటియూకుముక్క
'స్గాను'మని భారవియొసంగ గుబ్బతిలుముదం
బున విప్పనొందుముఖమున
దానుకు విచారమున మగనితో నిట్లనియెన్॥ 330

ఉ॥ "ఇంటికొ మేనమామకొ మఱెవ్వొడకో యొకచీటివ్రాయఁగా
వెంటనె సొమ్ము రాదె? పృథివీపతుల న్దరిశింపఁ గూడదే?
పంటయొ? చేనొకో? నగలొ? పండితవేద్యము దీనినాణె మా
తంటలమారికోమటి కెద న్దగులన్గలదొక్కొ చూడుఁడీ! ॥ 331

క॥ సంచారమరిగి యన్నలు
సంచులతోవచ్చుచుంద్రు, సకలవిధములం
దెంచఁదగుసూరు లిరలు
సంచారముసేయ భాగ్యశాలులుగారే? " ॥ 332

క॥ అన "ముగుదా! వినుమిా! యా
చన పైపైనున్నదే ? భృశంపుటనుభవం
బునఁగాని సాధ్యపడ దా
పనికి న్మర్యాదవిడిచి పాల్పడుదమనన్॥ 333

సీ॥ ఆవుచేపుటకుగా నాఁదూడ దూఁటున
ట్లొకచోట హాఠయుక్తి నూనవలయు,
వృష్టికై యభిషేకవిధి శివు న్గొల్చున
ట్లొక్కట నుపహార మొసఁగవలయు,
చలిధారగిలిగింత శశికాంతము ద్రవించు
నట్లొంట సరసోక్తులాడవలయు,
క్షీరంబున న్వెన్నఁ జిల్కి కైకొనుభంగి
నొరయుపాండిత్య మొుడ్డొకట వలయు,

తే॥ నెవ్వ రెట్లీసడించిన, నేమియనిన,
నుడికి పొంగని పెనుశాంతి యుండవలయుఁ,
గాని-చో యాచకున కేమగడయుఁగలదె?,
దానవాహిని నుపనదు ల్దరియఁగలవె?॥

చ॥ అది యెటులున్న, నే నెచటికైనను బోవఁగరామి, నేఁటి కి
య్యదియె సమర్హ్వాకృత్యము, బెహారి ధనంబును దప్పకిచ్చు, ని
య్యదనున కెంతకావలయు నంతకు మించి కొనంగఁబోకు, మీ
క్షమన యిదేల? యిత్తు నెదికోరిన' నన్న గ్రహింపఁబోకుమీ"॥

—♦ శ్లోకము ధనపాలుకడ తాకట్టగుట. ♦—

క॥ అనిచెప్పి పనుప లక్ష్మియుఁ
జని 'నాలుగువారములకు సరిపడుధన ని'
మ్మని శ్లోకముఁ గుదువగ ని
చ్చిన వైశ్యోత్తముఁడు చింతఁ జిడిముడిపడుచున్॥ 336

ఉ॥ "దుర్విధి యేమిచేయదు?, చతుర్జలరాశిపరీతభూపులే
పూర్వ మనేకకష్టములఁ బొందిరి యీతనిపాటు వింతయే?,
సర్వముఁ గ్రమ్మఱ న్విధియె చక్కనఁ జేసెడిఁగాత, బాస నా
కౌర్వముగాఁగ నడ్డపడి యట్టిటునా వెరవీయ దెట్టులేన్॥ 337

ఉ॥ ఏక్షితినాథుఁడేని నెదురేగి నతి న్గొని తెచ్చి ప్రీతిమై
నక్షరలక్ష లీయఁదగునట్టిది యద్దిర! శ్లోకమిద్ది, భ
వ్యక్షయ మెన్న కేకొలఁదిబత్తెము యెట్టులొసంగువాఁడ?, నా
దక్షునియాజ్ఞ నేమిగతి దాఁటెడివాఁడనో?, యేదికృత్యమో?॥ 338

క॥ మనమున గునగునఁ బెనఁగొని
నినుపెనసినవనటుఁ గను వణిజు వెనుబాటు
న్వనిత కని 'ధనము నొసఁగఁడొ'
యని యనుకొని చిన్నఁబోవు నంతటిలోనన్॥ 339

ఉ॥ చందుగుపెట్టెయందుఁ గలసంచుల నొక్కటిఁ దీసి, "తల్లిరో!
యింద"మటంచు ముందునిచె హెచ్చినభక్తిఁ గిరాటుఁ, "డార! నా

కెందుల కింతసొమ్ము?, వల, దిం దొకనాల్గువరాలుమాత్ర మీ
యందగు" నంచుఁ గైకొని గృహంబున కేగెను లక్ష్మి నెమ్మితోన్।
క॥ ఆమగని కీసతికెతగు,
నీమాదిరితుష్టి తమకమెనయమి కలదే
సామాన్యులకడ?, ధనమెం
దేమెయి నబ్బినను గొనుటయేయగుఁగాదే?"॥ 341
తే॥ అనుచు, నాసార్థవాహుఁ డత్యంతముదము
నొంది, శ్లోకంబునీతికి నొప్పఁగొంచి,
యెన్నియోమార్లు చదివి, పొందెన్ని, రొండి
నున్న పీడెంపుబరణిలో నునిచికొనియె. 342
క॥ అక్కలతో వదినెలతో
నెక్కువవేడుకల నోము లెల్ల ముగియఁగా,
నెక్కడివా రక్కడికే
గ్రక్కునఁజనఁ, గాల మొక్కగతి జరుగంగన్. 343
చ॥ పరగడచేనిలోఁ బవలు బంతుల నూరిచి తూరుపెత్తఁగాఁ
గొరవడ, గింజగాదములకూడిక, ధాన్యముఁ, గళ్లమందుఁ బ
ల్తెఱఁగులనుండఁ, గొన్ని నిశిఁ దెక్కలికాండ్రు హరించి, భారవి
న్బిఱుసుగఁ గాల్కయి న్గలిపి బిగ్గబిగించి, యథేచ్ఛనేగినన్. 344
క॥ మఱునాఁడు వేగ మామయు
మఱఁదులు బావలును గైలు మళ్లింపఁగ నం
దరుదెంచి చొప్పగుడిసెకుఁ
దరిగాఁ బగ్గములకట్టు దసలనివానిన్. 345
॥ భారవిఁగాంచి, కట్టులెడఁబాపి, యదీను నొనర్చుచు, న్నమా
చారము నాలకించి, కడుజాలి నలందురి, వాని నింటికి
న్జేరఁగఁ బంపె మామ; యటఁజెల్లిన సర్వమెఱింగి యత్త కో
పారభటి న్గిఛీయను లయ త్వేలయింపఁగ సాగెఁబెల్లుగన్. 346
తే॥ అదియదృష్టమొ దురదృష్టమగునొ, లక్ష్మి
వాకిటన్జేరెఁ గ్రిందటివాసరమునఁ,

గాన భారవి కర్తయే బోనమిడుట
సంభవించెను నాంటిప్రారంభవేళ. 347

చ॥ గలగలలాడుచు, న్గసరి కాలుల్రేఁలుచు, 'ఛీ'లఁగొట్టుచు,
న్గలవియు లేని వెప్పటివౌకైకొని దెప్పుచు, గొణ్గుచు, న్వాశ్రం
ఖలమగు నాశువు న్గాలిపి, కర్తరగగ్గురు దిమ్మటల్రవ
ర్తిలఁగ నొనర్చె శ్వశ్రువు, విదీర్ణమనంబున లక్ష్మి పొక్కఁగన్. 348

శా॥ "అమ్మా! దొంగలు దోఁచుకొంచుఁజన నన్యాయంబుగా నేల తి
ట్లిమ్మెఁ దిట్టెద?, విందు మాయునికి నీకిష్టంబుగాకున్నఁ బో
పొమ్మంచుం దెలుపంగరాదె విదిలింపుల్దుంపలు నోర్మెళ్లతోఁ
గ్రమ్మ న్నాదము వంటఁబట్టునె? తినంగాఁ దోఁచునే యేరికిన్?"

మ॥ అనఁగా మంట ఘృతంబురీతియయి కోపావేశముంబెంప "నే
మనెదే? దొంగల! నాఁడునాఁ డెపుడులే రయ్యారె నేఁ డ్వేనికై
మనకై వచ్చిరె? నోముసేఁతబుణ మీమార్గంబున న్దీర్పఁ బ
న్నిన పన్నాగముగాని, పోఁదలఁప నేనే యుండుమంచంటినే?

ఉ॥ పాపము! నైఁపదే మెతుకు?, వచ్చికనుంగొను పోతరాజు నా
నేపగిది న్గ్రసించెడినొ "యింతకునింతగ!" నంచు నంబలి
న్గోపన త్రిమ్మరించె వడిఁ గూఁడునుగట్టయుఁ జుట్టుఁబొలు "న
త్తా! పరమాప్త విప్పటికి నైతిఁబునీతుఁడఁ బోయివచ్చెదన్.

చ॥ కొనుమిదె నూరువేలు సమకూర్తు నమస్సులు, కాశి నేగురుం
డును దయసేయలేనిది కడుంగడుముఖ్యము యోగ్యమైన దీ
యనుభవ మబ్బె నీదరి నిఁకవ్వల సంసృతి నెట్టిచిక్కునై
నను నెదిరించి తీర్చెద, బుణం బెటుతీర్చెదనమ్మ నీకడన్?"

మ॥ అని సంతోషముపొంగు లాస్యమున నాట్యంబాడఁగాఁ జేతిము
తిని గాళ్ల న్బుచిఁజేసి శ్వశ్రువున కెంతేభక్తి సాష్టాంగవం
దనముంగూరిచి మామ కెల్లరకుఁ దత్తద్యోగ్యమర్యాదల
న్వినుప న్దెల్పి ప్రయాణమయ్యె సతి నందే నిల్వ శాసించుచున్.

ఉ॥ "ఇచ్చట నింక నొక్కక్షణమేనియు నిల్వనెదెట్లుపోయిన
న్వచ్చెద మిమ్ముఁగూడి, పతిపాదసమర్చన మెట్టిసాధ్వికిన్

నచ్చిన జీవనౌషధము నన్నిటనిల్పుట దావవహ్నిపా
ల్పుచ్చుటసుండు నన్దఱుముఁబోకుఁ డెఱింగియుఁ దద్ఘనార్తికిన్"354

ఉ॥ కాంత యిటుల్వచించుచు వగన్గొన భారవిపల్కె "చేలవై
యెంతటిమాటలంటివె సఖీ! మనపెద్దల దిద్దుబాల్గె ధీ
మంతులఁజేసి చేయుఁజుమి మాన్యులఁగా మనల, న్గ్రహింపుమీ!
చింతఁ ద్యజించి తల్లికడఁ జెందుము సమ్మతి నేగుదేఱఁగన్॥ 355

మ॥ అనుసంభాషణమంతయు న్వినుచుఁ బెల్లుబ్బంపుటాందోళ మూఁ
ప నెద న్బుట్టుదిగు ల్కలంప నెటులేన్ బాల్పోక స్తంభమ్మురీ
తిని నిల్చుండిన తల్లిఁ గాంచి, 'జననీ! దీవించి మాకేగ నా
జ్ఞ నొసంగంగదె మీకుమాకు సుఖము ల్సంధిల్లు నత్యంతముగ్

మ॥ అని యాకూఁతు వచింపఁదల్లి యను "నోయమ్మా! దినంబట్టు లం
టిని ప్రాప్తించిననష్ట మాత్మఁగలఁప న్మిర్నేఁ డిటు ల్పాత్రవ
ర్తనముంబూని తెగింతురం చెఱుఁగ, నీతండ్రి న్నిరీక్షించి, యా
యనయాన న్బొనరింపుఁ డేనెవతె నిం దాఁగాదున మానినీ!" 357

మ॥ అనుచుండ న్గృహి యేగుదెంచి సకలంబాలించి 'జామాతృదు
ర్దినము ల్మాసెను నేఁటితో'! ననుచుఁ దృప్తిం జెంది, 'యార్తి న్నిశ
న్దనువెల్లం బొగులం గనుంగొనక వంతంగొల్పితే?" యంచు భా
ర్యను గోపించి, "బహిష్ఠ నేఁడెచననేలా' యంచు వారించుచున్॥

తే॥ కూఁతునకు పునీతయగువెన్క నాతఁ డనిచె
నిరువుర న్సారెఁ దగురీతి నిచ్చి, వారుఁ
గతిపయప్రయాణములపైఁ గాశిఁజేరి
రచట భారవి మాతులుం డబ్బురపడ॥ 359

—♦ భారవి తల్లిదండ్రులకోటకు పయనమగుట ♦—

క॥ 'ఓరీ! యల్లుఁడ' యని 'చి
ట్టీ!'రమ్మని ప్రేమ మెయి నటింపంగ నమ
స్కారములకు దీవన లిడి
గారవమున గృహియు గృహిణి కౌఁగిలిఁగొనుచున్॥ 360

క॥ "మీయయ్యయు నమ్మయుఁ దమ
కేయెడల న్దోఁపరనుచు నీనడుమ భవ
జ్జాయాజనకుఁడు, నీసఖుఁ
డీయూరెడ నెమకి రింటి కేతెంచిరె?' నాన్॥ 331

ఉ॥ వచ్చెనుమామ, మద్గురులవార్త నొకింతయుఁదేఁడు, వింటినే
కచ్చనొ మాగధేశుఁ డరికట్టెను వారలనం, చనుజ్ఞ మీ
రిచ్చిన నేఁడెసాఁగి యటకేగెద " నంచువచింప నల్లుతో
'వచ్చెద నేనుగూడ నరపాలుఁడు సౌమ్యుఁడు చింతఁదక్కుమీ!"

క॥ అని మేనమామ నుడివిన
విని భారవి పలికె మీరుపెద్దలు మార్గం
బున నెడ తెగక కలుగు కను
కనులకుఁ దాళుకొన లేరు గడెసేపయినన్. 362

క॥ పోయెద నాసఖుడగు నా
రాయణభట్టరును గూడిరా, నే కతము
న్నాయలు కాంచి పితరుల
న్దాయనిడెనో యెఱిఁగి కూర్తుఁ దగునేకతమున్॥ 364

క॥ అనుచుఁ గవి మంచిమూర్తం
బున వెడలి వనాళి శిలల మూర్తంబును, ముం
డ్లనుగండ్ల మిగులఁబూర్తం
బునగునడవ నలఁత మేనఁ బూర్తంబుఁగనన్॥ 335

క॥ ఒకకొండబొఱియచఱియ
న్దెక తెకదొగురులను బుగులు తేలిసెలయేట
న్నొకముగ డిగి మొకముఁ గడిగి
తుకతుకపడిసెడఁగఁ ద్రావి త్రోవరి దరిగన్॥ 366

క॥ అరవిరుల న్గిరిదరులం
దురుతరుల న్దొరలుసిరుల నొగిమెరమెఱఁదె
మ్మెరపురుల న్సరిసరుల
న్బరిసరముల నొరయురుచులఁ బరిమళములలోన్॥ 367

క॥ కుతుకానఁ గుతుకానఁ
గుతిమాన ద్నాఁకి దూఁకి గునికి గునిసి తేం
ట్లతిహాళిఁ లతికాళిఁ
ధృతిఁ బాళి ద్నెనెనాను దివసములలోఁ॥ 368

మ॥ సెలయేట న్వలినీటిజిల్గువలుల జ్నేయూఃతమై వాత మా
కులపా టాకులపాటుఁ గల్గనినడ గ్నూర్పంగఁ దేర్పంగఁ ద
మ్ములచాట న్వెలిచోటఁ గద్దదికల నో్మరెత్తి మారొత్తు హం
సల నీటుంబులుపాటలందలి విలాసశ్రీలసత్కేళికిన్॥ 369

ఉ॥ హారిగిరిద్దరీఝరి నహార్యనిలీనగురుప్రపాతతీ -
వ్రారభటీసముద్ధతనిజాంబువు పింజరితాచ్ఛవర్ణడిం
డీరకణాళిఁ జిమ్మఁగ వడి న్జిరుచేపలటంచు మూఁగువీ
డ్వారముత్రోడఁ దేంట్లు నిగుడ న్విరికొప్పిడినట్లు తోఁపఁగన్॥ 370

క॥ కెలకుల నొత్తుగఁ దరుశా
ఖలచివరలు నీటి నంటఁగా వ్రాలుచుఁ బై
శిలనుండిచూడఁ దటినీ
లలనాసీమంతసీమలాగున వెలయన్॥ 371

చ॥ విరిపొడిఁ గొల్లలాడి, ఖగబృంగరుతు ల్గిలుబాడి, వాహినీ
వరహిమసారశీకరలవంబులఁ జుబ్బనచూఱలాడి, ప
య్యెర నెఱనీటుగోటునడ నాడుచుఁ దావులఁజిమ్మ రాగము
ల్పఱపఁగ జల్లుఁజల్ల మర వైఖరిఁ గూర్చెడి యాత్మశాంతికిఁ॥ 372

మ॥ తనయుద్యోగమెకాక, కొంతవడి, కాతం డంతయు న్విస్మృతి
న్మనుఁగ, న్దాఁగుని కె, న్విశాలశిలపైభూజంబునీడ, న్నదీ
ధ్వని 'జో-జో' యనుపాటయై యతనిచిత్తం బూఁపి జోకొట్ట, న
య్యునికి న్నిద్రమునుంగకుండుట కెవండోపు న్ధరామండలిన్॥ 373

మ॥ ప్రకృతి కడున్విలాసవతి, భారవి నట్టులునిద్రవుచ్చి మే
ల్మకము నొసంగుచు న్దిరిగిచూచినచూపునఁ జూపుమేర నిం
కొకఁ డగుపింప నంగరుచియు న్దరహాసము నూర్పునూర్పుతో
సకలమునింపి యాతటినిచాయకు నాతని లాగె మెల్లఁగన్॥ 374

మ॥ తరువృతంబులవీవన స్ఫుసుమసంతానంబుగంధంబుల
న్సరిదద్రిద్రుమసత్పథాభల విహంగశ్రేష్ఠగానంబుల
న్నరుచు ల్కొల్వుఫలోదకంబుల శ్రమలున్నిక్కంగ నేర్దాటి యి
ద్దరికిన్జేరి యతండు తా మఱలపుంజన్బొవ నుంకించుచోన్॥ 375

మ॥ కనియె న్మందట రాతితిన్నెపయి వృక్షచ్ఛాయఁ గేల్దిండుగాఁ
గొని మైవిస్మృతి నిద్రవోవునరు, "నాకుం ద్రోవఁ దోడైను వీఁ
డును నానైపున వచ్చెనే" ననుచు గండుద్రాతఁ గూర్చుండి, యు
న్ననన నీనిద్రితుఁ డేల లేవఁ డనుకొంచు న్మోము నీక్షింపఁగన్॥ 376

—♦ భారవి నారాయణుల సమాగమము ♦—

మ॥ చకితుండై "యెవరింగనుంగొనెద? మజ్జా! భారవీ!" యంచుఁజె
తకు దూఁకుంగొని తట్టిలేప, నతఁ డుత్సారంబున న్దిల్లి నీ
ల్గి కనుల్విప్పి, భయంపుఁజూపులొలయ, న్గిగ్గాడి తెల్వి న్గ్రహిం
పక, యొక్కింతకుఁదేఱి, జ్ఞప్తినిగుడ, న్సాన్వస్థ్యంబు సంధిల్లఁగన్॥

క॥ "నారాయణుఁడా!" యని పొం
గార న్బిగికౌఁగిలి న్మహానందంబుం
జూఱఁగొని "నెమకుతీవియ
తారె న్బాదములఁ గడుముదంబయ్యె సఖా!

ఉ॥ ఈనడుమ న్యతీంద్రుఁడొకఁడేఁడో కనంబడి, 'యాస్తినెల్ల భూ
జాని హరించె, యాత్రకయి చన్న, భవజ్జనకుండు మాతయు
న్బోనున నున్నసింగములపోలికగా మగధ న్జైల న్గడు
స్దీనత నున్నవార"నుచుఁ దెల్పెచనె న్నిజ మీవెఱుంగుదే?"

క॥ అన దొనకఁదొడరు చిఱునగ
వున వగ చోఱఁ బెదవులదరఁ బొరి రదనరుచు
ల్మినమినమన నారాయణుఁ
డనె "జటియుం దబ్బరాడునా? నిజమె సుమీ!"

చ॥ బడికొనసాఁగ నీగృహము బంట్లఁ బొలంబుల నాదునేర్పువెం
బడిఁ గనుఁగొంచునుండ నొకవాసరమం దెడలేని గొప్పచ

ష్పుడు లొగి నుప్పతిల్లి యురువుంగొని యార్ద్రతయంగ, దండొ దొ
పిడిపెనుగుంపొ! యంచుఁ బ్రజ భీతిలి యాతురులై చలింపఁగన్॥

ఉ॥ "ఈగతిఁ జుట్టిముట్టి యెడమీయక యూపిరిసల్పనీనియు
ద్యోగములొప్పఁ బైఁబడుచు రొ ప్రజలార!" యటంచుఁ జాటున
న్లాగున గాలివాలున బలంపుటలల్కొని ముందె యూరిపై
మూఁగె దళంపుధూళి పెనుమ్రోఁతలు నూతములై ధ్వనింపఁగన్॥

చ॥ అని వచియించుచుండు నెడ, నాపెనుచట్టున కవ్వల న్నమం
తనఁజనుయోధులిర్వురకుఁ దద్ధ్వని వీనులసోఁకి కౌతుకం
బును బెనుపంగ, గండుశిలముట్టెకుఁజాటున గాలితిన్నెలన్
దనువులవాల్చి వీనుపిఱుఁద న్గరసంపుటినుంచి విన్కొనన్॥ 383

శా॥ ఆనారాయణుఁ డిట్లుపల్కె, "సఖుఁడా! హ స్త్యంబుధు, ల్వల్గదా
జానేయాబ్ధులు, తేర్లసంద్రములు భాస్వజ్జ్యాచమూవార్నిధు
ల్గా నానాబలము ల్తనున్గొలువ నుగ్రస్వైరసంచారియై
యానాఁ డక్కడఁజేరె హూన్నకులవిఖ్యాతుండు దుర్జాతుఁడై॥ 384

చ॥ అహహ! జనంబుల న్జనకుఁడై దయ దీనులకాశ్రయుండునై
బహుకవిమాన్యుఁడై నుతికిఁబట్టగు మాళవవీరధర్మభూ
వహు నొకత్రొరమానుఁడనువాఁడు పరాజితుఁజేసె వింటివే?
మిహిరకులుండు తత్సుతుఁడు మిత్తిపరాకృతిసుమ్ము!" నావుడున్॥

ఉ॥ "ఓడెనె? వీరధర్ముఁ? డొహహొహొ! దురదృష్టము! నాదుపాండితి
న్నాఁ డతఁ డెంతయొ తనిసి నన్దనిపె, న్గుణశాలి, యేడను
న్నాఁడొకొ నేఁడు! దొంగలుకొన న్విడె వానియశోధనుండు నా
జాడయు లేదె? దుర్గతివశంబయి యుజ్జయినీ! కృశించితే!"॥ 386

—♦ భారవికి మాళవయువరాజ పరిచయము ♦—

మ॥ అనుచు న్భారవి యంగలార్ప శిలచాటైయున్న యోధద్వయం
బున నబ్రాం బెగయ న్యువానుఁడగు రాణ్ముఖ్యుండు పెన్దాఁటుల
న్గొనుచు న్వైబశిలఁజుట్టిరాఁగ నచట న్గూర్చున్నవా ర్గొబ్బుగొ
బ్బున నిల్చుండిరి బిట్టుగాఁజకితులై పొంగారుదేహంబులన్॥ 387

తే॥ ఇంతలోఁ బెద్దయోధుండు నేగుదెంచి
"భయము నొందకుఁడయ్య విప్రవరులార!
ఏయశోధనుగుఱించి మీ రిపుడు ముచ్చ
టించితిరొ, వారువీరెసుఁడీ! కనుండు"॥ 388

శా॥ నాఁగ న్విప్రయుగంబు వింత ముదము న్వాసించు నాస్యంబుల
"న్బా గయ్యారె! పురాకృతంబుఫలియింప న్వీరిఁగన్గొంటి' మ
న్వాగుజ్జృంభణమొప్ప ఫుల్లనయనవ్యాపారము ల్సేసలై
తూఁగ న్దీవసలిచ్చి మైమెఱుఁగు సంతోసంబు నిండారఁగన్॥ 389

చ॥ నలువురుఁ గూరుచుండిన యనంతరమందు యశోధనుండు కం
పళితకుతూహలంబు నయనంబుల వాక్కుల సందడింప "నో
యలఘుమనీష! మాళవధరాధిపసూనునిఁ గొంచుఁబోయె దొం
గలగుమి యంటి రాగొడవఁ గంటిరొ వింటిరొ తెల్పుఁడంతయున్।

క॥ కలఁక న్గలగా నొకకథ
మెలఁగు న్మది నప్పుడపుడు మీవృత్తము నం
దులకు సరిపడినయెడల
న్దొలఁగు న్సంశయ," మనంగఁ దొడి భారవియున్॥ 390

మ॥ పలికెన్ "రాణ్మణి! దేనికో యెఱుఁగుదీప్రశ్నంబు, సందేహమెం
దులకెవ్వారికి?, మూడుమూర్తులను దద్భామీశునింబోలు దీ
వ్వు, లలాటంబునఁ జెక్కుల, న్జెవులఁ, జూపున్జేవ, నైన న్గుతూ
హలమున్దీర్చెద నాలకింపుము శ్రుతంబౌపూర్వచారిత్రమున్॥ 391

ఉ॥ మాళవదేశరాజబహుమానిత ముజ్జయినీపురంబు త
త్పాలకదివ్యసౌధములపజ్జల నందనము న్హసించుచు
న్కేళివనం బొకండెసఁగు కృత్స్నసుమప్రదవల్లరీతరు
శ్రీల హిమాంబుపూర్ణసరసీతటసత్ఫలవృక్షపంక్తులన్॥

ఉ॥ అందొకనాఁడు రాణి భవదంబ సుమాపచయార్థమేగి యా
దండడిసందడిం దగిలి తామఱచె న్నిను, దాది నిద్దురం
జెందిననిన్నుఁ బుష్పములసెజ్జఁ బరుండగఁజేసి కూర్కె నా
సందున నీవు మేల్కొనుచుఁ జల్లఁగఁ జారితి వెట్లొ పిమ్మటన్।

ఉ॥ దాసియు నిద్రలేచి నిను దాపునఁ గానక గుండె 'జ'ల్లనం
గా "సిసువెందుఁబోయె"నని క్రంతలఁ బల్మఱుఁ జూచిచూచి యెం
దేసవఁగాంచలేక కనియె న్నుది నడ్డులజాడనొండు నొం
డేసావలేమి లేమ చరియింపఁ దొడంగెను దానిపోబడిన్॥ 395

మ॥ అదియును దోఁటకోరడికి నవ్వలసైతము రాజిలంగ నా
సుదతి యటూరయు, న్దిరిగిచూచుచు జివ్వనఁ బొఱుచున్న వా
నిఁ దఱుము నొక్కయోధవరుని, స్తనబ ర్వటడించి దొంగ బి
ట్టదిరిచి కూల్చి బాలు గ్రహియించి లగెత్తుటఁగాంచి కెవ్వనన్॥

మ॥ అఱచెన్దాసి భయాకులధ్వనుల "వారా!వీర! రారండు స
త్వర మయ్యో! నృపసూనుఁ గైకొనుచుఁబర్వన్నాఁగ వీఁడెవ్వఁడో
యరయుం"డంచుఁ దదార్తనాదము పరివ్యాప్తంబుగా నాడకా
తురత న్వచ్చిరి రాణియు న్సఖులుఁ దోడ్తోబంటు లిర్వంకలన్ ॥

శా॥ ఆలోనన్ శిశుహర్త బాలకుని యంసాగ్రంబున న్గట్టి పె
న్వాలు న్నోట లగించి దాఁటె నెగుపా ప్రాకార మేత్రాడ్ప్రా
పైలాగన్ ద్రుటిలోన, నవ్వల వను ల్పట్నంబులు న్గట్టులు
న్గాలింప స్తనరావు వార్తయును జిక్కనాదు పెక్కండ్లుగన్॥ 398

చ॥ తడవులనుండి మంత్రియయి తద్దయునిద్దపురాజభక్తిఁ బే
ర్వడినయమాత్యశేఖరుఁ డవాప్తనృపాగ్రహుఁడై పదంబునో
విడచినవాఁడు నాఁటిసుత వీటఁగనంబడకుంట హర్తయా
తఁడె' యని క్రొత్తపెగ్గడ తదాప్తులనందఱ నుంచెబందిలోన్॥" 399

వ॥ అని ముగించినంత నారాయణభట్టారకుఁ డందుకొని యయ్యో!400

మ॥ నిజమో! దబ్బరయో! వదంతియొకఁ డున్నిద్రంబుగాఁజొచ్చె శా
స్త్రిజనంబం దలనూత్నమంత్రియె దురాశన్బాని మీఁతఁద్రిన
మ్మఁ జలంబాఁచిచరించి పూర్వసచివు న్మార్పించి మీవంశమె
ల్లఁజన న్దాఁబతిగాఁగ సల్పెనట వాలాయంబుగాఁ గుట్రలన్॥ 401

చ॥ పలికితిఁ దోరమ్మానుఁడు భవజ్జనకు న్గలన న్జయించె నం
చలఘుచరిత్ర! కాదదిజయంబు నిజంబు గడింప మంత్రికు

త్రులుఫలియింప సాగిసభరంబగు దోపిడిగాని, యాత్మసే
నలె కికురింపఁ బోరనగునా పతి తొల్గక యెట్టిధీరుఁడేన్"?॥
మ॥ అన జ్యేష్ఠుండగుయోధుఁ డెట్టవడునాస్యం బగ్గిరాల్కన్ను ల
బ్బైనయన్నాగెడిమేనితోఁ బలికె "ద్రోహీ! నన్నుఁబోఁజూచి
ట్టినికృష్టంబగుసేతఁ జేసితివిరా! డింభా! నృపాలాత్మజు
న్మనుపన్వచ్చితిఁ గానిచో నిలిచిత్రెంపన్లేన నీతంత్రముల్"॥
క॥ అన భారవినారాయణు
లనూనమగునబ్బురమున నతనింగని 'యకా
ర! నిజంబె!! మంత్రులా!!! వం
దనశతములివే కొనుండు దయమీఱంగన్"॥ 4
మ॥ అనుచో నాతఁ "డిదే! వినుండు శపథం! బాదుర్జను న్వానిఁజ
రినహన్ను రణభూమిఁ జక్కడఁచి ధాత్రీనాథుని న్ని్మ్మఱ
న్ననసింహాసనమందుఁ జేర్పనియెడ న్నాపేరు శ్రీభట్టుకా"
దనుమంత్రింగని పల్కె భారవిసఖుం డత్యంతనమ్రాస్యుఁడై॥ 4
చ॥ "సచివవరేణ్య! రాసుతునిసాకఁ దొలంగితి రంటి రాకథా
ప్రచయము నాలకింప మదిఁ బొఱెడుఁగౌతుక, మర్హమైన నో
పి చెవినివేయరే' యనిన ప్రీతమనంబునఁ బల్కె మంత్రి మం
చి చెఱుగు గోప్యమై నృపవిశేషకళన్నగు నైనఁ జెప్పెదన్" ॥ 4(
ఉ॥ నాఁగ యశోధనుండును ఘనంబగువేడ్కయు వింత మోహమున
న్బాగు ఘటింప భక్తి పరవళ్లువడ న్పులకించుమేనితో
"నోగురువర్య! పూర్వకథ నొక్కిసుమంతయు నాకుఁ దెల్ప రా
రా! గణనీయ మోర్పుపస, త్యాగముపెంపును, రాజభక్తియున్॥
చ॥ సిరిని సతి న్సుతు న్సుఖముఁ, జింత యొకింతయు లేకవీడి, త
న్మఱచి శతించురాజుపయిన న్ననకూరిమిఁ జంపుకోక, దు
ర్భరవనసీమల న్బలుకరాని యవస్థలఁ దూలిపోక, బ్లం
ధురమగుప్రేమ నాకయి ఘనుండితఁ డందినపాట్లనేకముల్ ॥40
చ॥ అనునెడ "నావిధి న్నలుపనైతి సమగ్రముగాఁగ, నాయశ
క్తినెకద తేఁడు రాజ్యదశ తీటి వటించెసునెందొ, దుస్సమ

ర్ధను నను మెచ్చుకో ల్తగినదారియె?, యింకవినుండు పల్కుదు
న్మనుపటిగాథ; నంత బ్రభు మున్నమకర్ణనవచ్చు నెల్లెడన్ ॥ 409

చ॥ ప్రియపడి వీరధర్మపృథివీపతి యొక్కదినంబునందు మే
ల్హయములు జాగిలంబులు వల ల్జిగురు ల్మదనాగము ల్బటో
చ్చయములుఁ గొల్వ వేటరభసంబున ఘోరవనాంతరాళి ని
ర్భయమున సంచరించునెడ బంట్లెడయై నృపుఁ డేగుదారిలోన్॥

ఉ॥ ఘోరవరాహము న్దఱుముకొంచు నృపుండు మహాశ్వధారల
స్సారిమెయి న్గ్రమించునెడ బాటకుఁబ్రక్కను దట్టమౌపొద
జ్జేరినక్రుద్ధమౌపులి యుసి న్సైనుదూఁకున వ్రాలె రౌతుపై
వారువ మావడి న్ధరణిపైఁబడి గింజుకొనంగ బిట్టుగన్॥ 411

శా॥ అన్యాయత్తునిపై గబీలుసిగనా, వ్యాఘ్రంబు దూఁకంగ నా
ధ్వన్యుత్కర్ష కదాఁటు దాఁటునకు నశ్వంబుర్విపైసోల రా
జన్యుం డాహరిక్రిందఁగొంతమెయి పైసామేనుగా నుండియున్
దైన్యంబొందక వాలుసిద్ధముగఁ జేతందాల్చి యట్లుండఁగన్ ॥ 412

శా॥ నిప్పుంగన్నులు నిల్చి ముందుసెగలై నిక్కంగ వాలంబు గు
ప్పుప్పంచు న్దలియింప గొంతుముడుఁగ న్గుప్పించి దూఁకంగ నీ
ముప్పేరీతిని దప్పునంచుఁ గనుచూపున్మేరవా ర్డీల్పడ
న్గప్పై వ్యాఘ్రము లక్ష్యమున్దొలఁగి యెందో వ్రాలె శూలాహతిన్॥

క॥ శూలము విసరినరౌ తట
వాలుంగొని దుమికి పొడిచె వైళమ కదలు
ల్చాలించుచు నలబెబ్బులి
సోలి జమునిప్రోలి కరుగఁ జూపఱుమెచ్చన్॥ 414

శా॥ వాఁడేడింభుఁ డదృష్టమట్లమర రాట్ప్రాణావనుండయ్యె, నా
నాఁడే వాఁడుపమంత్రియయ్యెను; గృతజ్ఞత్వంబు బాధింపఁగా
ఱేఁడవ్వానిని నాఁడునాఁటికిఁ గడుప్రేమించి యేలోపముం
జూడండయ్యెడఁ; బ్రేమ గ్రుడ్డిదనుచోఁ జోద్యంబులేదింతయుక్॥

చ॥ అతివినయంబె ధూర్తమనుజాంకము, వాఁడును నేర్పుపొందిక
న్మతిఁగరఁగించుచు న్నృపుని మన్నన కిచ్చెను దోహదంబు స్వ

స్థితిగతులందుఁ బైకి నొకచిన్నెయుఁ గుట్రను దోఁపనీయ క
క్కృతమున నేరికి న్డగుపకల్గను నిక్కముఁదెల్ప తేనికిన్॥

చ॥ పలికిననాపయి న్నెనరువాసె ధరాపతి కందుచేత నేఁ
దొలఁగితి వానిచాటుకథ తూర్ణమెఱుంగఁగ నంత నొక్క వె
న్నెలనిశ నూరిబాహ్యమున నేనిటునట్టుఁ బచేరమూనుచోఁ
గలకల మేగుదెంచె నెడకల్గఁ, దదీక్షణ కేను పొంచుదున్॥

క॥ వీఁడును సేనానియు నా
జాడనె యరుదెంచి రెదిరియొ సంభాషణ మం
దాడుకొనుచుండి రొకకొం
తాడాడ న్జెవికిసోఁక నతిచకితుఁడనై॥

ఉ॥ 'ఆరెయి రాకుమారు నెటులైనను దొంగిలి పిల్కుమార్చిన
న్దారియొకింతయూఁదెలుపి, తప్పకొనర్పు' మటన్నఁ 'జిత్త' మ
న్ధోరణి నాలకించి యెటుతోఁపక చింతిలి వీరినిప్పుడే
పోరి వధింతునా? జయముఁ బొందుదునా? యనుశంక నిల్చుచున్

చ॥ 'తెలిపెద రాణికైన'నని తేఁకువఁ గేళివనంబుఁ జాటుత్రో
వల నపుడప్డె చేరి తెగువ న్వెలిగోడనుదాఁటి సాగ న
ప్పొలమునఁ గంటి దైవకృప పూర్ణముగావిలసిల్ల నాఁడు నీ
లలితుని, గొంటి సుంతయు విలంబనమూనక వాని సందిటన్॥

ఉ॥ వింటిరెకాదె పైకథ నభీతమనంబున నాఁడె దాఁటి తే
నొంటరి వీనితో వనులు నూరులు వాఁగులు కొండ లెందునే
వెంటఁ జరించిన న్వెతకువీరుల కందఁగనీక సాకె నా
దంటలదంట దైవ మలఁతన్ వెలితిన్ ధృతి జారకుండఁగన్॥

చ॥ మిహిరకులుండు మీపురి కమేయబలంబుల వచ్చెనంటి వా
విహరణమేమి తెల్పు" మన విన్చెను భారవిమిత్రుఁడిట్లు "స
న్నహనముమీఱఁ దెంపుఁబయనంబుల సేనలతోడవచ్చి దు
స్సహము లనేకము ల్సలిపె జాలియు న్యాయ్యము మానిమారియై।

ఉ॥ శైవముపేరుఁజెప్పి పరుషంబు మతాంతరులందెగాక యా
శైవులఁగూడఁబూనె; ధనసంగ్రహము న్విషయార్జనంబె త

ద్భావగతంబు శైవమనువార్త నెపం బలదాడిఁగప్పె, నూ
ళ్లో! వనమధ్యసీమలయి లోబడె నాశిలి పీచమేసుటన్॥ 423
శా॥ మాగ్రామంబున వీనిచేవెలసి సంస్థాయంబుగా సాగు శా
స్త్రగ్రైవేయకపాఠశాల యితరస్వాస్థ్యంబులంగూడె, నా
యుగ్రం బేమని తెల్పువాఁడ! ముసలు ల్యోషామణు ల్బిడ్డలు
న్వ్యగ్రాయోధను లొక్కరీతిఁ బడి రత్యాపన్నులై ఘోరముల్"॥
చ॥ అనిన యశోధనుం డనియె నాగ్రహమూఁపఁగ "మాగధావనీ
శుని పెనుధాటి నోటువడి స్రుక్కినహన్నులు సిగ్గువీడి తెం
పునఁ దలెత్తిరే మఱల? భూరిమదీయ పరాక్రమాగ్నిసోఁ
కునఁ దుదముట్టఁ గాలుపక కోపముడించుట పాఁడికాదిఁకన్"॥ 425
క॥ నా నారాయణుఁడిట్లను
'నోనరపతి! మగధరాజు నొప్పువదలి యే
లో? నామిత్రునిగురుల
న్దానుంచె న్బంది వారి తప్పెయ్యదియో?"॥ 426
మ॥ అన శ్రీభ ట్టిటుపల్కె, 'సత్పురుషులారా! భీతిలనొ్బకుఁడీ!
మనమం, దామగధేశ్వరుండు బుధసమ్మాన్యుండు, క్రూరుండుగాఁ
డనువౌకారణముండుఁ దత్కృతికి ధైర్యంబొంది మున్ముందు మా
జననాథు న్గనరం డన న్గదలి రుత్సాహంబుతో నయ్యెడన్॥ 427
క॥ నలువురు నలువురువనసీ
మల మలకల మలయు మలయమధు రానిలుతా
వుల నెలవుల నెలరాచలు
వలఁ గలవగ లగల నెలమివఱల నడువఁగన్॥ 428
మ॥ 'కెరొసీన్' తైలమహార్ణవంబున నినాగ్నిజ్వాల వేష్టింప స
త్వరజోద్ధాపితదావవహ్నిశిఖ లుద్యద్ధూమపూర్వంబు లు
ద్ధురవిక్రాంతి నజాండచంక్రమణ ముద్యోగించె నానొప్పె నా
శరదభ్రాజిదిశాప్రపూరకమహాసాంధ్యారుణోగ్రచ్ఛవుల్॥ 429
తే॥ గీ॥ మంట లణఁగుకొలంది నిమ్మడిగ నెగయు
ధూమమనఁగఁ దమం బెందుఁ ద్రోపువడక

కడఁక నల్గడల న్నిండి పొడిచె మిన్ను
మిన్న కొకకజ్జలాబ్ధి విద్ధన్ను నటుల॥ 430

క॥ ఆపొగ పగలాఁగ మిగులు
చీఁపున దశదిశల విరియ నెగురు మిణుగురుల్
ద్యోపథముఁ గూరి నిలుకడఁ
బ్రాపొంది వెలింగె ననఁగ భాసిలెరిక్కల్॥ 431

తే॥ గీ॥ పైనెగల్త్రాలి క్రీఁజాయ ప్రయ్యిడంగ
ము న్నరణ్యగుహాంతరముల మడంగు
చిమ్మచీఁకటియ నెడిమషీరసంబు
పొంగె నెగురుల మిన్దాఁకఁబోవునటుల॥ 432

తే॥ గీ॥ మింటినీలిమలో సంక్రమింప నెగురు
గురుతమిస్రంబుకొ ల్తలకునువడంకఁ
గొనియెనన రిక్క లాకసమునను మినుకు
"నుద్ధతుల మధ్యమున బీదలుండఁదరమె" ॥ 433

తే గీ॥ ఆకసమునల్లు గెల్చునట్రాక మూల
బలములన్గొని చీఁకటి పైకిఁబోవ
కొంత తెలుపయ్యెనన నంతయింతఁ బుంత
వారిచూపుల కం దలవాటుపపడియె॥ 434

తే॥ గీ॥ ముంచుకొనఁ బ్రాకు నీతమంబునకు నిలువ
మనుచు దివివీడి తారక లవనిఁబడెనొ!
యనఁగ నల్లంతదవ్వునఁ గనఁగఁబడియె
దివ్వె లెన్నియొ మిణుగురు ల్తిరుగునటుల॥ 435

క॥ అరచాటగునాంధ్రవధూ
వరకుచకుట్మలముఁబోలి వనవృక్షప్రా
వరణమునఁ బటకుటీరము
గిరిదిగువారలకుఁ దోఁచెఁ గ్రీఁజాయ నటన్॥ 436

క॥ చీఁకటి మొయిళ్లై దివ్వెలు
ప్రాకుతటిల్లతలుగాఁగ వాన దిగెనొ నా

రేకత్తెఁ గ్రమత సందడి
యాకడ వార్దరియనేగు నాసమయమునన్॥ 437

క॥ "అదె! మాస్కంధావారం!
బొదిగి రేయినిచట వేగ నొయ్యన నృపతి
న్వదకుద" మని సచివుండన
"నదిమే"లని నిలిచి రంద అప్పటి కచటన్॥ 438

ఉ॥ చీఁకటిపొంగులార్ప హిమశీతలవారికణాళిఁ జిమ్ముచు
న్రాఁకొనె వేగుగాలి;" భయదప్రభ వచ్చెడుభానుఁ డేగుమీ!
పోక పెనంగితే న్విడుతుఁ బుత్తడిజాబిలిరేక"నంచుఁ దా
వాకొన డాయురీతి నెలబాలునితోఁ దగె వేగుచుక్కయున్॥ 439

శా॥ "తామిస్రంబన నాసవర్ణపద మద్దాని న్విదారింప వీ
రీమాద్రి న్దగువెత్తెఁ దాళుదునె, నాయేపెల్ల మొల్లంబుగా
నామోపాది హరింతు"నంచు నుదయాశాచ్ఛాదకవ్యాపృతిన్
జీమూతం బట దక్షిణోత్తరవిదిక్ల్శిష్టాగ్రతన్ నిండెడిన్॥ 440

ఉ॥ "తెంపరివై దినేంద్రునిగతి న్వికలీ! యరికట్టెదే? విచా
రింపవె దుష్టమైత్రి స్వనికృంతనమం? చవివేక మిట్టులే
దుంపలఁద్రెంపదే?" యనెడిత్రోన ననూరుఁ డలుంగులేయ పె
న్దింపుల రక్తసిక్తముగఁదూఁగె దివి న్వకలీకృతాబ్దముల్॥ 441

ఉ॥ అంతకె మారుమూలలకునై పరుగెత్తుచు దింపుడాశ నొ
క్కింతగ సంశయించి యటులిట్టులు నిక్కుచు గుబ్బటిల్లి యా
యింతమురాశపోవఁ దమ మేత్తెఱఁదూఱె వనాంతరంబులు
న్గింతలు గహ్వరంబులు సొరంగములు న్గిరిదుర్గగర్భముల్॥ 442

వ॥ అప్పు డాస్కంధావారంబు పటకుటీరంబులముందు. 442/1

సీ॥ "జగము న్గ్రహంబునఁ జదల దిగ్భిత్తుల
నలమిన తమముబూ జవలఁబోసి
తొలి వేగుచుక్కవెల్తురు సున్నమున దిశా
కుడ్యమ్ముల న్వెల్లఁ గొల్లఁజేసి

హిమపంకమున నంకణములెల్ల నలికించి
మలయానిలపుకుంచె మాఁగుఁద్రోసి
యరుణోదయాభల హైమకుంకుమకాంతి
నందందు ముగ్గుల నలరఁదీర్చి
తే॥ గీ॥ విచ్చుసురభిళకుసుమసంపచ్చయముల
పుడమిపడతివిలాస మింపుగను దిద్ది
యల్లదే దూత సూర్యనాయణుండు
వచ్చెడిని దేవ మేల్కొనవలయు వేగ"॥ 443

క॥ అనువందిమాగధులకీ
ర్తనముల నిద్దురలుమాని తమకృత్యములె
ల్లను దీర్చి తగు వ్యవస్థఁ
బనుపఱచి నృపాలు వెదకఁ బయనంబగుచున్॥ 444

వ॥ వారివారికి సరిపడు మాఱువేసంబుల నాప్తులుతప్ప నొరు
లెఱుంగకుండ, రాజపుత్త్రిందును, మంత్రియు, బ్రాహ్మణ
ద్వయంబును, గతిపయసేవకులతో స్కంధావారంబు
వదలి చనువారలు॥ 445

—♦ భారవి మాళవరాజాన్వేషణ మొనర్చుట. ♦—

సీ॥ ఎక్కి రొక్కెడ సాంద్రహిమసన్నిపాతసం
జాతరాజతకాంతిధౌతగిరుల
డాటి రొక్కెడ క్రూరతరసింహశరభ శా
ర్దూలసత్వాకీర్ణ దుష్టవనులఁ
గ్రుంకి రొక్కెడఁ జలద్గురుతరంగావర్త
మకరాదిజంతుసంపన్ననదులఁ
జూచి రొక్కెడ రత్నశోభితగోపుర
ప్రాకారవిస్తీర్ణపట్టణముల
తే॥ గీ॥ మెట్టి రందందుఁ బచ్చికమేర లమల
మరకతాబద్ధకుట్టిమస్ఫురణ కలరి

చేరి రోకనాఁడు బహునదీసేవ్యమాన
పూర్వవారాశిగురుతీరభూమి నందు॥ 446

సీ॥ నిమ్నోన్నతంబులై నిడుపులై ఘనములై
వడిఁ దరంగంబులు పఱుగువాఱఁ
దద్గమనానువర్తనములై ద్రుతములై
వాయుచంక్రమణము ల్వర్తిలంగఁ
దద్బలోద్ధతములై దళములై సితములౌ
సికతాంబుదంబులు చెలఁగిపాఱఁ
దత్ప్రచారాలోలితంబులై పఱపులౌ
తృణసముత్కరములు మునిఁగి లేవ
తే॥ గీ॥ నతిగభీరంబు చిత్తదైన్యాపహంబుఁ
జిత్రసందర్శకంబు విచిత్రతరము
గా విరాజిల్లు మున్నీటిగట్టుపట్టు
గమనయోగ్యంబు బహుళసౌఖ్యప్రదంబు॥ 447

సీ॥ రేఁగి యుద్వేత్తులై మూఁగి లోకముముంచు
రీతులౌ నలలయుద్వృత్తి మాన్ప
నవుటాలకన, నిల్చునరులపాదములక్రిం
దటిసైకతము దోఁకి దడఘటించు
కలుఁగు ల్వాలార్చి యిక్కడనక్కడం దోలి
యెండ్రల విహాగాళి కేఱి యిచ్చు
నరమృగపాదచిహ్నములచేఁ జెదరిన.
తీరంబుఁ జదునుగా మీఱఁజేయు
తే॥ గీ॥ తటమునకుఁబాఱి మఱలు నుత్కటతరంగ
గతిఁ గనంగన నింకనుం గనఁగ వేడ్కఁ
గొలుపు వివిధరసోద్గతి గుబులుకొనఁగ
చిత్రచిత్రప్రభావవై చిత్రి దనర॥ 448

తే॥ గీ॥ తటమునకు ప్రోఁతతోఁబాఱు తరఁగ, లందు
మెఱయుబాలార్కకరముల మిసుకు లెగసి,

పాశముల లాగుకొని పసిబట్ట దుమికి
మొఱగి మూచూచు జాగిలంబులుగఁదోఁచు॥

తే॥ గీ॥ చేపలకు వచ్చిపోయెడి చిన్నచిన్న
పల్లెకారులదోనెలు పర్వగతుల
మొయిలుతుడుములలోన దోఁబూచులాడు
చిన్నజాబిల్లి వైఖరిఁ జెలఁగియాడు॥

తే॥ గీ॥ ఏమి నీగొప్ప ? గర్వింతు వేల నభమ ?
యలఁతిశశిరేఖకా యింతయదరిపాటు ?
శతసహస్రము లివె యన్న సరణి నుదధిఁ
బల్లెకారులదోనె లుత్పతనమూను॥

తే॥ గీ॥ కడఁక భూదేవిఁ జేరి సాగరుఁడు మంచి
ముత్తియములేర్చి పూజించుపోల్కి సలిల
శీకరము లుత్పతద్భంగసృష్టి నుఱుగు
చేర్లువాఱెడు తీరంబు చెంతలందు॥

శా॥ "ప్రాకారంబు లగడ్తలు న్బురుజులు న్బ్రాజు ల్లతఘ్నాళి త
న్మేకాలంబునుగావఁ గోట లిలఁ దామెందు న్మహోపాయని
త్యాకుంఠంబులె పో" యటం చనిలవాహ్యాళి న్యధేచ్ఛ న్మహ
నాకత్తేలుటఁ జూపి యబ్ధి నగు ఫేనశ్రీమిషంబూనుచున్॥

సీ॥ నీలము ల్తళ్కులు నెఱులుగా నలలపై
మింటియాగడప మేల్మిని రహింప
నటకొండనీడ యస్తాద్రిఛాయయనంగ
తమము వైఖరిఁ బూని క్రమత నెగయఁ
గెలఁకుల నలలతాఁకుల స్వచ్ఛత న్మించు
పలుగుఱా ల్మినుకులభాతి మెఱయఁ
బల్లెకారుల దోనెపడవల తెఱచాప
లందందు మొయిళ్ళల యంద మొసఁగ

తే॥ గీ॥ వనధిలో మిన్నె ప్రతిఫలించెనో? నభంబు
నందు వనధియె ప్రతిబింబ మందెనొక్కొ!

అదియెటులనున్నఁ గనువారి యక్షులందు
రెండుబింబించి కన్నులపండువౌనఁగ॥ 454

ఉ॥ గొప్పతరంగము, ల్తటముఁగొట్టి యెదిర్చెడివాని తాఁకున
న్గుప్పునఁగూలఁ దుంపురులు గుంపులుగాఁ జెలరేఁగి దోనెల
స్గప్పటఁజూడ, బాలశశి కైపురి కిట్లొనఁగూడె, వీడఁగా
నొప్పదటంచుఁ, దండ్రి, తనయు, న్దనకౌఁగిలిఁజేర్చున ట్లగున్॥ 455

సీ॥ బడిఁబడి యెడలేనివడిఁ బూని పడునీటి
నడఁ గూర్కుచూపువిన్నాణమేమొ!
యుడివోనిజడిగ నేర్పడుహోరు లడర దొ
ప్పలఁదోఁగు శ్రవణసౌభాగ్యమేమొ!
తెగతెంపువడక చల్లఁగ హాయి నూఁగించు
గాలిసొక్కిన మేనిబాళియేమొ!
కనులఁ జెవు ల్మేనుఁ గైకొన్న ముప్పోకఁ
బురివడ్డ మనసుమేల్పులకలేమొ!
తే। గీ॥ శ్రమను దొలఁగించు మఱపించు సకలజగముఁ
జింత లడఁగించు నేకాగ్రచిత్త మొసఁగుఁ
నౌర! తీర్థాధిపతి యిట్టియమలపదము
దయఁబ్రసాదింప మోక్షంబు దవ్వొయింక?॥ 456

తే॥ గీ॥ మోక్షతత్వ మెఱింగినబుధులు వారె
"హాయి! హాయి!"యటంచుఁ గొండాడుచుండ
నంచితానందకరము రత్నాకరం బ
టంచు నతిదూర మిట్లు నేనెంచనేల?॥ 457

శ్రీభట్టు సీ॥ కనుమిా! యశోధనా! మవలఁ గన్గొని వార్ధి
ప్రత్యుద్గతిని బొంగు పర్వపటిమ
వినవోయి! చలదూర్మిజనితగంభీరస్వ
నావేశమున నిచ్చు స్వాగతోక్తి
నందుకోవోయి! మందానిలకలితవీ
చీసమర్పితపాద్యశీతజలము

లారగింపఁగదోయి! సారతరంగని
ర్మథనజాతసుధాకరద్రవంబు
తే॥ గీ॥ మురు వెలుఁగవోయి! హిమకరకిరణతరణ
సరణిఁ దరఁగల చెలులాట దిరుగురుచుల
హాయి! యనవోయి నవరసదాయి కెరఁగి
యెలుఁగవే శౌరికిని మామ యాతఁడనుచు॥

భా॥ సీ॥ పలుకుచున్నాఁడేమొ? చిలువరాయనిమీఁదఁ
గొలువున్నహరి నిరాకులసువార్తఁ!
య॥ దెలుపుచున్నాఁడేమొ? తొలిపల్కుదొంగనా
దిమమీనరాజు వధించువార్త!
నా॥ వినుచున్నాఁడేమొ? విస్మయకరమైన
క్షీరాబ్ధి సుధ బయల్దేరువార్తఁ!
శ్రీ॥ జెప్పుచున్నాఁడేమొ! శివజటాజూటని
ర్యాసితగంగాప్రవాహవార్త!
భా॥ నెలుఁగఁజేయుచునున్నాఁడో యేమొ! మున్న
గస్త్యుఁ డొకగ్రుక్కఁ దనుఁ ద్రావఁగనినవార్తఁ!
శ్రీ॥ బాడుచున్నాఁడో యేమొ! ప్రపంచఘటనఁ
గాలశాశ్వతకళ్యాణకలితవార్త॥

నా॥ సీ॥ సురల సుధాసుధాకరముఖ్యములనిచ్చి
కరమాదుకొనియె సాగరుఁడుకాఁడె!
భా॥ నరుల కనర్ఘరత్నశ్రీఁ బ్రసాదించి
కనిపెట్టియుండు సాగరుఁడుకాఁడె!
య॥ దంభోళినిర్దయాఘాటికోర్వనిగిరీ
శ్వరులఁ గాపాడె సాగరుఁడుకాఁడె!
శ్రీ॥ వారధికై గొప్పపర్వతాల్తేలించి
హరికిఁ దోడ్పడియె సాగరుఁడుకాఁడె!
భా॥ తటిఁ దలఁగనీక మేఘబృందములఁబంపి
కర్షకప్రీతినొసఁగు సాగరుఁడుకాఁడె!

నా॥ వేలఁ దాటక కల్లోలపాళి నడఁచి
పరమసంతోషమిచ్చు సాగరుఁడకాఁడె !॥ 460

భా॥ సీ॥ చలువచప్పరము భూజలజాతనయనకు
భ్రమణోద్ధదారుణశ్రమమువాయ
సిరులబిడా రిలాసింహాద్రమధ్యకు
మణిమౌక్తికాలంకరణమొనర్ప
రుచులసోన ధరావరూథినీమణి కార
గించి బిడ్డలను బోషించుకొనఁగ
వైద్యుతప్రబలసంపద్రాశి ధారుణీ
మాత కాత్మీయవిఖ్యాతినెఱప
తే॥ గీ॥ భూతపంచకమునను బృథ్వీతరుణికి
మిగులదగ్గరచుట్టంబు తగులుపొలము
సంతతాశ్లేషసుఖపరిష్కారగౌర
వాంచితం బౌర ! పుడమి కీయబ్ధిరాజు !॥ 461

నా॥ క॥ ధరణీజనని యొడిని సా
గరుఁడను శిశు వాడుచుండి కడునాఁకలిచే
కరములనుసాఁచి పాలకు
నరసెడి చందమగు నదులయమరిక, వహవా !॥ 462

య॥ గీ॥ ధారుణీమాతయొడిఁ బాలు ద్రావుసాగ
రార్భకుం డేటికరముల నట్లుసాఁచి
యూమెగెరికవేణిపై నలరుమంచు
గడ్డపామ్ములఁబుణుకు నాగడము భళిర ! ॥ 463

శ్రీ॥ తే॥ గీ॥ పుడమితల్లి శిరోభారముడుప జలధి
తనచలువనంతయును మేఘతతుల నింపి
పంప నవి మంచుగడ్డలై ప్రాలి కరఁగి
యేరులై తెల్పుఁబోలు నందేసఁగువార్త॥ 464

వ॥ అనినఁ బ్రకృతివిచిత్రశోభలకు ముగ్ధుండగుచున్న భారవి శ్రీభట్టు
నవలోకించి. 465

తే॥ గీ॥ నీటిలోఁ బాడబము కొండ నెత్తమందు
మంచుగడ్డలపేరు డమర్చినాఁడు
తుద మొదలు లేనిదైవ మంతుఁ గనుకంటె
గడ్డుగాఁడోఁచె నీసృష్టిగతి నెఱుంగ ! ॥ 461

సీ॥ ఆకసమెత్తదెంతని కొల్వఁ జనుభాతిఁ
జూడనందని శిఖాశోభగిరులు
నాయెత్తునకు నింక నంతంతలోలోతు
లమరఁ గ్రాలుచునుండు నంబునిధులుఁ
బర్వతాగ్రములకుఁ బాథోధులకు లంకె
బాటలై యెప్పుడు న్బాఱునదులు
నదుల కిర్వంకల నయనపర్వములుగా
ఘనదుర్గపట్టణగ్రామవనులు
తే॥ గీ॥ గ్రాసవాసంబులకు లోటుగానియట్లు
లుదధిలోపల భూమిపై నుండువసతు
లట్టినిండున కానందమందకే స
తంబుఁబోరెడు జంతుసంతానమౌర ! 467

వ॥ భారత ఘోరరణంబు ప్రారంభంబుగా నిర్ధారణిఁ యాతీరునసే
యవయుచుండె నేమోగదా! భూభారధౌరేయులుగాఁదగు క్షోణీ
మణుల యన్యోన్యారంభంబు లన్యోన్యమారకంబు లగుచుండుటఁ
కేమికారణంబో కో ! 468

శా॥ "ఏభూఖండము లెట్లుమాఱినవొ? యేయేరాజు లేరీతి నా
యాభూమి న్భరియించుచుండిరొ బుధేంద్రానీక మేతీరొ? యెం
దేభక్తిప్రభలెట్టులున్నవొ త్రిలోకేశుండు నారాయణుం
డేభవ్యాకృతిఁ గ్రమ్మఱ న్బుడిమిపై కేతెంచునో హేలకై॥" 469

క॥ అనుభారవికౌతూహల
మున కనురూపముగు చిత్తమున శ్రీభట్టం
చినమాత్రఁ దచ్చరిత్రం
బనువుగఁ దనమానసంబు నందెనయుటయున్॥ 470

సీ॥ కరుణారసంబు కన్గవఁ గ్రందు కొనుచుండఁ
జిన్నఁబోవుచు మోము చెన్నుదఱిగెఁ
రౌద్రంబు ప్రళయసంరంభంబుగా రేఁగఁ
గను లింతలై యెఱ్ఱగాఱఁదొడిగెఁ
దతభయానకమహాద్భుతిసోఁక నఖిల
కళజాతి కంప మంగమునఁదోఁచె
భీభత్సమెనసినఁ బ్రిదిలినతమి నిండు
వెగటాస్యమున నుద్భవించుచుండె
తే॥ గీ॥ వీర్యమున శౌర్యరభసంబు వెలసెమేనఁ
జొక్కుశృంగారమున హాయిఁజూపె నొడలు
వింతచెలువూనె నద్భుతాక్రాంతిఁ గాయ
మధికశాంతాప్తి దేహ మొదడరె సమత॥ 471

తే॥ గీ॥ అన్నిరసములుఁ జివరకు సున్నయనుచుఁ
దోఁపఁగాఁబోలు హాస్య మత్యుద్భటముగఁ
దెగి శరీరంబుఁబెంప మంత్రివరు డురక
కిలకిలని నవ్వసాగె సంగీతసరణి॥ 472

తే॥ గీ॥ అద్దమునఁదోఁచుపాప కెట్లట్ల వారి
భావములలోన, దద్భావహావవివిధ
భేదములు బిట్టుగాఁ బాఱి పాదుకొనఁగ
వారలందఱు నబ్బురపడిరి మిగుల॥ 473

వ॥ తత్సమయంబున యశోధనుం డబ్భావవైపరీత్యంబులకుఁ గతంబెఱుం గంగోర నెల్లరంగలయం గనుంగొని శ్రీభట్టిట్లనివచించె. "అద్దిరా! శ్రీమన్నారాయణుని చిత్రవిలాసమహత్వం బెంతనికొండాడఁగలను?

భు॥ బలేకొంటె! మాయాప్రపంచంబులోన
నగలేకల్పుగా నిండి గమ్మత్తుఁజేయు
నిలారించు నవ్వించుఁ గేరించు నొంచు
నలంబిచ్చు లాలించుఁ బాలించులీలన్॥ 475

మ॥ ‘‘వినుఁడీ! నాఁడలద్వాపరాంతమునఁ బృథ్వీభారము దీర్పఁగృ
ష్ణునినిర్యాణము వెన్క సన్నిహితమై చొత్తెంచు నీ కుష్కలి
ఘ్నునుల స్వీడెమహత్తు, దుర్జనుల కగ్రత్వంబు చేకూడె, ధ
ర్మనిదానంబులు మాఱె, నేర్పడె ననర్థప్రాప్తి శాస్త్రాళికిన్॥ 476

తే॥ గీ॥ మేటివిలుకాఁడు, ధైర్యంపు మేరునగము,
పటుబలాఢ్యుండు, దివ్యాస్త్రబంధురుండు,
బహుతరాక్షౌహిణీజేత, ప్రౌఢయోధ
విజయుఁడే తస్కరులమ్రోల వీఁగిపోవె॥ 477

ఉ॥ జ్ఞానులుఁ బాలనక్షము లఖండచమూచలనక్రియానుసం
ధానవిచక్షణు ల్రణవిధానవిశేషకళాప్రధానులా
ధీనిధులందఱు న్రణవిధి న్గురుపాండవసంగరస్థలి
న్బ్రాణములిచ్చిపోవ మగపగ్గె నశించెననంగ వింతయే?॥ 478

చ॥ అనుభవమింతలేక, గురులై కని దిద్దెడువారులేక, యో
జన మెలపూనలేక, జనశాసనలీల హఠాత్ప్రయుక్తులై
తనరినరాజపుత్త్రికులు తద్దయు దుర్బలులై స్వలాభధా
వనులగువార లాడుకొనువారుగఁ జేర నశింపకుందురే?॥ 479

ఉ॥ సాహసము న్బ్రతాపమును శౌర్యము సత్పృతనాదిలక్ష్మియు న్
వ్యూహవిధానదక్షతయు నుండినవాఁ డెటనేని త్రోఁచినన్
బాహుజసంఘసమ్మిళితభవ్యబలాఢ్యతఁ గూర్పఁ బోక సం
దేహముపీడి సర్వనృపదిగ్విజయంబునఁ దృప్తినొందెడిన్॥ 480

ఉ॥ చేరెడుబారెడై కలుపుచెందికనొందక చింది యెందొ కాం
తారములందు దుర్గమపథంబుల నిల్చినచిన్నరాజ్యము
లొప్పిగుల కెప్పుడు న్జలముఁబూని శఠించుటె కాని పొందికం
గోరి విశాలరాజ్యమునకు న్దగుపూనికఁ జేయ వెన్నడున్॥ 481

చ॥ కడుబలశాలియౌ నృపుఁడు కల్గిన దుర్భరరాజసూయమో
కడుకొని యశ్వమేథమొ యఖండితదిగ్విజయంబొ చేసి పే
ర్వడయుటె చూచుఁగాని బలవత్పృతనాహతి నూళ్లు సీమలు
న్జెడుటయె కాక శౌర్యమునశించుటఁ జూడఁ డొకించుకేనియున్॥ 482

ఉ॥ భూపతి విష్ణునంశమునఁ బుట్టునటంటకు సార్థకంబుగా
నోపినరీతి శిష్టతతినోముటొ దుష్టులనోర్చిఁ యీతిబా
ధాపకృతు ల్దొలంచుటొ వృథాకలహంబులఁబెంచి దేశదా
ర్ఢ్యాపహాతి న్నశించుట లహో! విపరీతకథాకలాపముల్॥ 484

ఉ॥ బీదల సాదుల న్బిడిచిపీల్చి గడించిన కోశము న్నృపు
ల్వాదములందు వట్టిగడుసుంగతిఁ బందెములొడ్డి, వ్యర్థమ
ర్యాదకు సేనలొడ్డి, యనయంబున బైసిచన న్విశీర్ణకా
కోదరులై జనంబుల కయోగ్యదశ ల్గలిగించి రద్దిరా!॥ 484

క॥ కలరాఘశూచికాదిక
విలయములంబోలి దాడివెడలున్నృపుల పే
రలజడి పదపదమున బి
ట్టలముకొన న్దేశవృద్ధి యమురునె చెపుఁడా!॥ 485

క॥ వనములఁ బట్టణముల గిరి
కొనల నదీనదముల న్నిగూఢపదముల
న్జనపతిఁగన నెమకుచువ
చ్చినదారిన్ మాతృభూమి చిక్కఁగుపడదే!॥ 486

సీ॥ కేదారబహుళరేఖాదర్శనీయము
ల్చిక్కుతుప్పల నిండి శిథిలపడియె
లలితసామోదవిలసితారామము
ల్నెఱఁదప్పి వనసత్వభరము లయ్యె
బహుకళాసుమనోజ్ఞపట్టణస్థలులెల్లఁ
బడి పాడువాఱి కోల్పడియె సొగసు
విమలనాగరికతావృతకుటుంబసమూహ
మటవీనివాసాప్తి నడరులొందె
నెడతెగక భూవరానోన్యపృథులకదన
కౌతుకప్రస్థితోరుసేనాతరంగ
మాలికాలయకాలీనకేళికాప్ర
చండవేగాఘాతులు పాఱి బెండువఱుప॥ 487

క॥ హిమవన్నగంబు వేణిగ
సుమహీధ్రమువింధ్య రశనచొప్పున సేత్వ
గ్రము పాదభూమిగాఁదగు
ప్రమదామణి మాతృభూమి పాటేమనఁగన్॥ 488

ఉ॥ దివ్యశరప్రభంజనసుతీక్ష్ణపరాజితభార్గవుండు,లో
కవ్యసనేంధనానలనికామనివారకతత్త్వవారివా
హవ్యవహారి భీష్ముఁడు దశాహము లట్లుసహాయాదరాంతకుం
డై వ్యథఁగూర్చుకున్నభరతావని కీమరవస్థ కల్గునే? 489

చ॥ బహుళమహాస్త్రసంయుతుఁడు, పార్థుఁడుఁ మాధవుగీతల న్బ్రితా
పహుతవహార్చు లుబ్బగొన బాంధవయోధచమూప్రపంచస
న్నహనము రూపుమాపక కనద్దయనించిన, మాయనుంగుమా
తహితహసన్ముఖాబ్జమునఁ దాఁకునె యీక్రియ శోకవేగముల్॥490

మ॥ జననీక్షోణియశోంబరంబున రసాసారప్రదానోరుజీ
వనదవ్యాప్తి యడంగె, దివ్యసలిలవ్యాపారశంకాసము
జ్జనకప్రౌఢనిదాఘమేఘశకలస్రంసన్మహాడంబరం
బెనసె, న్గాలగతి, న్వచింపఁ దరమానే నేఁటి దీనస్థితిన్॥ 491

మ॥ గ్రహసంబాధితమైనభారతభువి న్బ్రిక్షాఢ్యుఁడై రాష్ట్రసం
వహనం బూనఁగఁజాలు నేర్పుగల భూపాలుండు లేకుంటచే
యుహుచీ గ్రీకులుఁ బారసీకులును హూణ్యాధు ల్పరివ్యాప్తిఁద
ద్గృహముంజొచ్చి కలంచి గైకొనిరిగా శ్రీల న్యథాశక్తిగన్॥ 492

సీ॥ జీర్ణశాలాదుర్గకర్ణమై యాకులీ
భూతోపవనవృక్షభూరివేణి
యై, నష్టబహుపట్టణానర్ఘభూషయై,
శీర్ణోరుకేదారచికురయగుచు,
శిథిలితరథ్యాప్రసిద్ధసీమంతిని
యై, భ్రష్టవాణిజ్యహారివాక్ప్ర
సంగయై, ధూతరాజ్యప్రౌఢశక్తియై
దారిద్ర్యమనుజసంతానయగుచు,

పుష్టవాహినికాశ్రుసంపూర్ణయగుచుఁ,
బ్రబలితామయహిమమేఘపాండువర్ణ
యైన హైందవజనని దైన్యమున వెలయు
రూప మాపూర్తి నెడఁద సంతాప మిడదె?॥ 493

శా॥ తల్లీ! పూతచరిత్ర! ప్రత్యహముసంధ్యావందనంబట్లు నీ
ఫుల్లాబ్జేక్షణమాలికాచలనసంపూతాత్మసంచారవి
ద్యుల్లీలాపరిపుష్టసర్వభువనాయుర్దాయులై నీకు న
త్యుల్లాసంబున సేవఁగూర్చ్రుఘనుల న్యోజింతు నశ్రాంతముఃన్॥ 494

సీ॥ కొన్నాళ్లు దక్షులౌమన్నీల రాజ్యసం
స్థాపనంబున దోడుఁజూపగడిచెఁ
గొన్నాళ్లు రాజన్యకోటికుంటుబ సౌ
ఖ్యార్జనాకృతిసహాయమున గడిచెఁ
గొన్నాళ్ళు బహుమతకూ్రర భండనసము
ద్రావర్తములఁ దిరుగాడ గడిచెఁ
గొన్నాళ్ళు పరచమూఘోరసంఘర్షణా
హతుల దిగ్భ్రాంతిపాలగుట గడిచె
నాఁడునాఁడును జెందిన నలకువలకుఁ
దేటి నిర్ద్వంద్వసౌఖ్యంబుఁ జూఱఁగొంటి
ననుకొనెడి భాగ్యమే కఱవైన నేఁటి
తల్లడంబు లెటు ద్రాఁటుఁ దల్లి! నీకు?॥ 495

సీ॥ కృష్ణోపదిష్టమహాగీత తదుద్దేశ
విపరీతకృతుల లోపింపవలెనె!
మనుసంఘవిన్యాసమహిమ మంతర్వ్విరో
ధప్రదంబగుచుఁ జిందంగవలెనె!
బహుపురాణోదితభవ్యవాఙ్నిచయం బ
నాచరితంబయి యడఁగవలెనె!
బుద్ధమహాదేవు పూర్ణసాత్వికబోధ
గాలితెటట్లుఱకంగవలెనె!

కానికాలంబులోఁ బ్రజ్ఞ కానికైనఁ
గాన్నిదై చెట్టనొనఁగూర్చుఁగాని మేలు
నొసఁగదని పెద్దలనెడి లోకోక్తి ప్రబల
మైనదయ్యెనె నీయెడ నార్యమాత!॥

సీ॥ మార్యచంద్రునిరాష్ట్రమర్యాద గతిమాలి
మూన్నాళ్ళముచ్చటై ముగిసెనమ్మ!
అలయశోకుని యహింసా వేశితాధిప
త్యము స్వప్నవృత్తాంత మయ్యెనమ్మ!
భూరిసముద్రగుప్తుని సేతుసీతన
గాబద్ధవిజయ మేమయ్యెనమ్మ!
శ్రీవిక్రమాంకవిశిష్టదిగ్విజయకీ
ర్తిప్రతానం బిట్టెటిటెనమ్మ!
తల్లి! నీరాష్ట్రనిర్మాణధనులలోన
నిలకడయెసంగుపథమున నిన్ను నిలుపఁ
జాలు విధులఁ బ్రపంచింపఁజాల నొక్కఁ
డైనఁ గల్గఁడదేదైవహతియొకాని!॥

సీ॥ బ్రాహ్మణమతము శ్రీవైష్ణవశైవశా
క్తేయగాణాపత్యకీలితంబు!
శ్వేతాంబరదిగంబరాతిమోహితనిజా
శయసాంప్రదాయంబు జైనమతము!
హీనమహాయానహృతసామరస్యసం
ప్రాప్తకాలుష్యంబు బౌద్ధమతము!
వివిధమతాభీలపృథులసంఘర్షణ
వ్యాలోలితములు రాజ్యములగములు
పోరు బలిసిన నెట్టిసంసారమయిన
సారమునశింప నిలువకజారిపోదె!
నిఖిలమతతత్త్వములలోని నిగ్గొకండె
యనుచు నీబిడ్డలకుఁ దెల్పనైతె మాత!॥

ఉ॥ ఏరులగట్లవంకరల నించుకనిల్చి ప్రవాహతీవ్రవే
గారభటి న్గమున్వడలనంపెడిక్రొత్తల కంచు నిల్వఁదా
వ్వూరకవీడి పోవుకసవో! యనఁ గాలనదంబు రాష్ట్రపుం
దీరములందు మాటికి విదీర్ణత నొందెడివారిఁ జూడవే!॥ 499

వ॥ కులమా! గోత్రమ! కొంపయా! మతమ! సంకోచంబ! దాక్షిణ్యమా!
పలలాశుల్గదహన్ను లీతెఱఁగున న్నైవచ్చి నీసాదుబి
డ్డలపై దౌడులఁదీయ వారిఁగనకుండ న్గన్నడన్సేయ నీ
తలపేమోగద? వారికష్టమునఁగాదా నీకి సౌఖ్యం బిటన్॥ 500

ఉ॥ మాళవమాక్రమించి యొకమాదిరినేలిన తోరమానుఁ డా
భీలమునన్వెలార్ప నటవీస్థలిఁ జేరిన వీరధర్మభూ
పాలుఁడు తస్కరాపహృతభవ్యసుఖుండయి పొక్కుచుండెఁ ద
ద్బాలకుయోధుజేసిమగధప్రభుఁజేర్చితె భారతావనీ!॥ 501

వ॥ ఓహో! భారవీ! యోయీ! నారాయణుఁడా! మీయిరువుర మంత్రంబులతోఁబాటు మగధసైన్యంబులతంత్రంబులుఁ బ్రాపుగాఁగ హన్నులంబాఱఁదోలి మాళవంబుసాధించు టొంతపని. కాని, యిల్లొంతవెదకియు భూకాంతుం డగుపింపమియే కొఱంతయగు చున్నయది. ఇటనుంచి మనవలువుర మిఱుతెగలుగా వెడలి యప్పు డమియొడయుఁ డెప్పెడమెలంగునో వడికడఁక నెఱుంగకున్న నేయెడ రెయ్యెడలుం బొడమెడినో? కావున, నీతావు విడచిన నేఁటికి పది యారగునాఁటికి మనమందఱముం గ్రమ్మఱ స్కంధావారంబు తీరంబునం జేరుకొంద” మనిన నందఱు వల్లెయని నిర్దిష్టములగు త్రోవల వారివారిసేవకులతో వెడలిరి. అందుయశోధనుండును మంత్రిశేఖరుండును దక్షిణాభిముఖులై॥ 502

ఉ॥ వాఁగులు వంతలు న్బొదలు వన్యతలంబులుఁ గొండదండలుం
బాగుగఁ జూచుకొంచుఁ జనువా రొకనాఁ డొకచెర్వుదండ స్వే
చ్ఛాగతి గడ్డిమేయు నొకచక్కని గుఱ్ఱముఁగాంచి “దాపునం
దే-గుడిసె న్గనంగలము నిశ్చయ”మంచు ఖురాంకమార్గులై॥ 503

క॥ చనుచో శ్రీభట్టారకుఁ
డను "నిదిసాంద్రాణి యుత్తమావర్తము లె
ల్లను దివ్యానుభవముఁ జూ
పును నిర్జనవనులఁ గసవు ముట్టఁగనేలో?"॥ 504

చ॥ బెదరొకయింతలే, దడవిబిత్తరికా, దెగుమోము దృష్టిసం
పదయు గభీరతం దెలుపు, మైఁగల గాయపుమచ్చలన్నియుం
గదనవిహారిగాఁబలుకుఁ, గన్గొను, గ్రీవమటల్చి తీవ్రదృ
ష్టిఁదనికి యిందుఁజూచుట, వడి న్మనల న్దరియంగవచ్చుటల్॥ 505

శా॥ నామాటల్విని నన్ను గుర్తిడిన చందాన, న్జైవ్రలిక్క హే
షామంత్రం బొకయింతపొక్క మహితాశ్వం బిట్టులే తెంచు, నీ
లో మీరెల్ల రెడంబుకల్గఁజని నిల్వుం, డోహో! రాట్పుత్ర! నీ
మోముంజూచి మఱింతసంతసముఁ దెంపుంజూపెడిం గాంచితే!॥ 506

చ॥ అనునెడ వారిఁజేరి, సచివాగ్రణి కొక్కకటాక్షమిచ్చి, రా
ట్తనయుఁ బదంబుఁదొట్టి శిఖదాఁకను మూర్కొని, గ్రీవ నంసపీ
ఠినిడి, యొకింతనిల్చి, మగిడె, న్సకిలింపు ఖురధ్వనుల్ ప్రతి
ధ్వనుల శివాట్టహాసగురువై భవము న్సమకూర్ప రివ్వనన్॥ 507

శా॥ "ఆహా! వార్వము తెల్వి! యద్భుతము! నీయాకార మాత్మేశున
ట్లై హృద్వీథికిఁదాఁక మూరుకొని వ్యత్యాసంబుగుర్తించి యే
యూహాళ్గైకొనెనో వడిన్జనెడి నత్యుద్రేకియై, బంటులా
రా! హేష న్నడిఁబట్టి పోం డచటివృత్తాంతంబుఁ దెం డీడకున్॥" 508

మ॥ అన వారల్చన రాసుతుండు సచివుం డాతోంటిజాడ ల్కనుం
గొనుచు న్జేరిరి కొండనొం డచటిచిక్కందారిఁ బై కెక్కి యొ
క్కనికుంజాంతరమందు హస్తనలినాగ్రన్యస్తశీర్షంబుతో
వనట నాప్రిపలక న్నిపీదయగుతన్వంగిన్; సమీపించుడున్॥ 509

చ॥ అలికిడి తోఁచుట న్జకితయై వదనంబును ద్రిప్పఁ జూచి తో
టిప్రియునుడి 'దేవి! దేవి!' యని పెగ్గడనా, 'గురుమంత్రి!' యంచునా
లలన వచించి యాకెలన లాతిసరుంగని తొల్గఁబోవుచోఁ
బలికె నమాత్యుఁ 'డమ్మరొ! భవత్సుతుఁ డన్యుఁడుగాఁడుచూడుమా

శా॥ ఔనేమోయనునాశ మోముపయి భవ్యానంద చిహ్నాళి రాఁ
బూన న్నాయమమూని, రాణి కఠినంపుంజూడ్కి శీఘ్రభట్టుడెం
దాన న్వాడిగ గాడ, సాగుమెయి క్షాత్రంబుబ్బ రూక్షోక్తుల
న్బోనాడె స్నుష "ద్రోహి! పో! తొలఁగు! మీమోసంబు కాదింకిటన్"॥

చ॥ అనునెడఁ జిన్నఁబోయి హృదయానతశీర్షుఁడు బద్ధహస్తుఁడై
వినయమె విగ్రహంబుఁ గొనుపెంపున వాల్కనుదోయి మంత్రిని
ల్వ, నుబుకు కోపము న్దోసకఁబాఱెడి భ్రూముడి కెంపువన్నెచిం
దిననెఱబుగ్గలు న్వెలయ, నెక్కొను ప్రాక్చరితంబు త్రెక్కొనన్॥

ఉ॥ "తల్లికి బిడ్డకు న్జెఱచి ధర్మము బుగ్గిగ శత్రుఁజేరి నీ
చల్లనిసామికిన్ బ్రజకు శాపమురూపముఁ గొన్న నీకెటు
ల్చెల్లె మొగంబు మమ్ముదరిశింప? నను న్గనలేక నీకను
ల్మల్లుట చాలదారుజువు? మాకిఁక నేయసదెంచి వచ్చితో?"॥ 513

మ॥ అన నుష్ణీషముఁదీసి రాసుతుఁడు సాష్టాంగంబుగా వ్రాలి "యో
జననీ! యీతఁడు దోషిగాఁడు తనసంసారంబు సౌఖ్యంబుఁ బో
యిన లెక్కింపక నన్ గుఱించి పడె నెన్నే నాపద ల్కొండల
న్వనుల న్శాత్రవభూముల న్నదుల సంగ్రామంబుల న్ధీరుఁడై॥ 514

మ॥ వినవమ్మా! యలడింభుఁడే నృపతికి న్విశ్వాసియై సట్లునే
ర్పున నిమ్మాన్య నధఃకరించి నను నిర్మూలింప సేనానితో
మనసంబూను టెఱింగి మార్పలుపు సామర్థ్యంబు లేకుంట న
న్గొనియేగె న్దఱియైన మీకొసఁగుదంచు న్స్వార్థసంత్యాగియై॥ 515

మ॥ కడఁక న్డింభుఁడు రాజ్యకాంక్షఁగొని తన్గాఢంబుగా నమ్మి భూ
పుఁడు రాష్ట్రంబుఁ బ్రమాదమొంద నరిప్రాపున్బొంది గెల్పొందె, యె
క్కడనున్నారలొ మీరటంచు నెమక న్గాలంబు సాగె, న్గనం
బడినా రింక క్షణంబు నిల్చెదనె త్రుంపన్బోక తద్దుష్టునిన్?॥" 516

చ॥ అని వడి నంగరేకు కుడిహస్తముపై కెగఁదీసి వాలు స
ర్రన నొఱనుండిదూసి దివిహత్తఁగనెత్తి, "కుమార్గ! డింభ! ని
న్ననిమొనఁ ద్రుంచి హాన్నుల నిరాకృతి నెల్లఁబాయఁదోఁలి మ
జ్జనకుని మాళవాధిపుని సల్పనయే న్గతులెల్లఁ దప్పెదన్"॥ 517

శా॥ ఆశౌర్యార్భటి నాథుపోకడల దాయాద్యంబు సూచింపఁగా
నాశాతోదరి యింపు శంక మెలియా నాలోకము ల్వానిముం
జేశారాంకము నాఁచుకోఁ దడవు నిల్చె న్దానిపై, నంత "బి
ద్డా ! శూరాగ్రసరా ! తథా" స్తనుచు గాఢాలింగనోత్కంఠయై॥
శా॥ మోఁకారించిన రాజపుత్త్రిశిరము న్మూర్కొంచుఁ జెక్కిళ్లను
శ్రీకైపుఁజ్కుచు ప్రైక చెమ్మగిల సాంద్రీభూతవిశ్లేషదా
హోకర్షంబునఁ గౌగిలించుకొనె మోదాశ్రు ల్పొరింబొర్లి ము
క్తాకూపారపుజంపులై యతనిమూర్ధంబందు వ్యాపింపఁగన్॥ 519
ఉ॥ ఆయుపగూహనం బచటి కప్పుడెవచ్చెడిరాజు చూచి "ఛీ
ఛీ, యిదియేమిటం"చనుచుఁ జెచ్చెఱ వాల్పెకలింపఁగా నోఱ
న్వ్రాయుచు మున్నెత్రుల్లి భువిపై నెదుట న్జిఱుతాఁటియా "కిదే
మీ"యని యెత్తిచూడఁ గనిపించెను దాన మహార్థమిట్టులన్॥ 520
శ్లో॥ సహసావిదధీత నక్రియా మవివేకః పరమాపదాంపదమ్
వృణుతే హి విమృశ్యకారిణం గుణలుబ్ధాః స్వయమేవ సంపదః॥
చ॥ "త్వరపడి యేదిచేసిన విపత్తులఁ గూర్చునె! మంచి చెట్టబి
ట్టరసి యొనర్ప సంపద స్వయంబుగఁ దావరియించునే ! నిజం
బెఱిఁగెదఁగాక యంచు శిరమెత్తి రుషన్నియమించి చూడ నా
యిరువురి వెన్కఁగాఁగఁ గనియె న్ధనతొల్లిఁటిపెద్దమంతిరిన్॥ 521
శా॥ "హా నేపో ! హతభాగ్యుఁ డావణిజుఁ డంత్యాసన్నమౌసంధి నే
దో నాకిచ్చెనటం చసడ్డనిడితి న్దోడ్తో నొఱప్దిని నా
రా ! నిద్దంపుసహాయము న్నలిపె దుర్వ్యాపారమున్నాన్ని, క
న్గోనానే కవియైన భారవిని నాకున్ దీనిఁగైకొమ్మనన్?"॥ 522
చ॥ అని కడుభక్తిఁ దాళదళ మంతరకంచుకమందుదోఁపి, "పా
వనుఁడగు నీయమాత్యుఁ బలుబాముల, డింభునిమాటనమ్మి, ము
న్ననయముఁజూపి పోవిడచి, తద్దిర! చెల్లను మోము వానిఁగ
న్గొనవిపుడీయవస్థ, నదిగో! సతి పల్కుడు నాలకించెదన్"॥ 523
చ॥ "సచివవరేణ్య! మాయయును సత్యమెఱుంగఁగలేక రూక్షవా
క్ప్రచయములంటి, రాజ్యపరిభావముఁ బాపుటదెట్టులున్న, ని

ర్వచనమొసర్పరాని ముదుపార్జనము న్నమకూర్చి, తాళతీ
ఱిచనినపుత్త్రి నా, కిడి, భరించి క్షమింపుము నన్ను" నావుడున్॥

క॥ అంగనకు మంత్రి మార్పలు
కంగడగెడులోన నృపతి కడురభసముతో
నంగకు పదిమెట్లనుకొను
భంగిపఱచి వచ్చువాఁడు పలికె నుడుటునన్॥ 525

శా॥ "దేవీ! యేమనుచుంటి? పుత్త్రికుఁడ! లేదేసంశయం? బేఁడి? రా
రావోయీ!" యనునంత రాజ్ఞి "కనుఁడీరాజోచితాంకంబు" నా
'నోవత్సా!' యని సందిటన్గొని శతాయుఃప్రాప్తిర" స్తంచు 'మం
త్రీ! విజ్ఞాతమ డింభు దుర్జనత, మైత్రిన్గొల్పుదే మాపయిన్? 526

ఉ॥ అందులశంకయేల? విపదబ్ధిఁదరింపఁగఁజేసి యిట్లు మా
కందును మమ్ముఁజేర్చితి వఖండతరంబగురాజభక్తి, నీ
పొందెఱుఁగంగలే కసమఁబూని రచించితినీకు, మమ్ము మా
నందనునట్ల యొప్పునఁ గన న్వెతవీడుచు సంతసించెదన్"॥ 527

చ॥ అనఁగ నమాత్యుఁ "డోనరవరాగ్రణి! యీతనువెల్ల మీకృపా
ఘనతనెకాదె పెంపుఁగొనె, కస్తి మిము న్విడి చన్ననాయవ
జ్ఞను దలపెట్ట కింతటిప్రశంసనొనర్చుట మీయుదారభా
వనమునఁగాక నాదగునుపజ్ఞనుగామి యెఱుంగనే?"యనన్॥ 528

శా॥ "శ్రీభట్టారక! నీవినమ్రత గుణశ్రీఁబెంచు పెన్భూషణ, కా
నే, భూదేవు లటంద్రుమి మ్మదిగొ పెన్నిద్దంపుశ్లోకం బొకం,
డాభారవ్యపపాదితంబట, మదీయాగ్రంబునన్దోఁచి యి
ష్టే భవ్యంబగు సాయము న్నలిపె-దేవీ! సుంతమన్నింపుమా!"॥529

శా॥ నాప్రేమైకనిధాన మాయబల ప్రాణంబెల్ల నాసొమ్ముగా
నేప్రాల్మాలికలేక కల్మిదళ కెంతేమిన్నగాఁ గొల్చు న
య్యో! ప్రాజ్ఞత్వముఁవీడి శంక వథకుద్యోగించితిన్ సాహసా
ర్వప్రావిష్కృతిఁ, గాచె మమ్మిది విచిత్రప్రౌఢి నాకడ్డమై॥ 530

ఉ॥ వేఁటకు దూరమేగి హరి వెన్కకు వాడుక వెంటఁబంపి యు
చ్చోటను నేకమార్గములఁ జొచ్చి చరించుచునుండ నొక్కఁడ

న్వ్రేటులఁ దూలి సోలిన నవీనుని మూలుగు వీనుసోఁక డ
బ్బాటునఁ గంటిఁ బెన్బొదరుపజ్జను వాని గతాగతస్పృహున్॥ 531

క॥ కెలకుల నలినాకరము
న్జలముల వస్త్రంబుఁ దడిపి జల్లుగ నొసట
న్జిలుకంగఁ బిడువఁ గొంతఁగ
నులవిప్పనఁ జుట్టు న న్గనుంగొని పిదపన్॥ 532

మ॥ "ఎవరో! నిన్గురుతింపఁజాల నిదిగో యీతాళపత్రంబు భా
రవి కన్పించిన, బాకితీజనను వార్తన్దెల్పి యర్పింపుఁడ
య్య! వణిక్కొక్కఁడొసంగెనం" చనుచు నీయన్గోశమందుంచుచు
డ వడి న్వచ్చెను మోర నుర్వెలెగయ న్వార్వంబు నాచెంతకున్॥

ఉ॥ వచ్చినరాక మోరఁ బలువంకల నన్దనవైపు నెట్టుచు
న్హెచ్చగు తొందఱ న్నిలువనీయక స్వారికి నెక్కుమంటగాఁ
దచ్చన హేషఁ గొల్పుచును దాఁటుచు డాయుచు గొండ్లిద్రొక్కనే
పొచ్చెము పుట్టెనో యిచటఁ బోఁదగు, నార్తుని వీడు టెట్లొకో?॥

చ॥ అని వెనుకాడుచుండ నపుడప్పుడ దవ్వునఁదోఁచి రెవ్వరో
మనుజులు, కేకతోఁ బలితుమాటను వారికిఁజెప్పిచూపి రి
వ్వున నిటువచ్చినాఁడ, నిరువుర్ధరణీసురులట్లుతోఁచి రా
తనిఁ బ్రదికించిరో చని యుదంతమెఱుంగుఁడుమే ద్రుతంబుగన్॥535

ఉ॥ నావుడు మంత్రిపల్కె "నరనాయక! రాణియువచ్చె నేని యా
త్రోవనె సేనలున్నెడకుఁ దొందఱగాఁ జనవచ్చు" నన్న నా
భూవరుఁడు "న్సరే" యనఁగ ముప్వురు యోధులు గొబ్బున న్బ్రయా
ణావసరంబుల న్గొని హయంబులఁ బన్నుచునుండునయ్యెడన్॥ 536

చ॥ మును తురగంబు వెంబడిని బోయిన సేవకు లంపువచ్చి, నూ
తనులగువారె భూపతియుఁ దత్సచివుండును బోల్చి వందివం
దనములు చేసి, కాఁదగిన తక్కినసన్నహనంబుఁ గూర్చుచు,
న్మనవినొనర్చి రిట్లనుచు మంత్రికిఁ నచ్చటివెల్లరున్వినన్॥ 537

ఉ॥ "దేవరయాజ్ఞమై బయలుదేఱి ద్రుతంబు హయంబు వెంబడి
న్బోవఁగఁబోవఁగా నదియు ముం దిరువంకల నిక్కిచూచుచు

న్స్రోవలమూరుకొంచు మదిఁ బ్రోక్కటమైఁ జిటుపేషఁ గొల్పుచు
స్థావనమూనుచు న్నిలిచి తారుచు పెన్నకిలింపుతోఁ దుదిన్‌॥ 538

ఉ॥ నాలుగుకాళ్ల పెన్బులుగున న్జనుచుండఁగ దానిపేరెము
న్జాలున ముందుఁజూడఁగఁ గనంబడె మూదొరవారు భూమిపై
సోలినవానిఁ దేర్చుటలు, "చూడుఁడి!"యం చనులోనఁ దేజి యా
నేలకుఁ జేరుకొంట ధరణీపతి వేఱొకదారి నేగుటల్‌॥ 539

—♦ భారవి ధవపాలుం గాననంబునఁ గనుట ♦—

మ॥ పిదప న్గంటిమి కొంద అచ్చటికి పెన్వేగంబుతోఁ జేర, నీ
పదు వెవ్వారని చూడ విప్రయుగము న్బంన్టిరి మేమంతట
న్గదియంబోయిన విప్రులం దొక "రోహో! క్ష్మాపాలుఁడాతఁడె, లే
పెదియున్నందియ మేమొనర్చెదము? వీఁడెవ్వాఁడో! హా! కోమటీ॥

ఉ॥ నీవిట కెట్లువచ్చితివి! నిన్నెవ రిట్లులొనర్చినారు! మి
త్రా! వడినీరు దెమ్మిటు! కరమ్మధికమ్ముజ్వర మ్మురమ్ముపై
లావుగగాయమయ్యెను భళా! విధిచైదము! నాకుఁగూర్చువా
రీవరుస న్జెడన్వలెనె యెల్లరు! నెంతటివైపరీత్యమో!॥ 541

మ॥ భటులారా! సచివుండు రాసుతుఁడు నీప్రాంతంబులందున్న, ని
చ్చట రాజు న్గనుఁగొంటఁ బల్కె నెమకన్నాగుండు పొం"దన్న ను
త్కటవేగంబున వచ్చినార"మన "మేల్కానున్నకాలాన మి
క్కుటముల్గా శుభశూచకంబులె చెలంగు న్రాజచూడామణీ!"॥542

మ॥ అతఁడే భారవిభట్టు మీకు సచివుండైనాఁడు నాతోడుగా
వెతకన్బూని యుదగ్దిశ న్దిరిగి యీపృథ్వి న్సమీపించు ట
ద్భుతదైవక్రియకాదె నేఁటి"కన భూపుం, డందతెవ్వారియో
గ్యత కెట్టులసాగఁగాఁ, జనుచు, భక్త్యావేశముప్పొంగఁగన్‌॥ 543

చ॥ "పదనఖరోచుల న్వరనృపాలకనేత్రమణిద్యుతు ల్పదో
హదము గ్రహించి పెక్కుకళలంది జనంబుల కబ్బొసంగ నే
సదయుఁడు లోకయాత్రఁ గెలసంబున దిద్దుచునుండు నిత్యమ
భ్యుదయదుఁడై తదద్భుత మహాశకదుగూఢ మతర్క్య మేరికిన్‌!॥

చ॥ మెలఁకువవాఁడ నెయ్యెడ భ్రమింప నటంచొకగర్వముండె, గ
చ్చులకెడమిచ్చు టాపదకెసుమ్మని దైవము తెల్పురీతిగా
కలఖలుఁడైన డింభునెడ నట్టుల నంధుఁడఁగాఁగ నేల! దు
ష్టులయినహాన్నులంతిపురిఁజుట్టినఁ జా కిటునిల్వనేటికో!॥ 545

ఉ॥ రాణియునేనుఁ బూర్వనిశి రాట్సుఖతృప్తులమై యథేచ్ఛ ని
ద్రాణులమైతి మేయెడరురాక నెఱుంగమి, హాన్నులంతను
గ్రాణము లాక్రమించుకొనురాయిడిరేఁగఁగ లేచి చూడ నా
రాణువ నొక్కఁడు న్బయటిరంగమున న్గనుపింపఁ డేమనన్॥ 546

చ॥ వెలుపలికేగుద మన వా
కిళు లవల బిగింపఁబడియె, కిటికీ దఱియ
న్దలకించెఁ గమ్మొయొకఁ డం
దుల, దాని గ్రహించుచు న్జదువ నిట్లుండెన్॥ 547

ఉ॥ "కాలముతప్పె, డింభుఁ డెడఁగాఁ దొలగించెను సేన, హాన్ను ల
క్కాలునిదూతలోయనఁగఁ గ్రమ్మిరి చొచ్చిరి కోట, నింక మీ
కాలముకాదు, మీహాయము నాగుహదాపునఁ గాంచనౌను, భూ
పాల! నిగూఢమార్గమున వైళమ దేవియుమీరు నేగుఁడీ!"॥ 548

చ॥ అనునదికాంచి క్షత్రియుఁడనై తగుపౌరుషమెల్లవీడి సి
గ్గనక పలాయనంబుఁగొననా! యొకరుండ విరోధివాహినీ
ఘనతరభంగజాలకముఖంబునఁ నూరక పత్నితోడఁ జా
వన! యనిపాలుపోక నిలువ న్నతి డగ్గఱి చీటిఁజూచుచున్॥ 549

శా॥ "నాథా! లేదెడమింక యోజనకు, సంగ్రామస్థలి న్వైరిసే
నాధాటిన్ మరలింపరా దెగపున న్బైవచ్చుచున్నారు, స
ద్యోధుండెవ్వఁడు బందిఁజాఁదలఁచు? సద్యోలబ్ధమీదారి లెం
డీ!, ధైర్యంబున దుర్దినాపదల రండీ! ప్రౌఢితో డీకొనన్"॥ 550

చ॥ అనిసతిప్రోత్సహింప నిఁకనన్యముతోఁపమి గూఢమార్గముం
గొని పరదుస్తరంబుగను గొల్లెముతోఁ దొలివాయిఁగట్టి తెం
పున బిలముత్తరించి ముఖమున్బిగియించి తురంగమెక్కి దా
ఢున వనులెల్లదాఁటి యగడు న్గడియింపక యుంటమియ్యెడన్॥ 551

చ॥ అసహజవేషధారియగునా? యనిపించుచు నప్పుడప్పుడో
చు సురిగిపోవు దవ్వునన శూరుఁడొకం డొకకొంతమందితో
డసెలయ, సీతఁ డెవ్వఁడో! దడాదుడి నాఁడుపకారియైనదై
వసముఁ డతండెవండొ! విధివర్తనము త్తెలియంగ శక్యమే?॥ 552

ఉ॥ ఏకఁ జలించుపింజలయి యింతటనంతటఁజేరి గుంపులై
తాఁకుల నంతలోఁ నలుపుదాళు వహించుచు మూఁగి కాఱుపొ
జీఁకటులోయనన్ విషముచింది యొకింతన విచ్చుమబ్బుల
ట్లే కడ వీడి యేగు విధి లీలలఁ గొండలవంటిముప్పులున్॥ 553

చ॥ దిరిసెనపూవు నేవళముదేహము పూవొనలంటఁగందుఁ, బా
న్పరవిరు, లెండకన్నెఱుఁగ, దాఁకలికాకల ఘాకసోకరా
కరయికఁ గన్నుసన్నఁ బనులన్నియ గూర్చుచెలు ల్చెలంగఁగాఁ
బెఱిగినగోల యీయబల బిట్టువిపత్తుల కాగునట్టిదే!॥ 554

సీ॥ ఎలదోఁట నూయాల నెక్కుఁ గంపిలులేమ
యొగపునఁ దురగంబు నెక్కనేర్చె
నంబారికుదుపున కడరులొందెడిభామ
జవనాశ్వధారల శక్తి నేర్చె
నీరాటజల్లున నిలునఁజాలని శ్యామ
పరశరవృష్టిపాల్పడఁగ నేర్చె
వీణెతీఁగెలమీఁట వేసారునీరామ
నారిసారించు విన్ననువు నేర్చె
సరసరాజాన్నములె మెచ్చఁజాల దీమె
నీరసారణ్యభోజననియతి నేర్చె
విధివిపర్యాస మొకట నిప్పు్రహతనిడిన
నొక్కచో నిచ్చు నద్దిరా! యోగ్యశక్తి"॥ 555

ఉ॥ నా "నిటుపల్క న్యాయమగునా! మగనాలికి నాథునండ నే
గ్లానియు దివ్యసౌఖ్యమగుఁ, గాంతను బుత్త్రి సిరిన్ ద్యజించియుం
దానె యనేకకష్టములఁ దద్దయునాపదనొంది యేలిక,
న్మానక సేవల న్దనుపుమంత్రిగదా గణనీయుఁ డన్నిటన్॥ 556

ఉ॥ ఈదృశులందెకాదె ప్రజ కెంతయు బ్రాఁతిగఁ దోఁచుచుండు సృ
ష్ట్యాదిగ నింతకు న్భగవదద్భుతసద్గుణరాజి సౌఖ్యసం
పాదకదీక్షఁ, గానియెడ మానసమందనుకోని యీశుభా
పాదన మిట్లు చేకుఱుటనె భావిమహోదయసూచకంబుగన్?"॥ 557

మ॥ అనురాజ్ఞీమణిమాటకు న్బ్రెగడ "దైవాధీనము ల్దేవి! యెం
దును గార్యాంతఫలంబు, లప్పుడు తోడ్తో సిద్ధిసంధిల్లు, నె
గ్గనియట్లుండి ఫలించు పెన్నడవుగాఁ, గానుండినట్లె చెడు,
న్మనకు న్యత్నమె ప్రాప్తభుక్తియె సుమమ్మా! కృత్యము ల్జీవికన్॥"

క॥ అన నీమాటామాట
జ్జనపతిముఖు లాడుకొనుచుఁ జనుచుండ నట
న్వనమూలికాప్రభావం
బునఁ గోమటి తెప్పిఱిల్లి బోధమొనయఁగన్॥ 559

ఉ॥ చీఁకటిబొమ్మలోయనఁగఁ జిందఱవందఱవెల్గులోన నే
మూఁకలొ దూఁకునట్లయిన ముంజెయిఁగన్నులఁగప్పి తేఱి పూ
ర్వాకలనంబు బుద్ధి కెగయ "న్గడిదొంగల! యేమిలేదురా
నాకడ నింక"నంచు నయనంబుల విప్పియు విప్పనంతలోన్॥ 560

చ॥ "కలఁగకుమన్న! పెజ్జ్వరము కాయుచునున్నది కాయమంతట
న్దళముగ గాయము ల్తగిలె, దగ్గఱ మిత్రులెకాని కారుదొం
గలు, కదలంగఁబోకు"మని కట్లిడు భారవిపల్కుఁ బోల్చి యా
హాలునిలుకొంద "భారవిమహాశయులా! నతి నేను ధన్యుఁడన్॥561

చ॥ అని తనరొండినుండు విడెమాకులపోకలడబ్బి గొబ్బుగొ
బ్బునఁగొని, తాటిఁచీటి నటుము న్నటనుంచినదానిఁ గాన కే
మన మనసొగ్గ కుగ్గువడునానన మానసుమాన మానమూ
నినఁగని "బేరి! యోరిమి గణింపక నింప కెద న్వృథావ్యథల్॥ 562

క॥ కదలకు మెదలకు పదిలము
వదలకు కట్టడురు వదులు పడను చెదరుసు
మ్మదవదగదురక యొద్దిగినఁ
బొదల్చు మొదలుపీలు కొలఁదిపూఁటల నీకున్॥ 563

—♦ భారవి మాళవాధీశ్వరుం గనుట ♦—

చ॥ పదపడి నీయుదంతమును బల్కఁగవచ్చు"నటంచు మంచమొం
డదుకఁగఁజేసి దానిపయి నాథనపాలుఁ బరుండఁబెట్టి సా
గుదుమనునంతలో మొదటికూటువయు న్జనుదేఱ నొండొరు
ల్బదులుబహూకృతు ల్నెఱపి బాట వడి న్బయనించి యేగఁగన్॥

ఉ॥ చక్కనిదారియా నడకసాగఁగ? గుంటలుఁబెక్కుమబ్బులు
న్రక్కసగుట్టగొందులును. వ్రాలెడికంటకవృక్షశాఖలు
న్జిక్కుపొద ల్శిలాశకలచిత్రితభూములు రొంపిపట్టులు
న్మ్రుక్కడితుప్పలు న్గిరులుఁ గ్రూరమృగంబులు వారికావనిన్॥ 565

ఉ॥ "ఎవ్వరొ వింతవారు మనయిక్కలకెక్కిరి పట్టిమూతమ
న్గ్రొవ్వునఁ దంతువాయములు కూర్చెవల ల్వడిఁ జెట్లసందుల,
న్దువ్వలఁజిమ్మ పోటుసుడితో వనవాత, మరణ్యజంతువు
ల్దవ్వులఁ జుట్టుముట్టెఁ బెనుదందడికూతఁలు మిన్నుముట్టఁగన్॥ 566

శా॥ "నాసంతానములైన కేళివనసంతానంబులం దీడుజో
డై సౌఖ్యంబిడు కేళికూళుల సుపుష్పామోదమం దాడనా
నీసింగారికి హాయిఁగూర్ప ననువేదీ!" యంచరణ్యం బట
న్వ్బాసె న్వాగులనుబ్బఁజేసెఁ గలసొంపు ల్కాక వేర్వచ్చునే?॥ 567

చ॥ ఇనుఁ డుదయించుముందు దివి నిర్గున వెల్గులు చాళ్ళుగాఁ దన
ర్చునటుల, రాజురాక వని శోభగ వన్నెల కంబళంబుఁ బ
ర్చినగతి శాద్వలస్థలులఁ జిందినపుష్పొడి మెండుటాకు లం
దనిలుని నేర్పున న్దఱచులై పెనుబారులుగాఁగ నేర్పడెన్॥ 568

శా॥ ఏపె ల్మద్దులు మిన్నుబిట్టొరయుపెన్వృక్షంబు లాతాపిడి
న్దోృపాథోధి మథింపఁ జిందివడు చిన్కుల్ లాలుపుష్పాళి, పొం
గై పైఁబుట్టుసుధారసంబు పెనుజల్లై కారు మాధ్వీక, మా
భూపాలాధ్వులు మెచ్చఁ గూర్చె మదికింపుల్నింపు నాతిథ్యమున్॥

తే॥ గీ॥ "భారవీ! నీమపాండిత్యపటిమ మున్ను
కొంతచవిఁగొంటి కవితయుంగూడఁగలుగు

ననుటయున్వింటి, నేఁడి! సాయాహ్నరాగ
రంజితారణ్యరంగవర్ణనము వినుతె?"॥ 570

చ॥ అను నృపువేడ్క చెల్లఁగ "మహాసచివు ల్ఘనకోవిదు ల్కవు
ల్దినదిన మెచ్చుపూన్కి గడిదేఱినసేవలఁ గూర్ప వానివి
న్ననువునఁ దృప్తిఁజెందు నరనాయకుమ్రోల నలంతినైననా
మనవియు నొక్కయోగ్యపదమా! బహుమానితుఁడ న్నరోత్తమా!

చ॥ ఇనుఁడనుకొల్మిఁ దెల్పుసెగకెక్కినభూమి తదీయనిష్క్రమం
బున నుడుకీగుచో నెఱపుపాకల నెఱ్ఱన నల్పుమచ్చలు
న్దనుకువిధాన సాంధ్యరుచిఁ దద్దయు నల్లనఁ జెన్నొసంగు నీ
వనగిరిమేఘము ల్రుధిరవాహిని లంకలపోల్పుఁ దెల్పెడిన్॥ 572

ఉ॥ వానకు నెండకు న్జలికిఁ బాటునకు న్వసివాడుమేనుల
న్రేనికి రాణికి న్మనుధరించినసొమ్ములగుర్తులల్లె మి
న్జానకు పెన్వియోగరుషశంకలచే రుచులెక్కమోముచం
దాన సితాసితప్రభలు తద్దయు సాంధ్యరుచి న్దలిర్చెడిన్॥ 573

తే॥ గీ॥ "ఇనుని సప్తాశ్వుఁడని నుతియింత్రు జనులు
రంగులేకాని కావు తురంగమములు
ఋతమిది" యటంచు భూసమామృతపవనము
కిరణమేడాభలుగఁ జీల్చి గిఱపుఁజదల॥ 574

మ॥ తరుపత్రంబుల సందుసందులుగ సప్తశ్రీరుచిప్రాప్తకం
ధరసంధానితసద్వితానగరిమ ల్తళ్కొని రత్నప్రభ
ల్గిఱప న్బర్హిపురాక కుబ్బి వనలక్ష్మియోష నానాకళా
భరపుష్పాళి నివాళి స్వాగతముఁగూర్ప న్దాయుటయ్యెంగదా!॥ 575

శా॥ తేని న్గాననలక్ష్మి పత్రకపుఁబూరింఛోళిఁ బూజించె నె
మ్మై నేనర్చనఁగూర్తునంచు గిరి పద్మస్వామిసాంధ్యాభల
న్నానారత్నముల న్నదంబులను మిన్కన్జేయుచుండ న్నభం
బేనున్నాఁడ నటం చొకొక్కటిగ వెల్గించె న్వియద్దీపముల్॥ 576

ఉ॥ క్రుంకుదినేంద్రుడు వెన్క వెలుగుంగమి నుద్ధతిముట్టి చీఁకటు
ల్చెంకలఁదొట్టి పెన్బొడవుచిమ్మగ్రోవులఁ బీల్చి చిమ్మ మి

న్వంకలఁజెంది రాపడుప్రభాశకలాళి స్వకామరత్వము
న్నింకెఱనిక్కల న్దెలుపు నిండుఁగదోఁచెడి తారకాభలన్॥ 577
శా॥ అస్తార్క న్విడి వేయిపాయలుగ చాయ ల్తూర్పుమున్ప్రాకియం
ద స్తంగత్వమునొందెఁ జీఁకటులు ట్రోయ న్బోయెనోనాఁగ, నౌ
రా! స్తవ్యాచ్ఛమిళత్సుమేరురుచితో నావంక పెన్ముద్దయై
సిస్తై పైకొని రాజరూపమునఁద్రోసె న్డింభతామిస్రముల్॥ 578
చ॥ తొలఁగెద నన్ క్షమింపు పడఁద్రోయకుమంచుఁ దమంబు వీడు వే
నలివిరియ న్వశిన్దరిసి నమ్రత మ్రొక్కువిధాన నంబుదం
బులు తొలిదిక్కున న్బయికిఁబోయెడు రాజపదంబులూని వె
ల్వెలనగు వీరధర్మపృథివీపతికాళుల వైరులట్లుగన్॥ 579
ఉ॥ "పోయెనె నాథుఁడెందొ"యని ప్రోషితభర్తృక తమ్మి మోదముం
బాయుచు నంతలోఁ గెలన వాసకసజ్జకయైన కల్వకు
న్హాయిగ సోదరుండు దఱియంగఁ "దదీయసుఖాంతరాయమే
లా!" యనిడాగు నొత్తిలి దళంబుల నుజ్జయినివ్వలె న్నృపా!॥ 580
ఉ॥ నాయకుఁజూచి పేరురమునన్గలమచ్చ పరానురాగభో
గాయతనానులబ్ధకుసుమాంకముగా ననుమానమొంది
రోషాయితఖండితాత్వనికపత్వకషాయితనేత్రయాసతి
న్డాయఁగజంకి పంపు శశి నవ్యసుమానిలు రాయబారిగన్"॥ 581
చ॥ అనఁగఁ గవీంద్రువాక్యములనందలి వెన్నెలమీఁగడ ల్నువ
ర్ణనముల తేగడ ల్రుచిపరంపరల న్బెనుసొవ్వరిఁగూర్పఁగా
మునుకలబంటిమోదమున భూపముఖు ల్సుఖమొందుచుండ రే
వునుగన వేయుకూఁతవలెఁ బొల్చె నొకానొకకేఁక యాకడన్॥ 582
శా॥ "హా! యేమందురు రాయబారియనియా! యుండుండుడచ్చోటమే
లేయయ్యె న్దగురాయబారినగుదేనే, మాళవాధీశ్వరుం
డే యిచ్చోటనెసంగెనే న్దెలుపలేరే వార్త యీదూత కౌ
రా! యేమీ! మదదృష్ట మాడఁజను తీర్థం బిట్లుగా డాయుటల్॥ 583
ఉ॥ వందన మార్యమంత్రులకు భవ్యయశోధనరాజమాళి కీ
యుందఱ కార్యులార! మగధావనినాఁడను ముఖ్యమైన వా

ర్థం దెలుపంగవచ్చితిని రం"డన "నోయి! విదూషకా! వనం
బందు విరోధులుందు! రిది యామవన కేళివనంబు కాదుసూ!॥ 584

క॥ నాజననీజనకులు వీ
రే జాప్యముమాని వెల్వరింపు" మనుచు నా
రాజసుతుఁ డనఁగ "నాకడ
నేజాప్యము లేదు జప్య మించుక వెలయున్॥ 585

ఉ॥ అఁకటడస్సి కాళులవియ న్గతి ముందులఁగండ్లబ్రుస్సి పె
న్నీఁకున నుస్సురోయనుచు వీఁడిటురా శ్రమ లెస్సనెన్న కే
కేకలఁ గస్సుబుస్సనుట కేవలమైత్రికిఁ దావలంబొకో?
నాకు మహావనంబులను నాఁటినపాట్లకు దోహలంబొకో?॥ 586

మ॥ గడప న్నాఁటితినొక్క మ న్నవనిపైఁ గాలూని, పెల్లాఁకలి
న్గడప న్దేవ్వరునొంది చెట్లపయి కెక్కన్లేమగా తొల్లి, యా
గడపల్గాఁదగు పెగ్గుమీగడఁల చిక్క న్నుసక్కి, మీయొక్కయీ
గడపై లక్ష్యము నిల్పి రావలయుటంగాదే శ్రమన్బొక్కితిన్॥ 587

తే॥ గీ॥ దొడ్డయిల్లాలు నాభార్య దూరమెంచి
త్రోవబత్తెముఁగాగట్టె నావకాయ
గారె లప్పాలు రొట్టెలుం గమ్మనేయి
చాకిమూటంత యదికొంత సాకెఁబుంత॥ 588

ఉ॥ దైవముచల్లఁగా గుఱక తద్దయొసంగుటఁ గూర్కువేళలం
దేవనసత్వముల్దఱిమ కీవలనావలఁ బొంచి నిస్పృహం
బోవుచునుండెఁ గొన్నిదినము, ల్పిదప న్దగువూని యెద్దియో
నావరహాలమూటఁగొని సక్కె మదాగ్రహభీతచిత్తయై॥ 589

మ॥ గతి యిట్లయ్యెనె యంచుఁ జింతపడుచు "స్నష్టీఫలీ"యన్నసా
మెత సంకల్పముఁ బెంప 'నేఁడు వనభూమిన్ యుద్ధభూమి న్బొనవ
ర్చి తెగుల్మాపెద'నంచుఁ గోపగిలఁ గార్చిచ్చట్లు నారౌద్ర ము
ద్ధతి దిక్కీమలఁ గెంపుఁగూర్చె రవిభీతాహంబున న్దాఁగఁగన్॥ 590

ఉ॥ అంతటఁ గొంతకే పొలిచి యడ్డపడె న్దమ మట్లుకానిచో
నెంతఘటిల్లియుండెడినో యేమొనరించెదఁ, దింఢిపోయిన

స్జింతిల, నేమకూరుపులచింపితిదైనను పంచెపోయె. నే
సంతన రేపు నాసఖికి సమ్మతిఁగూర్చు జవాబునిత్తునో!॥ 591

చ॥ 'తరముల నచ్చివచ్చినది, దానికి నచ్చినదే!', యటంచుఁ ద
త్తఱపడుచుండ, దిక్తతులు దద్దఱిల న్జలరేఁగె గాంద్రుగాం
ద్రురుతులు ప్రక్కల న్వెనుక డొంకల ము న్వనమం దెడందని
బ్బర మయిన న్జలి న్వణకఁబాఱె మదంగము లానఁదప్పుచున్॥ 592

మ॥ అదిగో! అడ్డమురాకుఁ డాగుఁడు మదీయస్థైర్యగాథ న్వినన్
మది చుల్కన్విసువుం గనంబఱచు టేమర్యాద? నేకాకినై
యెదురేలేనిప్రతాపమూని, తటమీరేయున్న మేల్మేల్భళీ!
పదిలం బంచనకుందురే? చనుఁడి త్రోవన్దెల్పుదు న్సంగతుల్॥ 593

శా॥ ప్రజ్ఞాహీను లసంస్కృతు ల్జడులు వీరమ్మన్యులేమైనఁ గా
లజ్ఞత్వంబు హుళిక్కియాటఁ దనువుల్లావైనఁ జెల్లెక్కఁగా
యజ్ఞంబంత ప్రయత్నమూనెదరు, హెచ్చా! కొమ్మలన్ దాఁగుట?
ల్ప్రజ్ఞంబాయక నేనో యోగనిరతి న్బన్నుంటి నట్లొంటినై॥ 594

తే॥ గీ॥ తెప్పపాటుఁగుదించి నిర్ణిద్రవృత్తి
విగతజీవుని శేవ నూపిరిబిగించి
చెవులరిక్కించి డాల్చాటుచేసికొనుచుఁ
గత్తి కయిఁదాల్చి యేనట్టు లొత్తగిల్ల॥ 595

ఉ॥ చీఁకటి ముద్దకట్టుకొని చేతనమై వడిఁ జెంగనాలతో
నాకడ కేగుదెంచెనన నల్లనివెంట్రుక లెల్లనిక్క భ
ల్లూక మొకండు చేవిసరులోపల గద్దెబిగించె నెప్టై
దూఁకునో యంచు కత్తిగుఱితోఁ సరితోఁపిక నేనటుండఁగన్॥ 596

తే॥ గీ॥ తోఁక జాడింపు చిఱుగుబ్బుతోడ దరియు
చుండె నాప్రక్క నొకపులి జ్యోతులైన
కనుల మిణుగురు ల్నిగుడ నాకనులు మగుడ
మగుడఁ గనువిప్ప రెండేకమగుట తోఁచె॥ 597

ఉ॥ చీఁకటివెల్గున న్వెలుఁగు చీఁకటిచేఁ జెడునంటఁగంటి ని
ట్లీకడ రెండునుం జెడక యేచిపెనంగెడు సత్యమేదియో

నో కడఁగాంతునం చటుకనుంగొనుచుండఁ గ్రమక్రమంబుగా
భీకరమయ్యె పో ర్పొరి గుబేలుగుబేల్ధ్వను లుప్పతిల్లఁగన్॥ 598

మ॥ పులి నాపైకుఱుకంగఁజూడఁ గడుఁ దెంపుంబూని రానీయ దా
యెలుఁ గేనాఁటిదొ బాంధవంబనుచు నూహింపంగ నామూటతో
టెల మా టాదకువచ్చె, నానెనరుపాటింపౌర! యసం చెన్నులో
పల మువ్వన్నె మెకంబు భల్లుకము ద్వంద్వం బెచ్చె నంతంతకున్॥599

మ॥ చఱపు ల్తప్పఁదొలంగుట ల్చఱచుట ల్చాలించుట ల్బిట్టుగా
నఱపుల్వాటిల దూఁకుఁట ల్మడుఁగుట ల్వ్యాపించుట ల్పొంచుట
ల్కలియన్డాయుట లూఁగిచెంగుటలు ముంగాళ్లూనిత్రోపాడుట
ల్పఱవన్బైబడుట ల్వెనంగుటలుగా వర్తిల్లెఁ బో రచ్చటన్॥ 600

ఉ॥ పైకొనెనెల్లు బిట్టొడిసిపట్టెగళం బిఱుచేత నొక్కి, "భ
ల్లూకపు పట్టన న్వినికి లోచనగోచరమయ్యెనాఁడు, పె
ద్దీఁకుల వ్యాఘ్రము మేమియొనరించిన మానదు పీకెనొక్కుట
ల్గాకొనె మృత్యు వాపులికి ధన్యుఁడ నంచెద నెన్నులోపలన్॥ 60

మ॥ అది సంతోషముపొంగొకోయనుచు నేనాందోళనంబొంద, లో
నదిగుల్వాఱ నమాంత మంబరగతి న్వ్యాలోలతన్జెంది "తి
య్యది యే"మంచును సంబళించుకొనుమధ్యంబందె యేనుంగుమ
పుదెసన్గూలితిఁ గూలి మేల్దినములబ్బో! యంచు నుప్పొంగుచోన్

ఉ॥ బొబ్బలు కాన బూరటిలె బోరనఁ బర్విడసాగె దంతి యా
గుబ్బున సింగము ల్కదలె, గూఢగతిన్గొని మెట్లుదూఁకునో
బొబ్బమెకంబటంచుఁ దలపోయుచునుండ ద్వీపంబుదారిలో
నబ్బినవృక్షశాఖ గతియయ్యెఁ జివాలునఁ బైకిదాఁటఁగన్॥ 60

ఉ॥ దైవకృతంబుగా నెటులొ దాఁటితి వృక్షముపైకిఁ గ్రిందికిం
బోవ మనుష్యులేరయినఁ బొల్చినదాఁక నటంచు రేఁబవ
ల్లీవనవృక్షరాజి వసియించితి నేఁటికి రెండుపక్షము
ల్భావర! యీమహాత్మునుడి పొల్చుట వచ్చితి మిమ్ముఁగాంచితి

శా॥ దూతన్గాని మెడ నగేంద్రుడుయి నెందు న్నావరిగాసాగి మెం
తోత్సేద్ధతిఁ ద్రుంపనే మెదిరి శార్దూలాదిసత్త్వంబుల

న్యాతప్రీతిఘటింపనే వనముల నొ్బ్బరా సమగ్రంపుని
క్ష్మితిన్గొల్పనె? యేదియో గడిచె, పెంపే తన్ను తానెన్నుటల్?॥605

చ॥ అనిన యశోధనుండనియె "నాపుడ! మే, ల్పులినాకిపీడె, హ
స్తినినిగుడంగనబ్బె, వికసించె నదృష్టమునీకు, నిన్నుపీ
డి నిమిషమైననేను ననుడించినసీవు మనంగనేర్తు మే?
కనులకుఁదోఁచినాఁడవుసుఖంబుగఁ గృత్యము బోధసేయుమా"!606

మ॥ అన శ్రీభట్టువచించెఁ "దెల్పఁదగువృత్తాంతంబుసర్వంబుఁ దె
ల్పనితం, డామగధేశ్వరుండు విరతి స్వీర్యంబుఁజాలింప దు
ర్జను లారాజ్యముకై పెనంగుటలు వార్తం దోఁచుముఖ్యాంశ మే
మి?నిజంబంతియొకాదె?"నాఁ బ్రణిధి" స్వామీ! పోల్చితీర్పాటిగన్

క॥ గోడలకు జెవులుండును
గోడలె లేకున్నఁ జెవులకు నావేవీ?
గోడలవియేల జెవుల
న్వాడంగల పెక్కు రింపువఱలుచునుండన్. 608

క॥ అఱవిడచిపల్కినా రం
దఱు మనవారనెడి గట్టి నమ్మకమునరె
న్గొఱఁదెల్పుకొందు వినుఁ డ
క్కఱ కెఱుపీ లటుచరింపఁగాఁదగుఁ బిదపన్. 609

—♦ భారవికి భార్య మగధరాజకుమారితోఁ జేరుట తెలియుట ♦—

క॥ శ్రీమగదాధీశకుమా
రీమాణిక్యంబు తగుపరీవారముతో
నేమంబునఁ గాశీయా
త్రామంగళకౌతుకమునఁ దఱలె సువేళన్॥ 610

ఉ॥ కాలుబలంబుకొంత తురగంబులసేనయొకింత కొల్చిరా
బాలిక తూలికాస్తరణభాసితభాసితరత్నభూషితాం
దోళికజాలికాకనకతోరణచారణనర్తనక్రియా
పాళికి మేలికన్నవ ప్రభల్తోడఁ బాలకి సాగెఁ జాలికల్॥ 611

క॥ కెలఁకులఁ జెలికత్తెలయం
దలములు దళములుగ, ముందు దళములు వెనుకం
దలముకొను దండుగా మే
ల్పొలములు నగరములు దాఁటిపోవుచునుండన్॥ 612

క॥ దళవాయి నగుచుఁ దగువిడి
దలవాయిదములను, వాయిదాల్కొల్పక, కో
వెలకోవెల వెలయించితి
వెలకొంచింపక ప్రపంచవిభుభజనంబుల్॥. 613

శా॥ కాశిక్షేరి ప్రపత్తిమైఁ దొలుత గంగాస్నానముల్చేసి వి
శ్వేశు న్గౌరిని డుంఠి విఘ్నపతి నాయీదేవుల న్గొల్చి మే
లౌ శాల్యన్నము లంబరావళులు నీయ న్విప్రబృందంబు ము
క్తాశ న్దీవనలీయఁగాఁ, జెలఁగుమధ్యంబందుసోత్కంఠయై॥ 614

క॥ ఒకలేజవరా ల్రాసుత
నికటంబునఁ దెంపు నయము నిగుడ నిలిచి "దే
వికి నావిన్నపమున్నది
యొకటి తెలుపుకొందు సెలవనొసఁగిన"ననినన్॥ 615

క॥ ఆచందం బాయందం
బాచనవుఁ బికో క్తిఁదెగడు నానుడియొసకం
బాచదు రాకర్షింపఁగ
నాచామకు సెలవ దొరకెనా!' యననేలా!॥ 616

శా॥ నిగ్గాబ్రాహ్మణి, లక్ష్మిపేరఁట! భవానీభట్టరేమాముఁ జే
యొగ్గుంజేసెనొ బందిగా మగధరాజేంద్రుండు కొన్నాఁడఁ టా
వగ్గున్వృద్ధును వీడుచే తనకుసర్వంబంట యాకోరికన్
మ్రొగ్గునిత్తముఁజూపి రాజసుత, "కూర్తు న్రమ్మనాతో"ననెన్॥ 61

క॥ అట్లనుకొనుచుండిన య
ప్పట్ల మిహిరకేసలుఁడు హన్నుపతియఁట మంత్రు
ల్జెట్టు గొలువంగఁ బలుము
చ్చట్ల హరుని దరియువాఁడు చకితాస్యుండై॥ 61

క॥ ఆపడు చెవరని మగధ
క్షితిపుత్త్రికగా నెఱింగి చిత్తముఁ గాముం
డూఁపఁగఁ దద్గతనేత్రుం
డై పరువపుమదుకు కడఁకకామెతసేయన్॥ 619

చ॥ "శిబిని దధీచిఁ గర్ణు "నిసిసీ!"యని, కల్పకకామగోవువే
డబముల నవ్వి, చంద్రికలడంబున నుత్సవకృత్కటాక్షదీ
వ్యబహుదయామరీచికల నందఱకోర్కులఁదీర్చు రాణిసా
హెబ! మిహిరుండు నమ్రతఘటించుజోహారిదె స్వీకరింపుమీ!॥620

శా॥ వింటి న్వీనులవిందుగా మునుపు నీవిఖ్యాతసౌందర్యము
న్గంటి న్గన్నులఁబండువై వెలయఁ దద్గాఢప్రకర్షంబు నా
కొంటి న్జూడుము మారుకోత్తలలతాఁకు ల్మేనునుబ్బించె నీ
తంటల్వోయఁగఁ బ్రేమభిక్షమిడుచు న్దక్కింపుమాప్రాణముల్"॥621

ఉ॥ తెంపరి, రాజు, మోహబహుదీపితమానసుఁ, డౌచితి న్విచా
రింపగలాఁడె!, యాతనిపరీక్షకు రాసుతతప్పు నెవ్వ రా
ముంపున గోచరింప, రతిమోహితు నాతనిఁజూచి సత్కృపా
సంపదనించుచూడ్కి నెఱసంజరవుల్కిన మోముకప్పుతోన్॥ 622

చ॥ చెలులకుఁ జేయివీచి నడిచె న్మగధాత్మజ హాన్నుఁ డడ్డమై
"కులుకుమిటారి! నీకనులకు న్దొగరెక్కిన నాయెడంద, గా
కలు కలుషంబు రేఁపెడిని కన్గొనుదేనియుఁ జీల్చిచూపుదు
న్బలుకుము నీసుధామధురభాషల నాయెద శాంతిఁగూర్పుమా!"॥

మ॥ అన లక్ష్మీసతి తాసతీప్రతిభ నధ్యక్షించి "తేఁడా! మహే
శుని యాస్థానము, కామహారియతఁడంచు న్గేవలంబైనభ
క్తి నె తత్సేవ లొనర్తు రింపు జనము ల్క్షేమంబుకై, రాకుమా
రి నిట్లుగ్గాఁ జెనకన్దలంచుట మహారిష్టప్రదంబౌఁజుమా!॥ 624

చ॥ అన మిహిరుండు మాటి కపహాస్యముఁజేయుచుఁ మేల్ఛళారె! రే
వునకగు మాసివాయనపుబోటులపోటులమాట! లీగరా
సిని దొలఁగింపుఁ డంచుఁ దనసేవకుల న్గనుఁగీటునంతలో
ననె మనవారలడ్డుపడిన న్జరిగె న్దుములంపుపోరటన్॥ 625

క॥ ఆసందుల నేసందుల
నోసరిలెనో రాజపుత్త్రియు బ్రాహ్మణియున్
గాసంతపాలకు వగుపడ
దే సేయఁగ నెదియుఁదోఁప కేగితిఁ బురికిన్॥ 626

మ॥ మగధ న్గాడను జాడకానఁబడ దెమ్మాన్కిట్క న్నృపుం జూతు నే
వగ నస్వస్థున కీవిచారకరమా వార్త న్సమర్పింతు నం
చుఁ గడు న్జింతిలి మంత్రికి న్దెలిపి యచ్చోనిల్వ కేతెంచినాఁ
డఁ గడంక న్నిముఁగాంచి తెల్పుకొను వేడ్కన్, న్గృత్యమూహింపుడీ!"॥

వ॥ అని 'చావుకబురు చల్లఁగాఁదెల్పవలయు'ననిన సామెతగా ముగింప నాలికయి భారవియు రాజ్యవిప్లవంబునకై శ్రీభట్టును జింతించుట సహజమే. యశోధర్ముమొగంబు నేలాకో తీవ్రవిషాదమలము కొనియె! సామాన్యాతీతంబగు కారణంబెద్దియేని నుండియుండునా? ఎవరెఱుంగుదురు. ఆవిచారము రాజపుత్త్రికావిషయికమెమో! యోజనానిమగ్నులై నడకసాగమి నందఱప్పటికి నిల్తమని తగు నునికిపట్టునఁగూర్చుండిన యెల్లరనుద్దేశించి మంచెపయి విశ్రమించి యున్నధనపాలుండు "స్వామీ! రాట్పుత్త్రియు లక్ష్మాయమ్మయుం గనుపింపలేదనుచున్నారా! కాశిలో జరిగినసంఘర్షణమున కనంతర గాథనేనెఱింగినది మనవిసల్పెద నాలకింపుఁ"డని యిట్లువచించె. 628

క॥ తలకడచి మిహిరుఁ డేపున
నలరాట్పుతకోఁటకు దాఁటునప్పుడు లక్ష్మి
లలన యొకకోల గరిడీని
మెలపునఁ గాళులనుగొట్టి మిహిరుం గూల్చెన్॥ 629

ఉ॥ కూలెడునప్డు నెన్నొసటఁ గుద్యముతాఁకుట వాఁడుమూర్ఛలో
సోలినఁ జెంతల న్బడినశూరుల వస్త్రములన్గ్రహించి యా
యేలికసాని తాను నొకయింతనఁ బూరుషవేషధారులై
తేలికగాఁ దొలంగి పఱతెంచిరి నేనివసించుపల్లెకున్॥ 630

క॥ అదియే లక్ష్మిబాయియు
నుదయించినయూరుగాన నొయ్యన నస్మ

త్సదనమున విడిదిఁ గూర్చి
న్మదమున నాభార్య బత్తెము ల్సమకూర్చన్॥ 631

క॥ అంతకు నెలక్రిందటనే
సంతకు బేరమునఁ జనెడిసార్థముతో గ్రా
మాంతరముపోయి వచ్చితి
నింతిపయి న్మరులురేఁగ నింటికి నాఁటన్॥ 632

క॥ అదిరేయి జాముగడిచె
న్మదిత కట హాతాన్మదంబు మొనయింపగ నా
గది నల్లనల్లఁజేరితి
మదిఁ గౌతూహలము పెరిగి మల్లడిసేయన్॥ 633

క॥ అల్లంతఁజూడఁగా నా
యిల్లా లొకచక్కనయ్య యిఱుచేతులలోఁ
గొల్లఁగొనుచుండెఁ గౌఁగిలి;
నుల్లాసముపోయి కోప ముదుటునఁబెరుగన్॥ 634

ఉ॥ "ఱకటె! నిబ్బరంబటవె! రచ్చకు నీడ్చెదఁ జూడు"మంచు న
య్యంకణ మే న్వడి న్విడుచునప్పుడు దోవతికొంగు కాలిలో
నింకెటఁజిక్కి రొండిభరణి న్ధరణి న్దొరలించెఁ దద్ధతి
న్గొంకి విడంగ లోపలివి గొబ్బున నిట్టటుఁ జిందిపర్వఁగన్॥ 635

ఆ॥ పడియె వానితోడ భారవి మున్నుతా
కట్టుగాఁగ నిడిన కడిదిశ్లోక
మమరు తాఁటిచీటి, యద్దాని నీక్షించి
నంతఁ గొంతశాంత మంకురింప॥ 636

* క॥ పనిఁ దొందరపడి చేయం
జనదు; వెట్టికడఁక గొప్పసంకటములకు
న్గని; తరిచిచేయువానిని
గొనమువలచుసిరులు తామె కోరి వరించున్॥ 637

---

* సహసావిదధీత నక్రియా మవివేకః పరమాపదాంపదమ్
వృణుతేహివిమృశ్యకారిణం గుణలుబ్ధాస్స్వయమేవ సంపదః॥

వ॥ అనునది స్ఫురణకుం దెచ్చుకొని॥ 638

శా॥ 'దైవాధీనతఁగాక యిట్లెమటఁ బ్రత్యక్షంబు కానోపునే
చేవత్తేరెడియీగురూక్తి నిజముఙ్ శీలింతుఁగా'కంచు నా
త్రేవ న్నిల్వఁగ లోనికి న్బఋగువార్తఙ్ యోధ యింకొక్కఁ 'డా
రా! విడ్డూర'మటంచు నేఁదలఁచుమధ్యంబందె వాఁడిట్లనెఙ్॥ 639

శా॥ "దేవీ! యేదియొ దండువచ్చె మది సందేహంబు హెచ్చె న్దృతం
బేవైపైనఁ జనంగమే"లనిన నొక్కింతేనిభీతిల్ల "కిం
దేవర్తింత"మటంచుఁ బల్కెఁ బ్రథముం డీవింత కబ్రంబు లో
లావై కృత్యము తోఁప కేనచట నిల్వ న్బల్కె నాయాలిటుల్॥ 64

శా॥ 'ఓలక్ష్మీసతి! యోయశోధర! భయంబొక్కింతలే దంతగాఁ
గాలంబే వ్యతిరేకమైనయెడ భూగర్తాథ్వమేయున్న దిం
దేలాఁతు ల్వరికింపలేని'దన నేమీ! వీరలాఁడంగులా!
యాలక్ష్మీసతి భారవిప్రియయ! యేలా యిట్టిమార్వేషముల్!॥ 64

ఉ॥ మాగధి యీయశోధరసుమా! యని పోలిక తెల్పుచుండె నా
నా? గతి యున్కి రాజసమున న్విలసిల్లెడు, నొంటి నిట్టురాఁ
గాఁగతమెద్ది? కాఁదగదు, కన్గొనెద న్నిజమంచు లోనికే
నేగఁగఁ గాంచి లక్ష్మి "యవునే! ధనపాలుఁడె! చూడుమాగధీ

శా॥ సంతోషం బెద మేన గంతులిడ లక్ష్మీయమ్మకు న్రాణి క
త్యంతోత్పాదితభక్తి మ్రొక్కులిడి "ధన్యంబయ్యె నాజన్మము
న్సంతానంబు నిశాంత; మేనరిగి సేనావర్తమానంబు నా
ద్యంతంబు న్గనివత్తు ముప్పయిన నాహా"యచు వాపోయెదన్॥ 64

మ॥ అదియేగుర్తుగఁ బొందు నేల తెరువం దావంక నేర్పాటుతో
నెదురాదు న్బయికృత్య మవ్వల విచారింపంగనౌ నంచు, స
మ్మదకౌతూహలసంభ్రమంబు లెడఁదన్మట్టాడ నిల్వేడు-చోఁ
గదిసె న్యోధుఁ డొకండు వాకిలిసమక్షంబందు నుద్వేగియై॥ 64

మ॥ "ధనపాలా! మగధాత్మజ న్మిహిరుఁ డుద్యత్కామనస్వాత్ముఁడై
చెనకె న్గాశిని విశ్వనాథుగుడి, నాచేడె న్గనంజాల మెం

దునుగాలించిన భారవిప్రియయుఁ దద్గోపాయనోపాయమై
చనెనంచు న్వినవయ్యె నామెకిదియే జన్మస్థలంబౌఁగదా!"॥ 645
ఉ॥ "ఇక్కడఁగూడఁజూచి మఱి యేగెద దాడిగ హూన్నృపైకినా
రక్కసతాల్మివచ్చితిని రాచకొమారిత నామె తెచ్చెనే
యిక్కడి, కీవెఱుంగుదువె యీగడ?" నా గుఱితించి భక్తితో
మ్రొక్కి "మహాశయా! గృహముమోసలలోనికిరండు తెల్పెదన్"॥
మ॥ అనికొంపోయి సమస్తముద్దెలుప యోధాగ్రేసరుం డాతఁడీ
లను బాదాతికులందురాఁ ద్వరగ స్త్రీల న్బల్లకీలందుఁగై
కొనియేగె న్నను వీరధర్మనృపుదాఁగుజ్జోటులద్దెల్పి పో
మ్మని, యేనట్టులె యీవని న్దిరిగి చోరాక్రాంతిమైఁగూలితిన్ 647
మ॥ మగధానీకిని నిల్చెఁగామ్యకవనిన్ ధూమ్రనాయకుం డంతఁజే
రఁగ సేమంబగుసంచుఁదెల్పె భగవద్రక్షాబలంబిట్లు చి
త్రగతి న్జేర్చెడి సంకుల న్మనల; యుద్ధస్పర్ధహూన్నుండు తాఁ
కఁగలాడంట యశోధర న్ధర నెద న్గాంక్షించిశీఘ్రంబుగన్॥ 648
ఉ॥ "ఆతనిపేరు గోప్యపద మన్యులకేరికిఁ దెల్పసంచుఁజే
సేతుల బాసనిచ్చితిని చేయఁగఁదగ్గది చూడు"డన్న యా
ఖ్యాతము కొంతసే పచట నందఱు మానులఁగానొనర్చెఁ ద
ర్వాత నమాత్యశేఖరుఁడు పల్కె నభీరగభీరవాగ్ఝరిన్॥ 649
ఉ॥ "అల్లుడుసాగిన న్మగధ యాతనిచేతిద ప్రేమసాకుగా
నల్లుఁడుగాఁగఁజేరి యొన రౌతరి రాజ్యము నాక్రమింపగాఁ
దొల్లిఁదలంచె రాజసుతతోఁచుట ప్రేమము నుల్లమందు సం
ధిల్లె నిఁకాతఁ డేయుపమ నేన్దనకోర్కెఁ గొనంగఁజూడఁడే!॥ 650
ఉ॥ నాఁడటఁ గాశి నాలయమున న్జరిగించిన పోరితంబుచే
వాఁ డిఁకసామముంగొనఁ డవశ్యము నాల్గవ తెన్నె చేకొను
న్రేఁడును రోగియాట నెదిరించుటయుండ దటంచు నమ్మి క
న్గోఁడితరంబు పోయి యటగోడునమున్గ నమాత్యుపోటునన్॥ 651
శా॥ బాలాదిత్యనృపాలుఁడన్న నెదలోబల్లెంబు హూన్నాళి క
క్కాలు న్ధిక్కరణంబొనర్పఁదగుప్రాగ్భారు త్తదాయోధకు

ష్ఠైల న్సేనలఁ బన్ని గెల్వఁగొన నెంతేదక్షు లానాయకు
ల్మెలాఁబో మిహిరుం డటంచనిన దొమ్మిన్మాక! రెమ్మెత్తునే॥ 652

తే॥ ఆయశోధరయాచూకి కందు నిందు
ముందు ప్రయతించుఁగావున మొనసివడిగ
జరుగనగుముప్పు లేదు మార్తుర ప్రయత్న
మెట్టిపాటిదో మనకు ముందెఱుకవలయు॥ 653

క॥ నారాయణభారవిభ
ట్టారకయుగ్మంబు కడుకడంక మిహిరుయు
ద్ధారంభ సంభ్రమం బే
తీరో యెఱఁగి మగధ కరుగుదెంచిన మేలా॥ 654

క॥ భూరమణుఁడు వనదుర్గముఁ
జేరిక రాకొమరుతోడ సేనలతోడ
న్వారించి హన్నులు మగధ
ద్వారముదెస వెడల వెనుకఁదగిలిన వీలా॥ 655

క॥ ఏ నీధనపాలునితోఁ
బూనిక రాసుతను నెమకఁబోయెద మనయీ
యానిశ్చితముల నాభూ
జానికి వీరబలుఁ డెఱుక సలిపెడుగాతఁ॥ 65

క॥ ఎప్పటివార్తల నప్పుడె
యిప్పృథివీశునకుఁ దెలుపు టెల్లరవిధి యం
చప్పారుఁడు వచియించిన
నప్పటికందఱును "వల్లె"యని మఱునాఁటఁ॥ 65

—♦ భారవి నారాయణులు మిహిరు దర్శించుట ♦—

మ॥ వనదుర్గంబును జేరి యెవ్వరికి నేర్పాటెట్లో యారీతి సం
తనతో సాగిరి వారటు; న్మనకథానాధార్ధ్యము న్గొంటయే
మనకృత్యంబగు; భృత్యులు న్సఖుఁడు సంబంధించి తోరా వడి
ఘనుఁడా భారవి చేరె నుజ్జయిని నుత్కంఠ న్గళ ల్నిక్కఁగఁ॥ 6

వ॥ అన్నగరంబు తిన్నదనంబు నెన్న నన్నలువకైనఁ గడిందిగదా! గదాధరహారిసవనజవనపవనప్రవణభవనాగ్రచుంబితమ్యవనంబై, యిరుకెలఁకుల సరిపొలపులఁ బలునిలువులఁ బలుకొలఁదులఁ దలవెలుఁగుల మిలమిలనుమేడల మెలిసొలయనిజాడలచాలుపులఁ జాలమెలపుల బలిసికొలువ నేమొలుక నెత్తఁదగునునుపులసాపులంబొపలం జూపఁనోపువీథుల గభీరంబై, భీరహితశూరహితసారయుతఘోరపృతనాయోధనసాధనాసాధారణబోధనసాధనరవచకితపతంగకులసంభ్రమకలకూజితసంకులకలకలరావచలనచాలనవిలసితంబై, సితసికతాస్థలాలోలతరంగపాళీమృదురవానుసారిగీతికానిరతమదాళీనివహానిరంతరచుంబితనాళీకకళాప్రతిస్పర్ధినయనలీలావహాసుందరాళీనివహాళీకానురాగసమ్మోహితకాముకకులంబై, లంబులైనతావుల నింబులైనతావుల కంబునొసఁగుపండుల నొడికంబుపొసఁగుదండల నండజముల పిండులఁ గడుదండిముదము నిండొసంగు మెండురకపుఁదోఁటల నీటుమెఱయువాటంబై, శాకప్రభృతినవరత్నపర్యంతనిస్తులవస్తువిస్తారితాపణపణ్యాజీవపుణ్యజన క్రయవిక్రయాలాపసల్లాపాపలాపవిలాపప్రలాపముఖరితంబై, బహువినోదభరితంబై యుండు నందు॥ 659

ఆ॥ పగటివేషధారిపటిమ మేళముఁగట్టి
దినము నొక్కవేషమునుగఁ దిఱుగు
భారవియును సఖుఁడు నారాయణుం డొక్క-
నాఁడు మిహిరురచ్చ కూడుసరికి॥ 660

తే॥ సంతరించినకృష్ణవేషంబు సత్య
వేషమును జూచువారి కావేశమొసఁగ
సుస్వరాపస్వరాలాపశోభితముగ
మిహిరుకొలువుఁ బ్రవేశించి మిసిమినించి॥ 661

క॥ జనతాకర్షణమునకై
మును తాళమృదంగరాగములఁ జూపినతాం
దనముల మాని సకలమో
హనగమకంబులు చెలంగ నాసభలోనన్॥ 662

(ఎల్లరు)ద్వి॥ జయ! వేదమార్తాండ! శాస్త్రప్రచండ!
జయ! వాదవేదండ! సాహిత్యశౌండ!
జయ! విద్వదుద్దండ! సత్కర్మఠుండ!
జయ! సద్యశఃకాండ! శాసితాజాండ!.
నినుఁ జెప్పిగా ధారుణి నెప్పవలయు
ననుపమ దివ్యక్షమావేశనియతి
నినుఁ జెప్పిగా సోముని నెప్పవలయు
ఘనసుధావికిరణక్రమవాక్యసుగతి
సత్యహరిశ్చంద్ర! సౌఖ్యదేవేంద్ర!
మత్యమరాచార్య! మానితౌదార్య!
నిత్యాగ్నిహోత్రవర్ణితసత్పవిత్ర!
ప్రత్యగ్రగురుపీఠపరవస్తుసార!
సౌభాగ్యసంపన్న! సర్వప్రసన్న!
శోభాసమాపాదిశుభదివ్యగేహ!
శ్రీభూకళాచ్ఛిన్న సేవ్యాగ్రవర్ణ!
లాభనిత్యాసన్నలక్ష్మీసమూహ!
స్తవముగాదయ్య! వాస్తవము మన్నీఁడ!
భవము ధన్యత్వసంభవ మోర్పుకాఁడ!
చదువులలో సరస్వతి నీవకావె
పదువురిలో దయాపరుఁడీవకావె
జయజయ! శ్రితపారిజాతపాదపమ!
జయజయ! జోహారు! జయధీనిరుపమ!॥ 663

కృష్ణ॥ ఔనోయ్! సచివాగ్రేసరా! మాకీర్తి దిగంతవిశ్రాంతమగా జేసి గితివా! 664

హాస్య॥ అయ్యో! మనకీర్తిఁ గనకేమి? దానకర్ణులగు వారియశఃప్రసార మేడ? తస్కరాగ్రేసరులనఁదగు మీపేరు పెంపులేడ? 665

సీ॥ దుర్దమకర్దమస్తోమంబు తమకీర్తి
తోఁబుకునీరము వారిదొడ్డయశము

కటికచీఁకటిముంపుపెటుకు మీాపేరుపెం
పతిదీప్తమగు వారిదౌప్రతిష్ఠ
దొంగదోపిడిముచ్చుతోఁ దూఁగు మీాహెచ్చు
స్థిరసత్వభము వారిదివ్యగాథ
దేహియం చడుగ సందేహింపరుగ తాము
దానకల్పకదివ్యతరులు వారు
నీటఁ గంబాన నడవిలో నిలిచి డాఁగు
భీరుతాస్ఫూర్తిఁ గలిగినవారు మీారు
సకలలోకంబులను నిండి సాగి వెలయు
ధైర్యదానప్రతాపబాంధవులు వారు॥ 666

వారికీర్తిముందు తమకీర్తి నిలువలేమి దిగంతములనే విశ్రాంతమైన
దగుట దిగంతవిశ్రాంతమనియు ననవచ్చు॥ 667

సత్య॥ అట్లనియెదవేల ? 668

సీ॥ అన్నిటం దేలికయైనగాలి నివిష్టు
లైయుంెటె మిగులనిండైనయునికి
గాలిమేయుచు నెంమఁ గదలని పెనుచిల్వ
పవళింపుసేవకుఁ బట్టుపఱుపు
పాముల న్భక్షించు పక్కిగాఁ డెకిరింత
పారువేటలను సంబర మొసంగ
పఱులఁ దిను పిల్లివంగడంబునఁజేరు
పులినెక్కి సోదరి పోవుచుండు
నసలె తనుకాంతి నీలిమ మందులోన
హృదయమున మచ్చపొడ చెప్పనేల నింక
వీరిగొప్పతనంబును బారుబూరు
సేసికొనఁ బుత్త్రిఁడగు నల్వకే సరిగద ! 669

కృ॥ అట్లుకాదు. 670

సీ॥ అర్ధనారీశుఁ గాదని బహున్నారీశ్వరత్వ మందితిని

హాస్య॥ చౌర్యంబుకొఱకె! (లేకుండ నింతకాపుర మెట్లుజరుగు)

సత్య॥ అర్ధనారీశుఁ గాదని పూర్ణనారీత్వ మందికొంటిరి
కృ॥ సుధాహరణమునకె.
హాస్య॥ అర్ధనారీశుఁ గాదని వాని తమిఁ బెంచి యాలివైయుంటి.
కృ॥ హాస్యంబు కొఱకె.
సత్య॥ అర్ధనారీశుఁ గాదనిగా తదాశ్రితు నారివై చంపితి
కృ॥ ఉన్నమనమునకె.
హాస్య॥ అర్ధణాకైన పాల్పడునట్టివాఁడ వైతి విప్పుడు
కృ॥ జగమునత్సవాళికొఱకె
సత్య॥ బాగు మీయొప్పు మీకె సంబరముగాక !
కృ॥ నా ముదము సృష్టికెల్ల సంతసముకాదె॥ 671

హా॥ తే॥ పగటిభాగవతులమండి! భాగవతుల
భాగ్యములఁ బంచికొనఁ దొలిభాగవతుల
మండి, భాగవతులమెకా దఖిలవిద్య
లందు మొదలండె నందినామండి దేవ! ॥ 672

ఉ॥ గుప్పితిమా సుగీత! 'మిదిగో!' యని మోళ్లు చిగుర్చుఁ దర్పుగ
జెప్పితిమా కవిత్వము! నశేషవిశేషచమత్క్రియాఢ్యమా
విప్పితిమా సుహాస్యరసవిస్తృతిఁ! బొట్టలు చెర్వులై చను
న్దప్పితిమా! భరింతుమెటొ తావకగుంఫితమాషచక్రముల్॥ 673

ఉ॥ గానకవిత్వహాస్యములెకావు పఠించితి మెల్లశాస్త్రము,
లూనిక మమ్ముఁ గెల్వఁగల పూజ్యుఁడుపుట్టఁడు పుట్టఁబోఁడు, సు
జ్ఞానముఁ గొల్లఁగొంటి మడుగం బనిలే దిఁకఁ బోర వ్యాహాసం
ధానము నారగింపుకదనంబునఁ జూడుము రాజశేఖరా!॥ 674

శా॥ ఏదేశం బనుచుంటిరొక్కొ? నృపతీ! యేలంగ లేవ్వాళ్లు, లే
వే 'దేహి' క్రియకెత్తె నెల్లెడల? మాకెచ్చోట జన్మంబొ మా
కేదుర్జ్ఞేయము దేశద్రిమ్మరులహా క్కేనాఁటి కానాఁటికే
ప్రాదుర్భావము భుక్తమాఁ దమకుఁదెల్ప న్జాలకాలంబగున్॥ 675

మ॥ దొర దేశంబొకఁ డెద్దియే న్గెలువ నెంతోకాల్బలం బెన్నియో
కరులు న్వాజులుఁ దేర్లుఁ గావలయు లౌక్యం బన్నిమంబందు దోఁ

తరళై కుట్రలు హత్యలు న్జరుగు నంతంబెందు శంకాస్పదం,
బరయ న్మా కళికి న్నుమప్రతతియె ట్లట్లన్ని దేశంబులున్॥ 676

క॥ మా కేమికొఱఁత భూల
శ్రీ్మకలితులు మిమ్ముంబోంట్లు సేమమొసఁగ ని
ర్భీకులమయి వాకొందు మ
వాకులును జవాకు లిట్లు వసుధాధీశా!॥ 677

క॥ మన్నింపు మనము తగుగరి
మ న్నింపుము కోర్కు లనుచు మకురూనెద మా
పన్నికరము నికరముగతిఁ
బన్ని కరముసులువుగా నివారింతుమయా!॥ 678

చ॥ రసికులుమీరు, స్త్రీపురుషరాగవియోగకళాప్రదర్శనం
బు సరసహావభావపరిపోషకవాఙ్మధుపూరకంబుగా
నెసఁగఁగ నింపుఁ జూపెద మనిద్యకళాభినయాంచితంబుగాఁ,
గొసరకపో రికొక్కపరి కొండొకసారి యటంచుఁ జూడుఁడీ! 679

వ॥ సఖీ! సాత్రాజితీ! 680

ఉ॥ నాఁ డటఁ గేళికావనమున న్గనుఁగొంటివి నందనందను
న్గోడనె -ప్రేమ గాఢముగఁ దోఁచినదాఁక -మనఃప్రవృత్తు లే
జాడల నెట్టిమార్పులఁ గుశాల్వొలయించెనో చెప్పు, మమ్మరో!
రాఁ డతఁడన్నచింత మధురంబగుఁ గొంత తదీయచింతచేన్॥ 681

సా॥ వ॥ నెచ్చలీ! యెట్టిపిచ్చిదానవమ్మా! 682

క॥ కనుఁగొంటకుఁ దమిఁగొంటకుఁ
దనరెనె యెడ మింతయేని తత్క్షణముననే
మునిఁగితిని రాగజలధి
న్వీను మాయాగడము విన్నవింతుఁ గడంకన్॥ 683

మ॥ మును నేఁజూచితిఁ జూపులగ్నమయి తెంపున్దాళ, దల్లంత నా
యనచూడన్గోడ నప్రయత్నముగ నాస్యం బానతంబయ్యె, నై
నను నేత్రంబుకనీనిక ల్వీడి తొలంగన్ లేక తెప్పంటులై
కనుఁగోఁ ధాంగలిపక్ష్మము ల్మినమిన న్గంపిల్లె సిగ్గల్లఁగన్॥ 684

ఉ॥ ఆతనిచూపు సాంద్రమయి యాక్రమణేచ్ఛల గొండ్లిఁద్రొక్క నా
చేతము తత్తరిల్లె నొకచెంపకు దేహము నొత్తగిల్లె న
య్యాతురమందు నే న్మగుడ కాదట నాకడకంటఁ జూడ్కి ప
్రీతుల దాగుడాడుచుఁ జరించె సరీలున మేనుపొంగఁగన్॥ 685

సీ॥ విలువంపులై కర్ణవీథిసోక నటించు
భ్రూయుగంబును సారె పొదివి పొదివి
యాజానుబాహువిన్యాససౌష్టవసమ
గ్రతఁ దేపతేపకుఁ గమిచికమిచి
పీనమై విపులమై బిగిజిగి సొగసగు
వక్షఃప్రతోళిపైఁ బరగువాఱి
సౌదామనీనిరాసకతదీయాక్షిచం
క్రమణంబుల న్దొట్రుఁగాంచికాంచి
నానిరీక్షణమాలిక ల్నావశంబు
గాక యామహాత్ముని పలుపోకలఁబడి
మఱలుపన్రాక తిరుగాడె మఱలమఱల
నుఱికి యెదురేగి వెనుబాఱి యుదుటుమీఱి॥ 686

సీ॥ క్రేఁగంటఁదూఁగాడి కెరలుకోర్కులఁ దెల్పు
తమిచూపులోలుకు కందమ్ము లరసి
యుబ్బూతలై యూఁగు నురముభావం బాస్య
గండంబుల న్గెంపుగావు టరసి
పలుమాఱు లలికంబు వలిపతుండు న నద్దు
నట్లు చెమ్మట నెమ్మె యవియుటరసి
యొకయూహ నిలక పత్తికమకఁబడు మనో
వృత్తిమోహమునఁ జింది బెరయుటరసి
నాదుకోరిక నానోము నావ్రతంబు
నాతపంబునుబండె నీనాఁటి కనుచుఁ
దలఁచి సాటినెలంతల ధన్య నేన
యనెడిగర్వానఁ బరవశనైతినమ్మ॥ 687

తరలై కుట్రలు హత్యలు న్జరుగు నంతంబెందు శంకాస్పదం,
బరయ న్మామ్మ కళికి నుసమప్రతతిమె ట్లట్లన్ని దేశంబులున్॥ 676

క॥ మా కేమికొఱంత భూల
ష్మీకలితులు మిమ్ము్మబోంట్లు సేమమొసఁగ ని
ర్భీకులమయి వాకొందు మ
వాకులును జవాకు లిట్లు వసుధాధీశా!॥ 677

క॥ మన్నింపు మనము తగుగరి
మ న్నింపుము కోర్కు లనుచు మకురూనెద మా
పన్నికరము నికరముగతిఁ
బన్ని కరముసులువుగా నివారింతుమయా!॥ 678

చ॥ రసికులుమీరు, స్త్రీపురుషరాగవియోగకళాప్రదర్శనం
బు సరసహావభావపరిపోషకవాఙ్మధుపూరకంబుగా
నెసఁగఁగ నింకుఁ జూపెద మనిద్యకళాభినయాంచితంబుగాఁ,
గొసరకపో రికొక్కపరి కొండొకసారి యటంచుఁ జూడుఁడీ! 679

వ॥ సఖీ! సాత్రాజితీ! 680

ఉ॥ నాఁ డటఁ గేళికావనమున న్గనుఁగొంటివి నందనందను
న్డోడనె -ప్రేమ గాఢముగఁ దోఁచినదాఁక -మనఃప్రవృత్తు లే
జాడల నెట్టిమార్పులఁ గుశా ల్వోలయించెనో చెప్పు, మమ్మరో!
రాఁ డతఁడన్న చింత మధురంబగుఁ గొంత తదీయచింతచేన్॥ 681

సా॥ వ॥ నెచ్చెలీ ! యెట్టిపిచ్చిదానవమ్మా ! 682

క॥ కనుఁగొంటకుఁ దమిఁగొంటకుఁ
దనరెనె యెడ మింతయేని తక్షణమున నే
మునిఁగితిని రాగజలధి
న్వీను మాయోగడము విన్నవింతుఁ గడంకన్॥ 683

మ॥ మును నేఁజూచితిఁ జూపులగ్నమయి తెంపున్దాళ, దల్లంత నా
యనచూడన్దోడ నప్రయత్నముగ నాస్యం బానతంబయ్యె, నై
నను నేత్రంబుకనీనిక ల్వీడి తొలంగన్ లేక తెప్పంటులై
కనుఁగోఁ ధొంగలిపక్ష్మము ల్మొనమిన న్గంపిల్లె సిగ్గల్లఁగన్॥ 684

ధీసంకోచజనీలిమంబు తిగిచె న్దైదైనరాగప్రభ౯
దోసం బెద్దియొ వెంటనే చనియె నందున్బాసి నాస్వామియున్॥"

హా॥వ॥లోకసామాన్యమే కదా! ఎవరితప్పులు వారికగుపడకుండుట. 694

చ॥ మఱచితె? "దొంగ నాయనుజు బ్రమందఁగఁ జేసి హరించెమత్ప్రిభా
కరవరద త్తరత్నమును కాదన కీహరి"యంచు వాదు నీ
గురుఁ డొసఁగించియుండుటలు! కోమలి! నిందలఁగొల్పువారిపైఁ
గొఱకొఱ వింతయే? మునులకు న్వరయోగులకైనఁ జూడుమా!

స॥ వ॥ సఖి! అదియొకారణముకాఁబోలు నేమిసెప్పుమనే? 695

సీ॥ నెఱి సంజకెంజాయ లురువు గాఁజెలరేఁగి
తెలిసోగకనుదోయి నలముకొనుట
యురక యున్నటులుండి యుబ్బూతలై తమం
బలికాంతరమున బిట్టాఁగి మూఁగ
నధరోష్ఠ మొడిసి దంతాగ్రంబు లందంద
మినుకు లవ్వాటుగాఁ దొనకఁజేయ
శిథిలతాప్రాప్తమన్మథరాగమున శీఘ్ర
గతి నితరాసక్తిఁ గదలిచనుట
నన్నునెఱిఁగిన పైనిశ్చణంబునందె
నామనోహరుచిత్తమందసమునందు
వెలయుప్రేమధనంబెల్ల నిలువఁబాసి
దొద్దవోయెనటం చెదన్దోఁచెనమ్మ! 697

హా॥ క॥ కాదామఱి, కృష్ణుఁడె నీ
కొదయితుఁడటంచు మిగులననుకొంటిమి యు
ళ్ళేదొరకుట తొలిమెఱుకనె
భేదిల్లుటె? విరహ మెట్లువేగించితివే?॥ 698

సత్యా॥ వ॥ ఎట్లువేగించితినో యాదైవమునకేయెఱుక॥ 699

సీ॥ ఎడలేని చకచకన్డొడరునింద్రియరాజి
యవశత్వమునఁ దోఁగి యడలెనమ్మ!

అతికష్టసాధ్యమంత్రాలోచనములలో
వీఁగుచిత్తము తూఁగి లోఁగెనమ్మ!
సతతంబు సంతోషగతి నుబ్బుకాయ మే
లోయనో పడునట్టు లాయెనమ్మ!
ఎన్నఁడున్ రుజ నింతయే నెఱుంగని నాకు
స్మృతి బిట్టుకలఁగి భ్రమించెనమ్మ!

కనుల బవిరిగ్ పఱుఁగిడెఁ గర్ణరంధ్ర
ములను సంకులరావంబు మ్రోయఁదొడఁగె
నాదయితుశ్యామలాకృతి మీఁదుమిగిలి
విశ్వరూపంబుఁ గొనెఁ గను ల్విప్ప మాయ॥ 700

సీ॥ ఒకమా టలుకమీఁటు వికటాంబకద్యుతు
ల్కలమనోహరుఁజూపి కడకుఁజొప్పు
నొకమాఱు సుకుమారమకరాంకరుచి నాథు
ఘనరూపు జిగిసొంపుఁ గనులనింపు
నొకవేళఁ బికపాళి కకలంకరుతి నేర్పు
పతివాగ్వితతిపొల్పు శ్రుతికిఁ గొల్పు
నొకసారి సుకళారసికతప్రకటరీతిఁ
జెలువుఁ డండఁ జరించు చెలువునించు

నొక్కపరి సర్వదిక్పరిచ్యుతసువిగ్ర
హునిగఁ గనఁజేయు నంతలో నురక యింద్ర
జాలవైఖరిఁ బెన్మాయసలుపు నహహా!
భ్రాంతులన్నింట మన్మథభ్రాంతి భ్రాంతి॥ 701

॥ అన్నంబిందదు నీరుదుస్సారమగు నిప్పైతోఁచుమందానిలం
బెన్నం దోఁపవు వేఱుయోజనలు సాహిత్యంబు సంగీతము
న్మన్నే బుద్ధిఁ జిరాకుఁ గూర్చుఁ జెఱుల న్బొనాడి భావప్రపం
చౌన్నత్యంబునఁ గామవిద్ధులకుఁ దామైనిల్వఁ బ్రేమంబగున్॥ 702

ఆ॥ వె॥ అట్టె నిలిచి నిలిచి యాదారినీదారి
బిత్తరింపుఁజూపు లొత్తగిల్ల
నొలసి పిలిచిపిలిచి యలసి క్రమ్మఱఁ గేళి
వనముఁ జొచ్చి యెడరు నొనరు నాక॥ 703

సీ॥ సకలపుష్పాసవోత్సుకవాయుసంచార
శైలమా! అతఁడు నీపాలఁగలఁడె?
లలితప్రసూనపల్లవఫలానమ్రర
సాలమా! అతఁడు నీపాలఁగలఁడె?
ఫుల్లపద్మామోదభూరిసుఖస్పంది
కూలమా! అతఁడు నీపాలఁగలఁడె?
ప్రౌఢగానధునీతరంగగాహకహంస
జాలమా! అతఁడు నీపాలఁగలఁడె?
కాళికాగారనివసద్ద్విజాళులార!
వాలుకాపాళులార! మత్తాళులార!
నీలమేఘశరీరగోపాలమూర్తి
నరయరే? మిమ్మునతఁడు డాయంగలేదె? 704

హాస్య॥ క॥ ఓయమ్మ! మారు దూఱితొ?
వాయువు దూఱితివొ? వారిభవు దూఱితివో?
ఆయెడ నేమెడఁ దూఱితొ?
ఈయాయనుభవములెల్ల నెఱిఁగింపఁగదే?॥ 705

సత్య॥ ఉ॥ గందపుఁబూతపెల్లె సుమకాండమువాఁడె నొకింతలోపల,
న్మందసమీరుతాఁకు విషమంబయిపోయెను, చల్వఁజల్లునా
చందురు నిండువెన్నెల నిశాతనిదాఘమహోష్ణమయ్యె, నే
మందునె నీటఁ గేళివనమందును జొచ్చిన శాంతికల్గదే॥ 706

ఉ॥ పెట్టితి నొట్టు జాబిలికిఁ, బెంకెమరుత్తును దట్టి, తామనిం
దిట్టితిఁ, గొట్టితి న్గొలనుఁ దెంపునఁ జేతులఁ గాళ్లఁ, బూవుల
న్నెట్టితి, నెట్టనన్ మరుని నేర్పులఁ బట్టితిఁ దూరుపాఱ, నా
జెట్టికి మీఁదుఁగట్టితిని చేతనమంతయు మూలముట్టుగన్॥ 707

మ॥ అనలాక్షు న్ననలించి రూపఱుట వీర్యంబేది నీవుగ్రశా
సనుల న్బూరుషుల న్భవదీయకుసుమాస్త్రభ్రాంతుల న్జేయఁజా
లనిచో నెందొ పోకాలఁబోవ కబల ల్వాలంచుఁ గోలె త్తెదే?
కను మీకుంకుమబొట్టు చిచ్చుఁగను బింకాల్పాఁగ విందేగుమా!॥708
మ॥ మనమా! గాలికి నుల్కి పోలె దతను స్మర్దింప గద్దింతు వే
పనియుంబూన వడంకె దూరక బయల్పట్టంగఁ జేఁజాపె దే
మనియారాట మెు? యెట్లుకోర్కి యగు? కార్యం బెద్ది? యోజించి నీ
కనుకూలంబగుమార్గముంగనక యేలా వట్టియార్భాటముల్?॥ 709
వ॥ మారా! సుకుమారా! నీపై నలుకచే నిన్ననంగునిగానొనర్చిన గౌరీప్రియుండు నీకగాక మాకందఱకు నింతయనరాని సాహాయ్యముం బొనర్చినవాఁడయ్యె నిదిగమనింపవుగా! అందఱు నిటలాక్షులయ్యెదరని యేల బెంగఁగొని నారీమణులదెసం దారసిల్లెదవు? నీకొక్కయుపాయముం జెప్పెద సావధానతనాలకించి యట్టులొనర్పం బ్రయత్నింపుము. మాయాశీర్వాదముంగొని వర్ధిల్లుము. 710
చ॥ అనురతి శౌరి యట్లు నను నారసినప్పుడె నీసుమాస్త్రము
ల్చని యొకకొంత తద్ధృదయసద్మవిపాటన మాచరించెఁగా
వున భయమిగి నుజ్జిగురుమోసలఁబుష్పొడి సానఁదేఱు క్రొ
న్ననపెనుతూపులం గొనిచన న్జయమొందెదు లెమ్ము పొమ్మికన్॥
హా॥చ॥ చెలి! పనిలేనిభామినులు, చెల్లరె!, కామినులౌదు రిట్లె య
న్వలితియొసంగుఁ, జాలు, నటువెల్లి, నెఱిన్మగవేసమూని, యా
చెలువుని పోళెము ల్కని, ప శేషములన్నియు నీకుఁదెల్పు నుఁ;
న్గలవరమొంద కోర్చుకొనఁగాలమె కూరుచు నన్నికూటముల్॥712
వ॥ (కృష్ణునితో) వయస్యా! ఏమి యట్లు మైమఱపున నుండెదవు? 713
కృ॥వ॥ ఏముందునోయి! ॥ 714
చ॥ అనలసమీపముం దొఱయునంతకె మైనపుబొమ్మ కీవిమైఁ
గనుపడుఁ గాక సుంతదనుక న్ద్రవమై వడి జారుఁగాదె? య
య్యనువునఁ గాంతల న్దరియునంతకు ధీబలగర్వయుక్తుఁడౌ
వెనుకను వారి మానవుఁడు వీడ స్వతంత్రుఁడుకాఁడు చూడఁగన్॥

హా॥ తమ కెప్పుడు నిదియే గొడవకదా ! ॥ 716

చ॥ భ్రమరము పుష్పమొక్కటికిఁ బాటి మరందమునాని పెక్కుటన్
గ్రమణముఁ బానము న్విడని కైవడిఁ బిన్నతనంబునుండి చి
త్తము మఱగించికామమున దత్కథమానవెపో ! పదారువే
ల్రమణులనొందియు న్గిలిపిరంగఁడ ! నేఁ డిటనేమిక్రొత్తయో?॥ 717

కృ॥ నేస్తుఁడా !॥ 718

చ॥ చిలుక హుమాయియూ ! యళులచేరు గుణాంబ ! పువు ల్ధనస్స! కో
వెలరుతి జ్యానినాదమ! నవీనవసంతసమాగమాంకస
త్కళికలు తూపులా! తనువుఁ దప్పినవాఁడటె యోద్ధ! యేటికో
కళవళ ముబ్బు నాత్మభవకల్పనము ల్పులకింప నాత్మలోన్॥ 719

హా॥ వ॥ స్నేహితుఁడా ! నీవెఱుఁగఁజాలనిదేమికలదు ? మోహాంపు వెఱ్ఱిచే నేమఱియెదవుగాక! నీకుమారుండగు నమ్మారుండు జనకునకు సంతతసౌఖ్యంబు నాపాదింప నింతటిజాగరూకత నీకు సేవ గూర్చుచుండవలయు. ఈడొంకతిఱుగుడుమాటలకేమిగాని ప్రస్తుతమున నీమనంబునాకర్షించుకొనిన సుందరి యెవరు ? ॥ 720

కృ॥ వ॥ ఎవరనువిషయాలోచనము మనమునఁదట్టినప్పుడే కలవర మధికమగుచున్నది॥ 721

హా॥ వ॥ కలవరమా! లేక కలరవమా! మరుని తెక్కలరవమా! ॥ 722

కృ॥ వ॥ బలె! అదియట్లుండనిమ్ము॥ 723

మ॥ తులయే యుండని మేలిసోయగము చిందుల్త్రొక్క నాసొంపె మే
ల్వలమై రివ్వునముట్టి పట్టి జటినే న్వందారువున్గైయుఁ, బ
ల్కుల నిట్టిట్టని తెల్పఁజాల, వినవే పల్మారు లాపెంపు నీ!
వలసాత్రాజితిఁ, గంటి పూర్వభవ పుణ్యప్రాప్తి నేఁడోసఖా! 724

క॥ “తనసూర్యదత్తమైనమ
ణిని దనసోదరునిఁజంపి నేఁగొంటి”నటం
చును సత్రాజితు నింద
న్మనపై నిడ వగచి వచ్చుమార్గములోనన్॥ 725

ఉ॥ తప్పితి దారి మిక్కిలియదాయదలోమతినుంటఁ, గొంతకా
తప్పనెఱింగి చూతునుగదా యెలదోఁట నొయారమొల్కఁగా
నొప్పులకుప్ప నాయెదుట నొక్కతె లేజవరాలు వింతలో
విప్పులసోగకన్నుఁగవ వీక్షణఁజేయుచునుండె నర్మిలిన్॥ 726

తే॥ నీటిముంపునఁ గరఁగి యానీటఁగలియు
కండచక్కెరయన మున్గి కరఁగి కలిసెఁ
గొంతచూడ్కుల నాచూపు గడుసుచెడఁగ
వనిత కన్దోనకవ యేటవాలుగాఁగ॥ 727

తే॥ అంటుశిలఁదాఁకి వదలంగ నస్వతంత్ర
మైనయినుమువిధంబున నాకురంగ
నేత్రకను లంటుఁగొని నాకనీనికలును
భ్రమిసి కైకొనెఁ బరవశత్వమును మిగుల॥ 728

చ॥ బెదరొకొ! ప్రీతియో! బయటిబింకమొకో! హొయలొప్ప సుంతమే
నొదిగిలి ప్రక్కకున్మలయ నూఁపున మోమెగయించి విప్పుక
న్జదురుల నాకనుల్జడియ జాణతనంబున నొక్కప్రక్కచూ
పుఁ దగులగాఁబడన్విసరెఁ బోటుబెడంగుల దాఁటి నాటఁగన్॥ 729

మ॥ "తరుణీ! నేఁబగవాఁడఁగాను దయలేదా? యేలుకోరాద? నీ
చుఱుకున్జూపుల జంకునొందు నను నీశోభిల్లుచన్దుర్గముల్
మఱుఁగున్గూర్పఁగ బాహువల్లరులసౌభాగ్యంబె పెన్గోటమై
కరమున్ గౌఁగిలిఁదొట్ట"నంచడుగువేడ్కల్పర్వెఁ జిత్తంబునన్॥ 730

ఉ॥ జాలరి గాలమున్విసరి చయ్యనలాగఁగఁ గొంకివెంటఁ బ
ట్టీలఁ గ్రమించువాలుగవడి న్గొని నాకను లామిటారిక
న్జాలుపునంటి యానుదురుజాబిలిపైఁ గనుబొమ్మమబ్బుపై
వ్రాలెడికంటిమెర్పులతపైఁ జనుగొండలపై శివాల్కొనెన్॥ 731

ఆ॥ వె॥ ఎడమమడమఁదాఁకఁ గుడికాలిబొటనవ్రే
లునిచి తలను గొంచెమొరగఁజేసి
కుడికరంబువ్రేళ్లఁ గొనియున్న పూల మూ
చూచు చొయ్య నన్నుఁజూచి కలఁచు॥ 732

శా॥ ఆమొయ్యారమె చూతునో వనిత సయ్యాటంపుఁ గ్రీఁజూపుఁ ద్రో
పూయేల న్దమి నూఁగులాడెదనో మోమూరించు నావెన్నలం
దే తేలాడుమనోక్కొ క్రీఁ బెదవిపానీయంబుకై లోట్టల
న్వేయన్నా నెదనోక్కొ గుబ్బతిలె నన్నే కోర్కులీట్లాత్మలోన్॥ 733

మ॥ చెలికాఁడా! తమిఁ గొన్న కాంత యెదుట న్సిద్ధంబుగా నుండఁ గో
మలిపైఁ బ్రేమము నిన్నుఁ జెండ సరసంబా!, లేక, సయ్యాటయా!,
పలుకే మానుచు రిత్తలోఁగుటకల బ్రాబల్యమ్ములఁ? జేఁజిక్కు వీ
ల్కలుగం బోవునె క్రమ్మఱ? బ్రసికవాల్లభ్యంబు నీకుగ్గగా!॥ 734

ఉ॥ ఆము నశించె మైమఱపు హత్తుకొనె న్జెలి వింత చెన్ను చే
నేమనువాఁడఁ? గొంతసరి కెట్టులొ కాల్కయి కూడలాఁగుకో
గా మెలికయ్యె నా పెచెలికత్తెలువచ్చుట, నే స్తకాఁడ! యె
ట్లే మనువాఁడ సత్యయట యీనవమోహిని నాకు దక్కునే! 735

తే॥ గీ॥ మణికిగాఁ బినతండ్రిని మడియఁ జేసె
నీతఁడని యాపెయెఱిఁగిన నెట్లువలచు?
నేమిచఁరదృష్టమో నింద యిపుడె ముసరె
నచట నిలుచుండ మోహమోడితయ్యె! సఖుఁడ!॥ 736

సీ॥ ఆమోహనాంగి గాఢాలింగనము లేక
యీమోహసంతాప మీఁగు టెట్టు?
లామధురోష్ఠి గానాలాపసుధ లేక
యీవిధురవిషోగ్ర మెగపు టెట్టు?
లా హేమకలశకుచాభోగరుచి లేక
యీకామతమ మేద నెగపు టెట్టు?
లావిద్యుదమలనేత్రాలోకన మునుంగ
కీనిరుత్సాహత మాను టెట్లు?
మేను పులకించి పులకల మిడి వదలదు
బుద్ధి కలగుండువడి సుంత ముడి విడువదు
తలఁపు లతిచంచలంబులై నిలువఁజాల
వామెనోహరిఁ గొన కార్తి నాపు టెట్లు?॥ 737

వి॥ బలే! మఱియుకమూ అప్పుద్యముంజదువుము॥ 738

హా॥ సీ॥ పాడినపాటనే పాడెరా యీపాఁచి
పండ్లదాసరి యన్న పగిదిగాదె
భూపాల! నీపాల నీపాలితము వినం
డీబాలకుఁ డటంచు నెన్నవలవ
దద్దాని మించుదివ్యోద్దేశములసాచుఁ
బద్దూని సుధనించుఫణితిఁ బెంచు
నల్లదే విరహంబు పెల్లూనె దేహంబుఁ
బిల్లవానిమనంబు తల్లడిల్లఁ
గైపునందున్నవాని కెక్కంగఁగలవె
యితరవాక్యంబు లాబాతె యెసఁగుగాక
వినుఁడి యీకవినుడి మీకువేడ్కసేయు
నంతకంతకుఁ గౌతుకం బగ్గలింప॥ 739

క॥ ఓసంగడీఁడ! మదినీ
వాసాత్రాజితిని వలచి యపనిందకుగా
నోసరిలు పిదప నెట, నే
యేసన్నాహములనుంటి వెఱుఁగన్జెపుమా! ॥ 740

కృ॥ వ॥ చెప్పుటకేమున్నది ? ॥ 741

చ॥ గదలఁ బెనంగుటో! కఱకుగత్తుల పీరతఁ జూపుటో ? మహా
న్మదపరిపంథిగర్వ మఱ మల్లుపెనంగుటయో! త్రిలోకభీ
ప్రదసకలాస్త్రశస్త్రనిచయంబులఁ బోరొనరించుటో! వృథా
గద మెయిలేనిమారు నెమక న్బ్రయతించుట వెఱ్ఱిచిత్తమా!॥ 742

హా॥వ॥ నిందఁ దీర్చుకొనుట కివియన్నియుం జరుపవలసివచ్చునేమోలే
తరువాత !. 743

ఢ॥ తే॥ గీ॥ మోహజాలంబు చుట్టును ముఁగి రేఁగ
నంతరించు మైనపుదీపమనఁగ బుద్ధి
గుప్పుగుప్పున మినమిన గుబ్బతిల్లి
సన్నగిలఁ జొచ్చె స్వేచ్ఛయు నన్నగిల్ల॥ 744

వ॥ అబ్బా! ఆభావజప్రభావంబు దురతిక్రమణీయంబయ్యె. క్షణ శతాంశంబున హాలాయలుగులుకు నక్కలికి చిలుకపలుకులఁ జెవిం బడఁజేయుఁ, నక్కలకంఠి నవ్యసుధామధురగానామృతంబును వెల్లి విరియంజేయుఁ, నల్లంత జగంబంతయు శూన్యంబుగా నాశా తోదరి నదృశ్యంజేయుఁ, దద్గవేషణంబునకై శరీరమచలితమ్మై యుండియు మనోవేగంబున నఖిలలోకంబులఁ జుట్టివచ్చుచున్న ట్లనిపించు, ననేకములై భిన్నాభిన్నములైన నిశ్చయంబుల శర త్కాలమేఘాడంబరంబులవలె మన్మనంబున సంభ్రమింపంజేయు, నదిగో మన్మనోహారిణి!॥ 745

సీ॥ రమణీమణీ! నేఁజిరాకుఁజూపిన నాప
రాకునై పక పల్కరాకయుందె!
తరుణీ! యనంగుబల్లాఁకు లోర్వమి పెన్వ
తాకు సోఁకెడి నన్నుఁ దాఁకరావె!
యువతీ! వసంతాదు లూఁపఁ దాళను త్వదీ
యోపగూహన మీయ నోపవోటు!
మగువ! నీపేర పల్మాఱుఁ బిల్చుట నిట్లు
మాఱెఁ గంఠము కోప మాఱవలదె!
పొదల దాఁగితె ప్రణయంబుబొదల చదలఁ
దరుల గుబురుల నుందె?! నన్మరులుకొలిపి
తొలఁగి చిత్రంబుఁ గాంచెదే! లలన! కరుణఁ
గనుపడ రావె! పలుకవే! కలుపుకొనవె!॥ 746

మిహిరుఁడు॥వ॥ భాగవతులారా! లలితకళమైన కవితయందు విశేషించి రసోత్కృష్టపదంబగు నిట్టిపట్టున మీరగుపఱచిన యభినివేశమునకు నత్యంతదక్షతకును మిగులసంతసించితి. ఈపారితోషకంబుంగొని నేఁటినుంచి మదాస్థానంబునలంకరించియుండఁ గలరు. 747

హా॥వ॥ జయము! మండలేశ్వరా! మహాజయము॥ 748

సీ॥ ఆ విష్ణు వొకపదియవతారములె చెందె
నయుతవేషముల కాయతుల మేము

దాత నాతండు పాతాళంబునకుఁ ద్రొక్క-
భువి దాతకీర్తిఁ దెల్పుదుము మేము
అడిగికొన్నధనంబు నతఁ డురంబున మాకు
నది సార్థకంబుఁ జేయుదుము మేము
పఱచి యాతఁడు నీటఁ బాముపైఁ బవళించె
నిర్భీతి డాఁగ మానెదము మేము
పూని తర్కింప మీయభిమానమునకు
దయకు దానంబునకు మేమె తగినపాత్ర
భూతులము దీని నెంచుఁడీ భూపవర్య!
యర్థిసంతానసంతానమా జయోస్తు॥ 749

తే॥ గీ॥ తిరుగుకాలిట్టులనో రుండదురక భూప!
ననల సుఖమొందు నళి బంది ననుచు నయ్య?
త్రోయరానిది మీయాన దాయకైన
కొలఁది దినముల మమ్మాపుకొనఁ దలంపు॥ 750

మహా॥వ॥ అయిననరే! నీపేరేమి? ఈసత్యాభూమిక స్వహించిన దెవరు! కృష్ణవేషధారియగు నితండెవరు ? 751

హా॥ అయ్యా! నాపేరు నేఁజెప్పుకొనందగదు. సకలవ్యాపకుండైన జగదీశ్వరుండగు నారాయణునట్లు చిన్ననాఁటినుండి యలవాటయిన హాస్యంబుచే నందఱినోటఁ బడుచుంట నాకు నానారాయణాభిధానంబు సమస్తజనసమాధానంబుగా నాధానితంబయ్యె. నేను నారాయణుఁడను కాఁగాఁ బ్రస్తుతము నారాయణవేషంబుననున్న యీతండు నరుఁడే. అనఁగాఁ దక్కినవారు నరులుకారనుటకాదు. ఇతఁడు నరుఁడేకాని నరుఁడుకాఁడు. కవితాకళయం దీతఁ డతిదక్షుతం దనసర్వతోముఖపాండిత్యంబు నగుపఱచియుండుటచేఁ బెద్ద లీతని కొసఁగిన ప్రతిభారవియను బిరుదఁబువాడుకఁ నానోటనానోటఁబడి భారవియయ్యె. తరువాత నీసత్యభామ సత్యమునకు భామల్లుఁడను పండితోత్తముఁడు. పిమ్మట నీవంతపాటకాఁ డావఁతయు నేవంతయు నే నెఱుంగని నిత్యసంతోషియగుట నానందుండనంబరఁగు. అవ్వల

సమ్మార్దంగికుండు లయప్రదర్శనమున సమ్మర్దితాంగకుం డగు చుండుట సమ్మర్దనుం డయ్యె. ఆతాళికుండు తాళకంబువలె గుజ్జు రూపియగుటఁ దాళకుం డనంబడియె. చిన్ననాఁటి నామకరణంబు లెవ్వియో కాలస్వరూపుం డుపసంహరించుకొన నిప్పటి కీయా నామంబులఁ బ్రపంచపుస్తకంబున వ్యవహరింపఁబడుచుంటిమి. తమ వంటి రసికశేఖరులప్రాపున మాకిఁక మఱియేబిరుదనామములైన నబ్బిన లోకనాటకంబున నాక్రొత్తపేరుల లిఖింపించుకొందుము. 752

మిహి॥ ప్రధానీ! వీరలకుఁ దగిన మేలియాగారంబుల సమస్తోపచారంబుల సంతుష్టిపఱిచి యీనారాయణభారవుల నీసాయంతనమున నాకేళీవనంబున కనుపుము. 753

ప్రధాని॥ భాగ్యము. 754

శా॥ ఆహా! పాండితి యెట్టిభోగముల నీయంజాల? దెచ్చోటనే
నూహాపోహల నాచితి న్గొఱతయేనో తత్కళాశాలి? కా
రా! హాయి న్విడిది న్భవల్కడపి సాయాహ్నంబున న్మోలియు
త్సాహంబూని సుసిద్ధులైరి మిహిరు న్సంధింపఁ గేళీవనిన్॥ 755

ఉ॥ అప్పుడు పల్కె భారవి "సఖా! మిహిరుం డలవీరధర్ముచే
యుప్పును దిన్న డింభుఁ డనుయోజన పర్వెడిఁ బోల్కిఁగాంచ నే
నప్పృథివీశుఁ జూడఁజనినప్పుడు వీఁడట నుండె మంత్రిగాఁ
జెప్పుమ, పోల్చియుండుననుఁ జెన్నటె, యెయ్యది యిప్డు కృత్యమో?

కంచుకి॥ వ॥ జయము! నారాయణభారవులకు మహారాజుగా రుద్యానమున కరుగుచు మిమ్ముం దోడ్కొని రమ్మనియె. 757

నా॥ ఇదే యుత్తరీయంబులంగొని వచ్చెద మీరిటనుండుము. (అని యిరువురు లోనికేగి) 758

నా॥ భామల్లా! 'ఎఱుకకు యోగ్యము గృహమా వనమా?' యను తర్కంబు సంఘటిల్లె. మేమిపుడు రాజుగారి యుపవనంబున కరుగుచుంటిమి. పునస్సమాగమములోపల నీ వీసమస్యం జక్కఁబెట్టుము. భారవీ! 759

ఉ॥ మంచిది యీయుపశ్రుతి, క్షమాధరుఁడో రతిరాజమార్గణా
కుంచితమానసుండు కనుఁగోఁడితరంబుల రమ్ము!, సాగుమో
కంచుకి! యాటతోఁటఁగల కల్మికి నువ్విళులూరుచిత్త, మే
సంచితభాగ్యమో యిటు లెసంగుచునున్నవి రాజభోగముల్॥ 760
క॥ పాఱులారా! ఇవే వారువంబు లెక్కుఁడు॥ 761
నా॥ కంచుకీ! నీధ్వని యధ్వనిగాఢమగుచున్నది'॥ 762
చ॥ చదువులబాపనయ్యలకు సానలఁదేటిన జాతిమావులన్
బ్రిదులక స్వారిసల్పుటకు వేదజటాఘనధావనంబా! స
మ్మదమిడు భక్ష్యసేవనమొ! మజ్జరె!' యంచు చలోక్తియా? బలే
చదు, రలభార్గవు న్నటజుఁ జక్కఁగ నీమది విస్మరించితే?॥ 763
శా॥ ఐన న్బండ్లబిగింపులేల తురగాయంబే సగంబెక్క యా
జానేయంబులొ? చూడ శ్రేష్ఠతరము ల్లల్లనె న్నుండె కా
నీ! నన్నాపయినిల్పు మాపయినితె న్నేదేవుఁడో చూపఁడే?
జ్ఞానీ! భారవి! యాశుధారఁగొనెదో నన్నెంచు నీపుణ్యమా॥ 764
ఉ॥ శ్వాసకె చిట్లునో యనెడిజానున గాజగుమేను దీని క
భ్యాసమె బర్వెమ్రోయ? వహవా! చెయిఁజాపినఁ బల్లమంద దే
నేసుఖరీతి నంకెముల నెక్కుదు రెంటిని? దిన్నెదాపుగాఁ
దీసిన నెట్లొ యెక్కఁబ్రయతించెద దించెద దీనియున్నతిన్॥ 765
శా॥ అమ్మో! కళ్లెము వీడిపోకు తను విట్లట్లాడు జీ న్నున్ననై
యెమ్మెన్మెఁబట్టెడ దల్లనల్లఁ జనుమోయీ! కంచుకీ! నేనెమా
యమ్మ న్నేర్పఁగ నున్న పుత్రకుఁడ! హాస్యా లిప్పుడేనా! నను
న్నమ్మన్లేదిది యింకఁ బెంకెతనము న్జాలింప దాలింపవే!॥ 766
ఉ॥ బుర్రనుకొంచు మోరదిగిపోవఁగ వంచెడి బిల్లిగింతగా
సర్రన నన్ను ముందరికి జార్చినచో నిహిహీ! యటంచుఁ బ
ల్బుర్రులఁ గొట్టనెంచితె కడున్వడి మోమెగయించి చూడు మీ
గుఱ్ఱము లేచి దూఁకెడిని కోలెముకల్కటకట్ల నొవ్వఁగన్ 767
సీ॥ "కుప్పించి కుప్పించి గొబ్బుగొబ్బున దూఁకె,
హా! వెనుకాళ్ళపై నటు లేచె,

నయ్యో! ముంగాళ్లూని యాకాశమునుదన్నె
మాటి కపరపాదనాటకముల
బాబో! విడంబించి ప్రక్కకూరక గెంతె
నెండ్రకాయలపర్వ తీండ్రమెసఁగ,
సబ్బబ్బ! మోర ముయ్యాటగా విదలించి
నేలపై శయనించు లీల నొఱిగె,
నరరే! మునిపంటఁ గళ్ళెంబుఁ గఱచిపట్టి
దాడు సాగించెఁ, దోరండు వీడ" కనుచు
బారచాపుల నూఁగుచుం బట్టికొనియె
గుఱ్ఱపుంజూలు గట్టిగాఁ గ్రొత్తపోల్కి॥ 768

తే॥ ఒక్కయెగురున దురగంబునెక్కి తోడఁ
బేరెమెత్తించుచున్ 'గ్రింద జారకండి !
తట్టుడొక్క మోకాళ్ళతోఁబట్టి నిలుఁడి !'
యనుచు బిగ్గర నఱచు చయ్యంగజాల॥ 769

చ॥ తొలఁగఁగనీకుఁడీ విసరుత్రోపులలోఁ బదము ల్రికాబులన్ !
గలఁగక పగ్గ మిట్లటులుగా బరమాగతిఁ గోయుఁడీ! యచం
చలమతి మేన్నిగుడ్చి తగుచాడ్పున నూఁగుఁడి! తూకమున్నిరా
కులముగఁ జూచుకొండి" యనుకొంచును సౌవిసుఁ దేగుదేఱఁగన్ ॥

క॥ ఓ! యను నయ్యో! యను న
మ్మో! యనునేగాని బెదరుటూఁపుల నాజా
నేయంబు చనఁగ నానా
రాయణుఁ డెటుఁబడఁడు మంచిరౌతో! కాఁడో! ॥ 771

తే॥ తురగఘాటికి మిగులనబ్బురము ముదము
గదుర భారవియును స్వారిగాఁజనంగఁ
జేరిరామువ్వురును గొంతసేపటికిని
రమ్యసుఖధామమైన యారామసీమ॥ 772

తే॥ భారవియు రాణివాసంబు బాలకుండు
తురగములదిగ దిగలేనివరుస నొప్పు

మోయికంచుకి! నను దింపుమోయిసఖుఁడ!
యనుచు నారాయణుం డంగలార్చె నంత॥ 773

క॥ వారిరువురసాయంబున
వారువము న్దిగియుఁ బంగవాఁటినతోడ లా
తీరుగనె బిగిసి నిగుడమి
గా రాపడి “యరరె! వింతగాసి జనించెన్॥ 774

॥ సలుపఁగసాగె నెన్నడుము సాఁగవు తొంట్లు ముడుంగ వయ్యయో!
సలుపఁగఁదగ్గదేది? చెడుస్వారికి నెందులకీయకొంటినో!
పలుకుమురార్య లింమలకె పశ్చిమబుద్ధులు బాపలంచుః నా
పలుకుమరెల్ల ‘జివ్వనెడు పల్మరు నిక్కఁగఁబోవ నొవ్వన్॥ 775

గీ॥ చిన్ననాఁ డెన్నఁడేని వేసితినొ లేదొ
గోడకురిచీని పంతుళ్ల గోడుకుడిపి?
తగిలెఁగాఁబోలు నాఁటిపాతకము నేఁడు
గోడయేలేనికురిచీగఁ! బాడుకుడిపి” 776

క॥ అనునారాయణు భారవి
యనువుగఁ గూర్చుండఁజేసి యంఘ్రులు జంఘ
ల్తనువును బిఱుదులు మాలీ
షున సరిపడ నిముర నతఁడు సుఖముగలేవన్॥ 777

॥ కంచుకి మూఁడుగుఱ్ఱములఁ గైకొని వెల్పలనిల్వ మిత్రులో
క్కించుకతేటి యొండొరు బిగించెడికైపురిలం కెమిాఱ సా
గించిరి పోక తోఁట, కుడిగించిరి తెమ్మెరతేట సేద, రేఁ
గించిరి తేఁటిపాటఁ, బరగించిరి క్రొన్ననయూట బాటపై॥ 778

ఆ॥ వె॥ చూడ వేయికనుల సుత్రామునకునైనఁ
జూపు వెలితియనిన నోప్పి తోఁట
సొగసుఁ దిరిగిచూడ సూచింప నరుల కె
వ్వరికి తరము చూడవలయుఁగాక॥ 779

గీ॥ గుమ్మటములగు నెలమావిగున్న లెన్నొ
చికిలిఁజేసిన వెలుగుపచ్చికలగోడ

దొడ్డఁ గడుదొడ్డచిలుకల తోరణముల
కుఱుకు గొరువంకతర్కాల కుఱుకులయ్యె॥ 780

గీ॥ బాటకిరువంక సరుగుడుబార్లు రొమ్ము
బంటి విరిసినతలల సంబరముఁ గొలిపె
నాల్గుకంబాలుగా నొంట నాటఁబడిన
చెట్లనడినీటిమర నీరుచిందఁ దిరిగె॥ 781

ఉ॥ తావులపూవుటోవరులతావులఁ దీవెమిటార్ల వ్రాయఁగాఁ
దావులు నిండఁగావలయుఁ దా వలమానుఁడుదక్షిణానిలుం
డావల నీవల న్దుమికి యాటల కావిరిబొండ్లఁ గొల్వఁగా
నావలుఁల న్జతుర్థరుతి నాలతిఁ దేఁటిమొయార్లు కొల్విడెన్॥ 782

చ॥ అటనటఁ బొట్టితాళ్లు వినయంబున స్వన్నికాడలూఁగఁ జొ
క్కటములఁ బచ్చియాకునయగారములం బొరి వీచుచుండ మా
ఱటమునులోయన న్గెలలె క్రాలెడిదాడులుగాఁగ మింటిత్రో
క్కటముల సగ్గుబియ్యపుచొకారపువృక్షము లొప్పెఁ గ్రేవలన్॥ 783

గీ॥ వెండితొడుగుల ధ్వజములదండి వెలుఁగఁ
బోఁకమ్రాఁకులబారు లాస్పోకఁ భొలిచె
వెండిబెత్తాలఁ బట్టెడుదండుగాఁగఁ
బొత్తుల న్గుండ్లుగాఁ బోఁక లొత్తగిల్ల॥ 784

మ॥ నెఱియాకు ల్కడునొత్తుగాఁ దనరి వన్నె న్బచ్చతాఱేకుల
న్మఱపింపంగలసారు నింప నిడుకొమ్మ ల్జిబుల్లై నింగి కొ
త్తరముం బెంపున మూఁగిసాగ భళిరా! తా మాకసంబంను పె
న్నెఱుల న్దిద్దు నశోకభూజవితతు ల్నిద్దంపుకీవు ల్తగన్॥ 785

క॥ ననల న్జంచువుతోమ
న్ననల న్దనపెంటి చుంబనంబులఁ బ్రీతిం
గని పంచమసుస్వరముం
గని పజ్జఁ 'గొకొ' యటంచుఁ గైవారించున్॥ 786

గీ॥ ఆకు లిరుప్రక్క వెలినిక్కి యంచెలంచె
లగుచుఁ దరతరముల మొవ్వయాకుఁ గలిసి

చిత్రవృత్తమ్ములై తోఁపఁ జెలఁగు రకపుఁ
జెట్టు లింద్రధనుద్యుతు ల్చిప్పిలంగ॥ 787

శా॥ మా కందంబులు కెంపుఁ గ్రొన్ననలకొంప ల్జీవనాధారము
ల్మాకందంబు లటంచుఁ బైవిడిసి నేల న్వచ్చిక ల్నిండులై
మా కందం బిడఁజాలు సొంపు వెలయింపం జూచికాఁబోలుఁ గో
కో! కోకో! యని హెచ్చరించుఁ బికము ల్గుంజ న్గుబాళించుచున్

చ॥ అలరులఁ బూల మాలికలనల్లి శుభాక్షరరూపము ల్ధరా
స్థలి వెలయించిరో యనఁగఁ దద్వనికం గనుపట్టె నిందు నం
దులఁ జిఱుపూలమొక్కలు "మనోజునిబాజు" "వసంతుసంతు"నాఁ
దెలుపుచుఁ దోఁటమాలికళఁ దెల్పుచు నబ్రము పిక్కటిల్లఁగన్ ॥789

చ॥ అది మఱియొక్క కేళివనమా! యట నెవ్వరు వారలిర్వ! ర
య్యది యొకదర్పణస్థగితమైనయగారము!, చంద్రకాంతసం
పదలకొటారులే తెలిసె, బాపురె!, యాపనినేరు పెన్న ము
ప్పదులకు డెప్పరంబు గరువంపురువారపుతళ్కుఁ జిక్కెడిన్ ॥ 790

చ॥ నిజమె "మనోజుబాజ" గమనింపఁగ నాచలిరాలచౌకపు
న్గజిబిజికాంతులంచుఁ గనఁగానగుఁ జిత్రము లామహీజ ము
న్నిజపతితో నొనర్చినవనీభ్రమణంబులు, బాలకృష్ణుఁ డా
వ్రజయువతీసహస్రముల రంజిలఁ జేసినచిత్రచర్యలున్ ॥ 791

ఉ॥ మాయురె! శిల్పి కీతెలివిమాయుట! చక్కనియంగణంబున
న్రోయక పచ్చిగడ్డి నిసిరో! విరియించెనె!-కాదు కంబళం
బా! యెటువంటిమాయ! యహాహా! కడుమెత్తన! వన్నెవన్నెల
న్పాయక యింద్రువి ల్లచటఁ బర్విన వైఖరిఁ గాంతు లొల్కెడిన్ ॥

మ॥ రతనాల్తొమ్మిది వింతయాకృతుల హార్మ్యంబు న్వాలింగింప దీ
పితమా నూమెలతొట్టిచెక్కడము సంప్రీతిప్రదం; బెల్లెడ
న్లతలై తెమ్మెరచెమ్మ కేచులత లాశ్చర్యంపుపెన్నిక్క లౌ
ర! తలాయొక్కటిగా గవాక్షముల సారస్యంబున న్వాలెడిన్ ॥ 793

మ॥ అరగే! యంగనలేగు పెంగొలనికై, యన్నన్న! నిండైనయ
బ్బుర మొప్పుల్గలసాలభంజికలె! షోఁబో సృష్టికిన్నిమ్నలై
కరము న్స్నానసము న్గ్రహించెడి, నదే! కాసార మాసారసా
కరమునోసియగ మెన్న నన్నలువకుం గాదన్న సత్యంబగున్॥ 794
శా॥ ఆసోపానములందు వారిదరిగా నాకుంచితంబౌతల
స్సైసంధానము వెన్నునం దురమున న్వేమాఱుచుండ న్బహు
శ్రీసద్యస్స్ఫురణంబు లాస్యమునఁ బ్రీతు ల్నివాళింప నే
రో సంభ్రాంతిఁ జరించుచుండిరి వరారోహ ల్వెఱ న్నిల్వఁగన్॥ 795
ఉ॥ అంతకుమున్నఁ దోయిలుల నప్తతి వానిపయి న్నిగుడ్చుమే
ల్కాంత కరంబుసంపుటి జలంబుల సాముగ మున్గియుండ సం
భ్రాంతియు సంశయంబు వెఱబాఱినవిప్పులకన్నుదోయి నా
చెంతఁ గనంగనయ్యె నెఱచెల్వుని మాఱ్పుకతం బెఱుఁగమిన్॥ 796
మ॥ కరమొం డంసముఁజుట్టిరాఁ బెనచి సింగారంబురంగార బం
గరుబొమ్మా! యనునెమ్మెలాడి రసము ల్కందోయి నూరంగఁ గ
న్మెఱుఁ గించించుకవిప్పి చూచుసొబగు ల్నాణెంబుడింద న్విపా
దరసాప్తి న్గయిజంట జాఱ వరుచెంత న్నిల్చెడి న్గోలయై॥ 797
చ॥ బెడిసెసరాగ మన్న వెఱ బేడిసకన్నులు తొట్రునొంద నొ
త్తిడివిడి రైకచింద నరతి న్నెఱబుగ్గలుకంద సందుగా
బుడిబుడిఁ గన్నుగీటు వలపుందళుకు ల్గుమిఁజెంద మించుదాం
దడి నొకదివ్యసుందరి తదంతికసీమ విలోలకామయై॥ 798
మ॥ తడిచీర ల్మెయిమిట్టపల్లములయందా ల్పైకిరానంట నే
ర్పడుకామాంబులదంటవిండ్లు గుదియ ల్బాణంబులు న్నార్లు వే
ఱిడికృత్యంబులరీతి నిష్ఫలములై రేకెత్త వయ్యారె! తుం
దుడుకు ల్వన్నగడ త్తదంతికమున న్ద్రోసిపాడి రాపాడినన్॥ 799
మ॥ "ఇదియేమే! మనరాజ్యలక్ష్మిపయిఁ దా నిన్నాళ్లుఁ జూపించు స
మ్మదసమ్మర్దము ప్రేమ మాఱడిగ సంభాషించుటే న్మాని యీ
కుమరై యొక్కటనిల్వ కారటము నెక్కొన్నట్లు వర్తించు జేఁ
డదిరా! కాశికి నేగి వచ్చుటమొద ల్వ్యత్యస్తముల్కృత్యముల్"॥

శా॥ "జానే! చీటికిమాటికి న్బుజుక లేదా! యోష్ఠము ల్గడము
"న్నే నేరోకనుఁగోవె"యంచు వెనుక న్నిల్చుండి క న్మూయ లే
దా! "నానాతి"యటంచు బుగ్గలపయి న్దాటింపలేదా! "మనో
జ్ఞా! నిన్నేవిడ"నంచు ముద్దుఁ గొనలేదా! యేటిపద్దోఁగదే:"॥ 801

శా॥ "చానా! యెంతటిజేలవమ్మ పయివేసూ ల్చూచి యిల్లైతి వెం
దే నమ్మ న్మగవారు యోగ్యులఁటె! ధాత్రీనాథుఁడాపైనిఁ, దె
ల్వీ! నిన్నేవిడనంట కర్థ మెఱుఁగ న్లేవైతి మమ్మాదట
న్బోనాడె న్గద వీంద్రబాస నిజమానో? యేటిపద్దేగదే!"॥ 802

క॥ అని యాడిపోసుకొను వా
రిని వారలనిష్ఠురముల హృదినెన్నక గొ
బ్బున వస్త్రాలయమున దు
స్తును మాఱిచికొనుచు నతఁడు తోఁటంబడియెన్॥ 803

చ॥ గుమగుమలాడువాసనలఁ గొల్పెడుసంపెగమేల్పొద ల్తద
ధ్వము నిరుక్రేవల న్వెలయ వానిదెస న్గనుఁగోఁడు; గోడుఁ బా
పుమధురమందవాయువులపోకడ హాయిఁ గొనండు; రాత్రిరా
ణి మిగులుసౌరభంబు గమనింపఁడు; నింపఁ డికెద్ది వీనులన్॥ 804

శా॥ మిన్నుంజూచునొ చూడఁడో యెగుతల?, న్మీసాలఁ బల్మాఱును
వ్వ్రు, న్నిల్చు, న్దెగువన్నను, న్మనసుతెంపు న్మాటకందిచ్చు, నే
రున్నారోయని నద్దెసల్కనును చేయూఁత న్విరంబూని య
త్తెన్నందే యొకతిన్నెఁ గాలిడు నివృత్తి న్గొన్నచిత్తంబునన్॥ 805

ఉ॥ "ఆగు"మటన్నటు ల్పెలుచ నవ్వలఁ జూపును హస్తసంజ్ఞ; వేఁ
గౌఁగిలిగాఁ గరద్వయిని గాలి గ్రహించును, జిచ్చువాటుచేఁ
దూఁగు నొకింతఁదేఱుకొని త్రోవగమించు మొగంబుపైనఁ బె
న్జెగుఱుఁగూర్చు నంతటనె చిర్నగవు న్గొను వేడికోల్గతిన్॥ 806

ఉ॥ "అంతయు రాష్ట్రవృద్ధికి నుపాంగముగాఁగను నేను నిట్టు లీ
కంతునిరంతుల న్జెడుటె? గాఢమప్రేమము, దానికంటె ని
ష్ఠెంతయుముఖ్యమామగధనెట్టులొ గెల్చి పరాభవంబుఁబో
గెంతుట; పైయశోధరయుఁగేలికిఁ జిక్కదె?"యంచు నెంచుచున్॥ 807

క॥ చాట శిలావిగ్రహముల
వాటంబున నిలచుభటులఁ బాటింపక య
చ్చోటిమణులకూటంబున
నీటున్సింహాసనమున నెగడినయంతన్॥ 808

క॥ ఒక్క ప్రతిహారి యెడనెడ
మ్రొక్కుచు "నోఱేఁడ! ద్వారమున జిఱుతోఁట
న్నెక్కొని యానతి వేచెద
రెక్కడి బ్రాహ్మణులొ యిరువు రేయానతియో?" 809

ఉ॥ ఊరకయుంటె యొప్పదలయో! చని తెచ్చెనువారి దూత; న
ప్పారులు నాగమోక్తులను వర్ధిల దీవనలిచ్చి యాజ్ఞ నా
చేరువపీటలం దధివసించిరి; ఱేఁడును, సన్న బంటు ,లా
తీరముఁ బాయఁ, జూచెఁ గడుతీక్ష్ణముగా నొకకొంత వారలన్॥810

చ॥ భయమును జిచ్చుపాటుఁ దుడిఁ బత్మ్మములం దదురేని సుఃత వా
రియునికిఁ గానరామి మదిఁ దృప్తివహించి, "కవీంద్రులార! రా
ణ్ణయము కఠోరమంట మది నాటియెయుండును మీకు విద్యల
న్నియుఁ గని మిన్నలై యురక నీచపుభూమిక లాశ్రయింతురే?"॥811

ఉ॥ నావుడుఁ బల్కె భారవి "మనస్వులు భూపు లెఱుంగరాని వే
లావిలసిల్లు? దర్శనఫలంబునుగోరి ప్రవేశకంబుగా
భూవర! భూమికల్గొనుట పూర్వమునుండియు నున్నదాట నీ
క్రేవ నొకింత తెంపునఁ జరించితి మార్తి భవత్కృపార్థమై॥ 812

చ॥ ప్రజలను గన్నబిడ్డలుగఁ బార్థివుఁడు, ద్విజ లాధరాధినా
ధు జనకునట్టు లెన్నినఁ జతుఃపురుషార్థము లట్టిరాష్ట్రమం
దు జయముఁగొల్పునంట కడుదొడ్డనయం బటుగాన మేము మీ
విజయము మాహితంబు సరవి న్గనవచ్చితిమయ్య! యింపులన్॥813

ఉ॥ షోకిరిగాఁడు సాధుజనపూజ్యుఁడు నాజనకుండు వేదని
ష్ఠాకలితుండు యాత్రవరుస న్మగధ న్జరియించుచుండ నే
సా కొకయింతలేక చెఱసాల సభార్యు నిబద్ధుఁ జేసె న
య్యా! కృపమాలి మాగధుఁ డహంకృతి; బీరము సాధుబాధకే?॥

క॥ విడిపించుకొనఁగ మే మే
గెడుచోఁ గామ్యైకవనంబు క్రేవలఁ గానం
బడియెఁ జతురంగబలముల
విడిసినయొకసేన గహనవీథులలోనన్॥ 815

క॥ అలకాశీవిశ్వేశ్వర
నిలయంబునఁ దాము మగధనృపసంజాత
న్వలచి యలయించితిరఁట యా
చలమున వత్తురఁట పగను సాధింపంగన్॥ 816

సీ॥ అలనారసింహబాలాదిత్యమాగధుం
డస్వస్థుఁడని వినవయ్యె నచట,
నెవరో యశోధనుం డీసేనకొడయఁడై
కారాలు మిరియాలు నూఱుకొనుచుఁ
జంపెదఁ జత్తున న్దెంపుగానినాఁడఁట,
సన్నాహమంతయుం జాలఁగలదు,
రాష్ట్రంబుఁ బ్రజయును రాయిడిం బడకుండ
వలయుప్రయత్నము ల్సలిపి, యేమి
ప్రతికృతి నొనర్ప నెంతురో పరమశీఘ్ర
గతిగ నిర్ణయ మొనరింపఁగనుఁడు భూప!,
నాకుఁజూడంగ నడిమిసేనఁ గికురించి
మగధపై ముందు పడుట సేమమని తోఁచె" 817

క॥ నాఁగ న్నారాయణుఁ "డది
బాగు; రహస్యం బిఁకొండు పరఁగు వినుం డా
మాగధిపై మగధశ్రీ
పైఁ గన్ను యశోధనునకు వసుధాధీశా! 818

ఉ॥ మాగధియుండు నిం దనుగుమానున వెంటనె దాడికోలుగా
సాగక రాయబారమును సల్పునరంచుఁ దలంతు, నామె యె
చ్చోఁ గనుపింపలేదఁ టెటుచూచిన ము న్మగధ న్జయించి పై
యోగము తెన్నుటొప్పు; తమయోజనవెంబడి సాగఁ జూడుఁడీ॥

శా॥ సందేహింపకుఁడయ్య వేగుఁగొనువాంఛ న్రాకయం, చాసభన్
సందర్శించితి మెచ్చుమి మ్మపుడె విజ్ఞాతంబు రాట్పుత్రి లే
దిందం, చాయమ దక్షిణాభిముఖియై యేచాయనో యేగుటల్
ముందే యించుక వీనులంబడియెఁ దాము న్వింటిరో లేదొకో!॥ 820
శా॥ మీయాజ్ఞ న్నడువంగ సిద్ధులముసుమ్మీ! రండు నాతోడ నం
ద్రో! యెట్లైన యశోధరన్ దెలియుఁ డర్ద్రో! యెల్ల మీచిత్తమ
య్యా! యుద్ధంబున గెల్పుతోసరిగఁ గళ్యాణంబుఁ జేకూర్చుటల్
మాయుద్యోగముగాఁ గొన న్గతుక మిమ్మాడ్కి న్విజృంభించెదన్"
భా॥ శా॥ "భూమీశా! తమ రన్నిఁట న్గుశలు లెప్ప న్గోర రేసాయమున్
సామాన్యార్థులమేము నాజనకుమోక్షంబు న్సమర్థింప మీ
రేమాద్రినెన్నెలవీయ నట్టులె ప్రవర్తింపంగనున్నార మీ
నామిత్రుం డటు మిమ్ముఁ జేర్చ, నృపకన్య న్నేగవేషించెదన్॥ 822
శా॥ కాదేని న్మిము నేనకొల్తు, నితఁ డక్కన్య న్గనన్బోవు లే
దా! దోయి న్మము మీరకొంచుఁజన నిర్ధారింతురే న్వత్తు మే
దోదారి న్నెలవిందు మాయుడుతబత్తు ల్చాపుకొమ్మన్నచో
నాదాక్షిణ్యబలాన బాలఁగొననా నాఘాలమేఘాలపై" 823
మి॥ ఉ॥ "పండితులీరు బ్రాహ్మణులు భండనచర్యకుఁగారు, మీకడ
న్గొండొకసాయము న్గొనక కూడదె మేలొనరింప, మీర లిం
దుండుఁడు హాయిగా, వసతులొప్పుగఁగూర్ప నమర్తుఁ, గార్యము
న్లెండును నాకులెక్కయె?ఫలించును లెండు కొనుండునానతుల్॥
వ॥ అయిన మీతండ్రిగారిపేరేమి ? 825
భా॥ (వైపరీత్యంబుచే నగు వైమనస్యంబు ముఖమునఁ దోఁపనీయక).
(మిత్రునితో)
శా॥ "నేస్తుండా! సుగుణాలకుప్పర!
(రాజుతో) భవానీభట్టు నాతండ్రి యా
గేస్తు న్గొల్చెడు పూర్ణమాంబ, నిగమోక్తి న్భర్తృసేవారతిన్,
సిస్తునేర్పరు, లాహితాగ్నులు, గుణశ్రీరాజితుల్ సాధుతన్
మస్తోకీర్తిగలారు, తెల్పఁగమశంబా ! వారిసద్భోగ్యతల్॥ 826

ఉ॥ నాయనమేనికాంతి యరుణంపుఁదొగరొ్కాను తెల్పు, వీనుల
త్యాయతముల్ భుజాగ్రముల నంటుచునుండును, నాస విల్లువం
పైమెసఁగు, నైవులుప్పఁఱుకునత్తులు, మోమువిశాల, మక్కుడా
చాయలఁ జూచుకంబుకుడిచక్కిగఁ బుల్పిరి యొండు భాసిలుఁ॥827

ఉ॥ అమ్మ, కడానిమేనిజిగి నాకనుముక్కులతీరున న్నమా
నమ్మగు నాకు, సవ్యనయనంబుకడ న్నను జెక్కునందుఁ బొం
కమ్మగుఁ బుట్టుమచ్చ, నుడికారము పంచమ మందుపీరిబం
ధమ్ముడిగింప నేనును జనన్వలదే తమతోడ భూవరా!॥ 828

తే॥ గీ॥ కత్తులుఁ గటార్లు నూటఁ జేఁగాకయున్నఁ
గవినిగాఁ గొంత పేర్వడ్డకారణమున
నూటివోసెద నుత్సాహసారమెల్లఁ
జేరి ప్రతిసైనికమనస్సరోరుహమున"॥ 829

మ॥ శా॥ "ఓవిప్రోత్తములార! బాకిపడి యేనున్నాఁడ మీకింతకే
నావైరిస్థితిఁ దెల్పినందులకు, సంగ్రామంబునం దెప్డు ముం
దైవర్తించు మదీయశాతతరఘోరాసిప్రభాజాలమే
నావీర్యంబె యొసంగు సేనలకు విన్నాణంపుటుత్సాహముఁ॥

క॥ ఓరీ! భటులారా! యిదె
వీరింగొంపోయి మంత్రి వీటికెలనిశ్శృం
గారాగారంబున నుప
చారంబులఁ దనుప నాన సచివున కనుఁడీ"॥ 831

క॥ అని మిహిరుఁడు చన శకటుం
బున వారింగొని భటోత్తములు వెడలగఁ ద్రో
వను నొకపొదమఱుఁగున యొఱు
కనుఁగని భారవి వచించెఁ గడు గూఢోక్తిఁ॥ 832

క॥ "నారాయణుఁడా! కను మా
మోఱకు నెఱుకుఁ గుఱి న్విమోక్షింపఁడు తాఁ
గోరినపిట్టల ఢేగ మ
హారయమునఁ దన్నుకొనుచు నరిగిన నేనిఁ"॥ 833

నా॥ తే॥గీ॥ "డేగ కారాడుచుండఁ దిండియును విడిచి
వడిగఁ బిట్టలు గూండ్లలోఁ బలికెఁ బోయెఁ
బిల్లలకు జాగరూకత వినుచుపగిది
ప్రకృతిచిత్రంబు నేమనవచ్చు సఖుఁడ!"॥ 834

వ॥ అని యన్యాపదేశోక్తిగా భామల్లునకుఁ దమస్థితియు నతఁడు స్కంధావారంబుం జేరి సర్వం బచటివారల కెఱిఁగింపవలయుటయుం బలికి యామిత్రులిరువురు నిర్దిష్టంబగు విడిదలకుం జేరఁ గొంత కచటికి మంత్రి చనుదెంచి నమస్కరించి॥ 835

తే॥ గీ॥ "దిగువయుత్తరవులదాఁక సుగముగాఁగ
నుండఁదగు మీర లీమేడ నుచితగతుల;
నిచట నాతోఁటలో విహరింపవచ్చు,
బయటి కేగుటమాత్రంబు పనికిరాదు॥ 836

క॥ మీకు న్వలసిన వన్నియు
నేకొఱఁతయు లేనియట్టు లీయంగఁబడున్
వైకల్యముఁ గొన కుండుఁడు
మాకుఁ బరుషగతికి నెపము మానెడు రీతిన్॥ 837

ఉ॥ సేవకులార! వంతుఁగొని సేయుఁడు వీరికి సేవ, పార్థివా
జ్ఞావశవర్తులై" యనుచు శాసనమిచ్చి యమాత్యుఁ డేగె, న
చ్చో విలసిల్లుపీఠముల సోలి హితు, ల్పనివాండ్రఁబంపి, 'యే
రా! విధి' యన్న 'యేర! విధి'యంచు దిగుల్గొని కొంత తేఱుచున్॥

నా॥ఉ॥ "సౌఖ్యము సౌఖ్యమన్నను కులాసగఁ బద్యములల్లుకొంటయే!
శక్యమశక్యమా మఱి యశక్యమె శక్యమగు, న్నిజంబులౌ
వాక్యములైనఁ జూడు నరపాలుఁడు నమ్మియు నమ్మనట్లుగా
నైక్యతఁజూపె రాజనయమందు సమర్థత తేటతెల్లఁగన్॥" 838

భా॥చ॥ "విరసములాడఁడు న్బరిభవింపఁడు నొంపఁడు పొల్లుమాటయే
దొరలఁగనీఁడు నించుకయుఁదొణ్కఁడు మేల్మరియాదఁజూపు;
ద్దిర! దొరనేర్పు! కార్యమునతీక్ష్ణత నిండయియుండెఁ, జల్లగా
నణకుటె రాజనీతియగునా తగునా! తెగ నీవిధంబుగన్"॥ 84

నా॥మ॥ "మనల న్నమ్మిన మోసమౌనో, తెగి నమ్మంబోనిచో కాఁగనుం
డినకార్యంబు సురింగిపోనో యనుసంధిం బడ్డవాఁడౌట వా
ర్తను నిక్కంబును దబ్బర న్దెలియుపర్యంతంబు నీఖైదులో
నునిచె న్దామనలః న్నిజంబగుట మాను న్నందియుం బవ్వలన్"॥

భా॥ఉ॥ "కాని యసిద్ధమై మగధ క్రౌలక వీరబలప్రబోధ నెం
తేనియు సిద్ధమై వెలయు నిక్కము, దానినెఱింగి భూపుఁ డే
దేనపకార మెన్ను మన, కియ్యది మిక్కిలిరూఢ, మందుచేఁ
బూనికఁజేసి తప్పుకొనఁబోలునుజు మ్మిటనుండి సత్వరన్"॥ 842

క॥ అని మంచిచెట్ట గుసగుస
ననుకొనువారలను దరిసె నప్పుడె వంతొం
దిన సేవకుండు నోటిప
యిన కరమిడుకొనుచు నబ్ర మెనసినకనులన్॥ 843

సే॥ తే॥ గీ॥ "వీరధర్మమహీపాల విబుధసభను
బహుళగౌరవమొందిన భారవులొకొ!
నేఁటి కీబంది వెలయంగ నేటికొక్కొ!
బ్రతుకు పైతీపి విడచితిరా! మహాత్మ!॥ 844

ఉ॥ ప్రాణము లేచివచ్చె భగవత్కృప మిమ్ముఁ గనంగ నయ్యో! మా
రాణియు రాజు నేమయిరొకో?, రక్కసిగుంపులఁ జిక్కె వీడు, సు
త్రాణము సున్న, పూర్వనృపరక్తులఁ జంపుట నిత్యకృత్య మీ
రాణ నసత్యజీవనమురాయిడి యెన్నిదినాలొ నాకిటన్"॥ 845

భా॥ క॥ "శోకింపకయ్య! నృపులు
త్సేకంబున దాడివెడలు తేకువఁ గల రా
రాకకు వలసినసాయము
లీకడ నుండినను సంశయింపక చెపుమా!"॥ 846

సే॥ క॥ "సాయమున కేమి నృపులీ
చాయకు వేంచేయ వీనిసైన్యంబున నె
ట్లో యొదిగియున్నభటు లా
ప్యాయమ్ముగాఁ దొలఁగి చేరవత్తురు పెలుచన్॥ 847

క॥ సుదినంబు నేఁడు రాజులు
బ్రదికియుండి యిటకు దాడివత్తు రనవిన్ర్వా
మదిమది నిఁక నేయఁగచా
ట్లడిమిన సాధింతుఁ దదభియానము దీక్షన్"॥ 848

నా॥ ఉ॥ "యోగ్యుఁడ! నీస్థితి న్మఱువకోయి! చెవుల్కలగోడలుండు, మా
భాగ్యముజువ్వె నీవు కనుపట్టుట, మే మిటనుండి పోవ నే
యుగ్యము లైనఁ దోఁటతుది నుండఁగవీలగు నేని పోయి స
మ్యగ్యతనంబుఁగూర్తుఁ సమస్తజనార్తివిమోచనంబుగన్"849

సే॥ క॥ "అగుచో నీనడి రేయిన్
దెగువంగొని తోఁటనైబుతిన్ గలవకుళం
బెగఁబ్రాకి యవల దిగుచో
నగపడు మీ కశ్వయుగ్మ మవలఁ జనంగన్॥ 850

క॥ అప్పటిరక్షకభటునకుఁ
జెప్ప నలవిగానికోర్కి చెలగుఁ నభిని నే
చొప్పననే నిద్దానిన్
మప్పిన శీఘ్రముగ నతఁడు మలయు న్నిద్రన్"॥ 851

క॥ అని నల్లమందుతోఁ జే
సినమాత్రల నొసఁగి యటఁ బచేరించెడిచో
నినుఁ డపరవారినిధిదాఁ
టుఁనఁ జనె నటుజగముల న్గడువ్వెలిఁగింపన్॥ 852

ఉ॥ అంతకుమున్నె యాదెస విహారముగాఁజని మిత్రులిర్వు రా
ప్రాంతముదారులు న్బొగడ వర్తిలువైఖరి నాకళించి యే
వంతయు లేనటు ల్తిరిగివచ్చిరి మేడకు నంత రాత్రిరా
న్గాంతుక కిన్నరీస్వనముఁగొల్పఁగఁ బాడిరి దేవగీతికల్॥ 853

భా॥ శా॥ "శ్రీకైవల్యపథాధినేత వనుచున్ శ్రేయోనుసంధానసా
మ్యాకారుండ వటంచుఁ బొల్కడలి సర్వాధిష్టత న్నిల్తువం
చాకాంక్షింత్రుజను ల్మహాత్మ! పరమేశా! నీదుకైవల్యమే
దో! కర్ణాక్షి యెవండొ? క్షీరనిధి యెందో? చూడ రొక్కింతయున్!

తే॥ గీ॥ పంచభూతాత్మకములౌ ప్రపంచసమితి
నెంత గాలించినను పాలయేటుగాని
పాపపానుపుగాని నీపడకగాని
కంటి మనఁజాలువార లొక్కరును లేరు॥ 855

క॥ నీలో నీలాకాశం
బాలో గాలియును దాన ననలము నంత
న్నీళులు పదపడి భూమియుఁ
గ్రాలు టె సృష్టిక్రమంబుగాదె! ముకుందా!॥ 856

ఉ॥ కన్నులవిప్పి మిన్నుఁగనఁగా నుడుసంతతి లెక్కకెక్కుడై
చిన్నలుఁ బెద్దలు న్వెలుఁగుఁజిమ్ముచుఁ దళ్తలలాడు; భూమియు
ట్లెన్నిఖిలంబులు న్దెలియ నించుగమించుగఁ బంచభూతసం
పన్నతఁ గన్నవేగద విభాసహితాయుతవైస్యుతంబులై"॥ 857

నా॥ఉ॥ "ఎప్పుడు తాడుతో విసరి తిన్నఁటి? సంభ్రమణంబు దీర్ఘమై
యొప్పఁ బ్రపంచగోళతతి యుప్పరసీమల బొంగరంబులై
ముప్పిరులైన పోబడులఁ బోవుచు జంటలు గుంపులై వడి
న్దప్పక సంచరించెడివిధంబు మహాద్భుత ముబ్బఁజేసెడిన్॥ 858

తే॥ గీ॥ ఉమ్మొబుడగల గాలిలో నూఁదుచుండఁ
దరతమాకృతుల న్బయ ల్తారసిల్లి
తిరిగి ప్రీలి నశించుమాదిరిగ నున్న
పాంచభౌతికసృష్టి శాశ్వతమె యన్న"॥ 859

భా॥ తే॥గీ॥ "శాశ్వతుండవు నీవెడ? నశ్వరంబు
గాఁజెలంగెడు భౌతికకాండ మేడ?
నంటియంటక దాన దోఁగాడుదొంగ
బూచివగు నిన్గుటించి యేమో వచింత్రు"॥ 860

నా॥శా॥ "నీకై వల్యపదంబుఁజేరుటకు ప్రాణివ్రాతముల్ భౌతిక
శ్రీకంబైన ప్రపంచరంగతల మాసింపంగ సంసిద్ధియా
నే? కష్టంబొ? సుఖంబొ? నాఁక దృఢత న్నిష్ఠించి న్యాసాత్మకం
బౌకాలంకషసత్త్వంబునకు నాయత్తంబుగాకుండినన్?॥ 861

శా॥ పాలే తేయొకగోళమందో కలదన్భావంబు పెన్భ్రాంతి; భూ
తాళీబద్ధతనూవిలాసుల కగమ్యంబైన తద్ధ్యానము
న్గాలింప న్దొరకొంట వెఱ్ఱియగుఁగానన్ భక్తి యుత్కృష్టత
న్గ్రాల న్న్యాసతపోవిభూతిని శరీరస్థు న్గనంబోలదే?”॥ 862
భా॥ తే॥ గీ॥ “బొందితోడుతఁ గైవల్యభూమిఁ జేరఁ
ప్రతిమనుష్యుండు నుబలాటపడుచుఁగోరుఁ
గాని యాతావు, తనదుయోగ్యతను గనఁడు
గ్రుడ్డియై ద్దొకమడిఁ దగుల్కొనెడిభాతి॥ 863
తే॥ గీ॥ పంచభూతోద్భవంబయి ప్రబలుదేహ
మేగఁగలదె భూతాతీతభాగములకు?
భూమిపై నావరించిన భూరిపవను
దాఁటిన స్సీతువున మేను దద్దరిలదె?॥ 864
తే॥ గీ॥ గడప దాఁటియుదాఁటనియెడనె సూరు
బారులన్నియుఁ దీఱినతీరుగాదె
పవను గెల్వంగలేక కష్టపడువాఁడు
దాఁటఁగలుగునె యాకాశతత్వపథము?॥ 835
శా॥ యోగప్రాభవమొందు మానసబలోద్యోగంబునన్గాక యా
నే? గంతవ్యము క్షీరవారినిధి? చన్నే చూడ శేషాహిన్?
రాగంబుల్త్యజియించి భక్తిపరతంత్రత్వంబు సంధించిగా
కేగంగల్గునె మోక్షవీధి? కనువానే దేవు దర్శింపఁగన్?॥ 866
చ॥ శమదమసత్యశౌచముల సత్పథమూని చరించి శ్వాస ను
త్తమగతి సంయమించి జడతన్బడుకుండలి లేవఁగొట్టి చ
క్రముల నతిక్రమించి యభిరామసహస్రదళాబ్జమొంది యా
దమృతమయోరుధారఁ గొని యాత్మకధీశ్వరుఁ జూడఁబోలదే?॥ 867
మ॥ అటు నెందో కలవన్న పాల్కడలి శేషాహీంద్రుఁ డాత్మేశ్వరుం
డిట వేరేకులతమ్మిబొడ్డుపయి నెంతేహాయిఁ గన్పట్టు ను
త్కటహర్షప్రదమోక్షభవ్యసుఖసంధానైకకైవల్య మి
చ్ఛటఁ జేకూరుటలేదె బొందియెసఁగ న్సంపూర్ణతారూఢమై?॥ 868

మ॥ అదియుం గష్టమటంచుఁ దోఁచిన ననద్వాప్యమోహాము ల్మాని స
త్పదవీబద్ధమనంబుఁదాల్చి సకలార్థంబు ల్జగన్నాథుసం
పదకు న్నైన్మకురంబు లన్మది కృతవ్యాపారము ల్తత్ఫలా
దివిదృతు ల్భగవంతు కైవదలిన న్దీపింపవే సద్గతుల్?॥ 869

ఉ॥ యంత్రము నేను, కీ లెఱిఁగి యాటలఁద్రిప్పుట నీవు కార్యము
ల్తంత్రములు న్ఫలంబులును దద్ఫలభోక్తవు నీవ, కొర స్వా
తంత్రత, మంచిచెట్టల నిదానము నాయెడ లేదు, నాకు నీ
మంత్రమె ప్రాపు, ముంచెదవొ మన్చెదొ యన్నప్రపత్తిచాలదే?"॥

క॥ ఈమొదలగు గీతాంజలు
లామోదరసాప్లవమున నట రాగాబ్ధి
గోమలత నిగుడఁ బత్తుల
తో మహి నిశ్శబ్దయగుచుఁ దూఁగన్దొడఁగెన్॥ 871

ఉ॥ అర్ధమ రేయి కౌభటుని యాగమనంబు నెఱింగి యప్పుడే
నిద్దుర కేగుచున్నటుల నీలిగి భారవిలేచి "భాయి! నీ
యొద్ద నొకింతకప్పురమెయున్న నొసంగుదె నల్లమందులో
నద్దగ" నన్న వాఁడును స్మితాననుఁడై కుతకంబు రేఁగఁగన్॥ 872

చ॥ 'ఇదెయిదె నాకు మాత్రయొక టీయుఁ' డటంచును డాయ 'నిస్సిరో!
పది యివె' యం చొసంగె మనభారవి, వానినిమ్రింగి సుంతలో
నొదిగిలి వాఁడు నిద్రఁగొనె; నూర్పుల బిట్టుగఁ గ్రుక్కుకొంచు నె
మ్మదిఁ జని రాహితు ల్తెగువ మల్లటలాడఁగఁ దోఁటబైటికిన్॥ 873

మ॥ అటఁ గైలాగుల నాశ్వికద్వితయ 'మయ్యా! స్వాగతం'బంచు ము
చ్చటమీర న్నయికొంటచేఁ జకితులై సందేహము న్బాన న
చ్చటనే తోఁచెను పూర్వసేవకుఁడు "మెచ్చున్వచ్చు మీతెంపు బా
సటగా వీరలు మిమ్ముఁ గొల్తు రికడువిశ్వాసార్హులేయాఁ జూఁడీ!॥

శా॥ రం డీకత్తులుఁ గత్తళంబులు శిరస్త్రాణంబులు న్వేగఁ గై
కొం డీయశ్వము లెక్కి పొం డవెసుఁడీ! కోదండము ల్బాణముల్
చండాంకుర జిడుదండము ల్నృపతిపజ్జ న్దెల్పుఁడీ! వేళయొ
క్కం డేతెంచిన నేను సాహితులు మీకై నిల్తు మన్నాటలన్"॥

మ॥ అని చేయూపుల నాతఁ డుబ్బొసఁగఁగా నాయాశ్వికు ల్నల్వురున్
ధ్వని రేఁగింపక శాద్వలస్థలులమీఁద న్గొంతదవ్వేగి తెం
పున నాపైఁ బెనుదాడుతోఁ జనిరి, మావు ల్వారిభావంబులం
గనుఁగొన్నట్టులు మెర్పుతీఁగెలొయనంగా స్వారి సాగింపఁగన్॥ 876

ఉ॥ అట్టులు క్రోసులైదు చనినంతటఁ దూరపుతెల్లవాటు నా
జెట్టులు కళ్ళెము ల్బిగువుచేసి తటాకమొకండుతోఁప నా
గట్టునడిగ్గి వారశ్వములఁగట్టి పదంపడి కాల్యకృత్యము
ల్నెట్టినవెన్క నూతనుల నెమ్మిచెలంగఁగఁ బల్కరించుచున్॥ 877

భా॥ క॥ "హితులారా! మాకు న్బరి
చితిసేయరె పేర్లు చరిత శేముషులెల్లన్
వితగానిస్నేహమున కా
యతులము వింటిరిగదా మదాద్యంతంబున్"॥ 878

రు॥ చ॥ "రుచికుఁ డటంద్రు నన్ను, సగరుం డితఁ డుజ్జయినీపురంబె మా
రుచికగుపుట్టినిల్లు, భుజరుట్కళ మామకజీవనంబు, నీ
చచరితుఁడైన యామిహిరు జన్యమున న్వధియించి వీరధ
ర్మచతురభూపు రాజ్యపదరంజితుఁ జేయుటె మాప్రతిజ్ఞయా"॥

స॥ శా॥ "డింభుం డం చొకమాటుపేరుఁ గొని పాడి న్వమ్ముఁగావించి ని
ర్దంభు న్మంత్రిని పాఱఁదోలి కడునిర్దాక్షిణ్యుఁడై దుష్టసం
రంభంబూని నృపాలుఁ బ్రోలు నిశి నాక్రాంతి న్గొనె న్దొంగ; యు
ల్లంభింపం బనిలేదు, డాఁసెమృతి గల్లంచు నానీచునిన్॥ 880

శా॥ రాజేమయ్యెనొ?; మంత్రి రాసుతుని వార్తామాత్రమే న్లేదు; వి
భ్రాజన్మార్తులు వీనిపాల్పడిరో? పంతంబు నెవ్వారికై
రాజ న్నేఁపుదమంచు నిస్పృహుల నారంభంబుఁ గైకోము నేఁ
డో? జాడ్యంబుఁద్యజించి చించెదము గండోలంబునా డింభునిన్"॥

రు॥ ఉ॥ "మేమననేల? నుజ్జయిని మేకొను బాలురెకాదు బాలిక
ల్దీమసమొప్పఁగాఁ దగుకృతి న్మిహిరు న్వెలిపెట్టెగెంట నే
మేమనుచుంద్రు; వచ్చినది యిప్పటికి న్సమయంబు; వానిత్రు
ళ్లాము ననీతి పండె; సుఖులై ప్రజ లుందురుగాత నెల్లెడన్"॥ 882

క॥ అని క్రమ్మఱఁ బయనంబై
చను వారలదారిలోన "జై! మిహిరున" కన్
ధ్వని " వీరధర్మునకు జై! "
యను కేకలతోడఁ బోరు నలికిడి తోఁపన్ ॥ 883

క॥ వడి యినుమడించుకొని య
య్యెడకు న్జని కనుఁగొన న్మిహిరుయోధులఁ జొ
ప్పడుచుండెఁ బోరు హూన్నుల
తుడుమున కుజ్జయినిబంట్లతోఁ దీవ్రముగన్ ॥ 884

క॥ అదికని రుచికుఁడు దేహం
బెదుగఁగఁ " బోదువుండు వీరి నిందఱ "నని బె
ట్టిదముగఁ దాఁకఁగ సగరుఁడు
గదిమినడువ సఖులుఁ జోరవగా డీకొనఁగన్ ॥ 885

చ॥ ఇపుడు సమానసంఖ్యఁబడి హిందువులు న్మరి హూన్నయోధులు
న్విపులపరాక్రమానుగతి వెన్దివ కేపునఁ బోరుచుండ నా
విపుల తదంఘ్రిఘట్టనల బిట్టుగ నట్టువమ్రోతఁ గొల్పె వి
న్నుపథము సింహనాదముల నూల్కొలిపెన్బొరి మూర్ఛనంబులన్॥

చ॥ చకితవిహంగరావము ప్రశంసగ వర్తిలుచుండ, 'ఖంగు' 'ఖం
గు' 'కిటకి' టాదిఖేటకగదాకుటిలాయుధఘర్షణధ్వను
ల్వికటమహాశ్వహేషలు వనీమృగనాదము లందు యుద్ధనా
యిక పలికించు వీరవిరహిస్వరకల్పనలై వడి న్గొనెన్॥ 887

శా॥ అందుం భారవిపైఁ బడ న్దివురు హూన్నాయోగ మూహించి త్రి
ప్పుందర్పంబున నాత్మఖడ్గమునఁ ద్రోపుం జెందఁగా దాయక
త్తిం దట్టించుచు డాలుబాకతని చేతి న్జివ్వఁ జొప్పింపఁ జి
వ్వం దార్ఢ్యంబును నాయుధంబు విడి పర్వంజొచ్చె వాఁ డంతటన్॥

ఉ॥ చివ్వన మావుపై కుఱికి చే నొకబాకు గ్రహించి "యోరి! కా
ల్నొవ్వఁగ నేయు దొక్కడుగునుం గదలించితివేని నిల్వు"మం,
దవ్వల నిన్నుఁ గాచుటకునై భవదీయు డొకండు లేఁ, డదే!
దవ్వుల దువ్వరేఁపుకొనుదండడి, హైందవపాంథు, లయ్యరే! 889

క॥ ఓహో! భామల్లా! నీ
వీహన్ను న్వరించికట్టు, మెటొ పర్విడు నా
రాహుత్తు నటిమి తెచ్చెద,
నాహావమునఁ గూడ దొకరినైనను వీడన్”॥ 890

క॥ అని యురవడించి పగతుమె
డను బిగియింపంగ నుచ్చు డబ్బాటుగ వె
న్కనె పఱచి విసరె భారవి
కనుకని నతఁ డుర్విఁ జాపకట్టుగఁ గూలన్॥ 891

భా॥ చ॥ “రమణియె” నాఁక “బాపనగరాసి”యటంచు నిరాసనంబు నా
డె మిహిరుఁ డల్లకాశిని గుడి న్గరిడింబురడింపలేఁడ; త
త్సములగుమీరు “హిందువులు సాధులెకా!”యని యొంటికాలిపై
దుముకుడు రెప్ప డూడిపడదో తల భూస్థలి సొదు రేఁగినన్?”॥892

చ॥ “కదలకు”మంచుఁ గాల్మెడకుఁ గట్టి తురంగముపైనఁబెట్టి మే
ల్చదురున వెన్క కశ్వములఁ జయ్యనఁ దెచ్చుచునుండ, నొక్కనిం
జెదరఁగ నీయ కేపొదవఁ జిక్కులనెట్టి చికాకుముట్టఁ బ
ట్టి దడియుహన్నుల న్గతువడి న్దరలించిరి హైందవాశ్వికుల్॥ 893

క॥ “ఫొరేలవచ్చెనో?”యను
భారవితో మాళ్వభటులు పల్కిరిటులు “దు
ష్టారంభమిహిరు నాజ్ఞన్
జారులమై వెడలి మగధసరిహద్దుపయిన్”॥ 894

తే॥ గీ॥ కామ్యకారణ్యమున కేగి కలుగువార్త
లెఱిఁగి తిరిగి యేతెంచుచో “మొఱకులార!
హన్నభటులార! కంటిరే? యల్లవీర
ధర్మభూజాని మీవాని తరతమంబు॥ 895

ఉ॥ వీరుఁడటన్న నిక్కముగ భృత్యదయార్ద్రుఁడు వీరధర్ముఁడే,
చోరుఁడటన్న మామిహిరశుద్ధకిరాతుఁడె, సంశయం బెద
న్దీఱదె? విన్నకన్న ధరణీవరు గౌరవనీయచర్యలన్
మాఱదె చిత్త? మామిహిరుమాటఁ దలంపక చేరుఁడీనృపున్॥896

చ॥ నిజ మతినిష్ఠురం బనుట నిక్కముగాఁ గొఱగానిసూడుఁ బూ
ని 'జయము హస్రప్రజాళి'కని నీలుగులెక్కఁగఁ గత్తులెత్తి డా
సి జులుముఁబూని రిబడుగుజెట్టులు సాక్ష్యకుఁ దామె మిన్నయ
న్బొజుగువెడంగునిబ్బరము పొంగులు కన్నులఁ దాండవింపఁగన్''॥

క॥ అంతట భామల్లుని వృ
త్తాంతము నాతండు వినపఁ 'దగు' ననుకొనుచున్
సంతసము మీఱఁ జేరిరి
పంతముల స్వీరధర్మపతి విడిదలకున్॥ 898

క॥ అందుల స్వాయముగ నెదుటై
బందీకృతహన్నులకు నభయ మిడి నతులం
గొందఱ నాశీస్సులచేఁ
గొందఱఁ దనియించె రాజకుంజరుఁ డంతన్॥ 899

భా॥ ఉ॥ "కంటిమిభూపతీ!,మిహిరుఁ గాఁ డతఁ డన్యుఁడుడింభుఁ డేసుమీ!
దంటలదంట లౌకికవిధానములందుఁ బ్రభుత్వవృత్తి, ము
క్కంటికి దీటుసూ! ప్రతిభఁ, గాలుఁ డె యాలములోన, నెట్లు ని
ప్పంటనికొయ్య, దార్ష్ట్యమున నగ్రసరుం డిఁక నేమి చెప్పుదున్"॥

నా॥ఉ॥ "కంటిమి రాణ్మణీ!, యతనికాల్బలు మాశ్వికసేన యేన్గుపో
జొంటెలదం డొకొక్కటియె యొక్కసముద్రమనంగవచ్చు, నే
తంటలనైనఁ బాలుఁగొన దక్షులు వాని యమాత్యులుం భటు
లొక్కంటెలు రాజకంటె, నొకకుంటికులాసియుఁ గల్గఁ డందులన్"॥

భా॥ క॥ "మము గౌరవించి విడిదై
దమరిచె హన్నదొర, యిచట నామగధ స్వా
త్తము లెట్లొ యెఱిఁగి తదనుగు
ణముగాఁ దీర్పొసఁగ, నేర్పునాణెముఁ గనుఁడీ!"॥ 902

నా॥ శా॥ "చండాంకుండఁట! మీకు భృత్యుడట! విశ్వాసంబు రెట్టింపఁగా
దండాల్పెట్టి వచించె, "డింభుని మహాదార్ష్ట్యంబున న్జచ్చియే
యుండంబోలు సభార్యుఁడై నృపతి నానోర్యజించి, వేసారి, చా
ఖుండ క్రనెక్కనకుండ మొండిబ్రతు కెట్లోదాఁటు నాబోంట్లకున్॥

ఉ॥ ఆతెఱఁగుజ్యోతి కాజ్యఘట మందినయట్టులు మానృపుండు దే
వేరి సజీవులై యిటకు వేఁజనుదెంతు రటంచువింట మా,
కీరెయిఁదోట్టి యిందుఁగలహింసువు లందఱు, భానురాక్షపై
నీరజపాళియ ట్లురవణింతురు నిల్వులవిచ్చుకత్తులన్”॥ 904

భా॥ఉ॥ “ఈరుచికుందు నీసగరుఁ డీకలమాళవవీరపుంగవు
ల్దారిని సంభవించినకలంత నలంత యొకింతలేక శౌ
ర్యారభటు ల్వెలార్చుటనె హన్నులయున్నతిఁ జిన్నఁబుచ్చుట
ల్భారమణా! త్వదాజ్ఞ నెటుపొమ్మనఁ బోనట సిద్ధులెల్లరున్”॥

రు॥ ఉ॥ “కన్నులుగల్గులాభమును గాంచితి మే మిట నిన్ని నాళ్ళ క
భ్యున్నతి రాణితో నొడయఁ డొప్పుటఁ గన్గొన, నంతకంటె మే
నన్నుకొనంగ మోద ముదయంబయి పొంగెడు సంద్రమట్లుమా
చిన్నదొర న్గనన్, మునుపు చేసినపున్నెము లింతయొప్పనే!”॥

స॥ ఉ॥ “పన్నులఁ గొంటగా దదరిపాటులదోపిడి యెందుఁజూచిన
న్మాన్నులు, వీరితాత యనయంబున నామిహిరాగుళుండు, ‘వీ
రెన్నటికైన దుంపతెగి యేగరె?’యంచు శపింపకుండువా
రున్నన్న, దయ న్జగత్ప్రభువు చూచెను నేఁటికి వారి త్రుళ్లఅన్”॥907

భా॥ మ॥ ‘మనసన్నాహ మెఱింగి ర’మ్మనుచుఁ బంప న్వీరు నీహన్నులు
న్గనుఁగోవచ్చిరి, వీర లియ్యెడనె చిక్క న్వార్తయే లేమికి,
న్దనపిట్ట ల్కికురించి యేగుటకుఁ, జిత్తం బుత్తలం బొంద నా
ఘనుఁడేదాష్ట్యముఁజేయఁబూనునొ యెఱుంగన్మాన్పముఖ్యంబగున్’॥

శా॥ నాఁగ న్భూపుఁడు వారికెల్లరకు సందర్భానుసారంబుగా
వాగుజ్జృంభణ మొప్పఁ బల్కి, యనె మాళ్వప్రాజ్ఞులారా! యిఁక
న్జాగొక్కింతయు లేక మీరు మగధ న్బ్రాపించి యాతని కీ
బాగెల్ల న్వినిపించి యిందు యువరాడ్వాగ్బద్ధ మీలేఖ్యమున్॥ 909

క॥ నారాయణభారవులా
రా! రాఁడిట మంత్రి, కబురు రా, దట నేయే
దారుల నేమయ్యెనో, త
త్ప్రారంభం బెటేఁగివత్తురా! వడికడఁకన్?॥ 910

ఆ॥వె॥ సగరరుచికులార! సత్వరంబుగను ను
జ్జయిని కేగి మీరు చండతోడ
నాకుమెప్పఁ బల్కు నాదు రేఁగనిరీతిఁ
గూర్పుమనుఁడు వలయుకార్పులెల్ల॥ 911

క॥ కానున్నది యుద్ధము చెడఁ
గానున్నది హూన్నరాజ్యగతి ప్రజకెల్లన్
రానున్నది సౌఖ్యము వెత
పోనున్నది కాలఁదిలోనఁ బొం డిఁక మీరల్"॥ 912

క॥ అని వారివారి కనువుల
ననువుపఱుప మొదల నొసఁగి యానాఁటికిఁ గొ
ల్వును జాలింపఁగ నెవ్వరి
పనిపై వా రరిగి రందు భారవి హితుఁడున్॥ 913

చ॥ కతిపయసేవకు ల్కొలువఁగాఁ బయనంబయి దక్షిణాపథం
బతిరయమొప్పఁ దాఁటఁ జనునప్పుడు బాట నొకొక్కచోటఁ బా
తితతరుశాఖకాప్రచయదీపితరాశుల గారు తోఁపఁ "జి
హ్నిత మిది యెవ్వ రేల పొనరించిరొ చూత"మటంచుఁ దద్గతిన్॥

శా॥ పోఁబో వాఁగులు వంతలున్నదులుఁ జెర్వుల్కొండలు న్మార్గముల్ గం
డ్లాబాట న్గనుపింపఁ దాఁటుకొని వారారీతి సాగంగ ను
ల్లాబైలం దొకచోటఁ గాంచిరి పరివ్యాప్తంబుగా నొక్కసే
నాబాహుళ్యము యుద్ధవస్తుబహుసన్నాహోసుబద్ధంబుగన్॥ 915

ఉ॥ వంటలఁ జేయువారలు, కవాతుల బారులు, వట్టివట్టిపో
ర్గంటుల కూనువారలును, క్రీడల మోదము నొందువారు, నీ
ర్పంటులఁ దెచ్చువారు, రణవార్తల బింకము లాడువారుఁ, జే
గంటల నాడువా, రచటఁ గల్గిన శౌర్యవిహారు లందఱున్॥ 916

క॥ ఈరీతియయిన స్కంధా
వారము నొక మిట్టనుండి భారవి మొదలౌ
వారు కని "యెవరిసేనా
వారమొ? యేయుపమఁ దెలియఁగ్రూహార మొ?" యనుచున్॥

క॥ ఒకకొంతయెడిగి యనుచరు
లకు సంకేతస్థలంబుల న్నిలుఁ డనుపం
పక మొసఁగి మిత్రు లట ని
ల్వక చెరియొకవైపుఁ జని రలంగపుఁబోకన్॥ 918

క॥ భారవిమార్గమున ననతి
దూరంబున మలయపవనధూననమున వా
క్స్వారంపరి స్పష్టాస్ప
ష్టారూఢి న్జెవికిఁ దగుల "నది యే" మనుచున్॥ 919

క॥ వినఁ దగునో తగదో, యె
వ్వనివశ మాసమయమందు వదలి తొలఁగఁగా?
ననిఁ బ్రేమావని నేకృతి
యును నొప్పిద మనెడుమాట యున్నదికాదే?॥ 920

క॥ అడుగులలో నడుగు లిడుచు
ముడుగు శరీరంబుతోడ ముంగాళ్లపయిన్
నడుచుచు భారవి యాస
వ్వడి గుసగుస దరియఁ జెవినిబడియె నిటువలెన్॥ 921

క॥ "ఆయిరు... పై కి...
...యోధు... నికినడ... గాలిం... లే
...యపుత్రి... గుమన
నాయకు... బుగొని... రులె చెప్పుమా?" ॥ 922

వ॥ ప్రశ్నిప్తంబుల నూహించి భారవి యిట్లని పూరించుకొనె॥ 923

క॥ ఆయిరువురుఁ బైకిఁ గనం
గా యోధులె, యునికి నడత గాలించిన లేఁ
బ్రాయపుస్త్రీ లనఁదగు, మన
నాయకునిమనంబుఁ గొనిన నారులె చెప్పుమా? ॥ 924

భా॥ (స్వగతము)

తే॥ గీ॥ పైకి యోధులు? నడవడిఁ బడఁతులొక్కొ?
కారుగా లక్ష్మియు యశోధరారమణియు?

నాయకుఁ డెవండు? మిహిరుఁడేనా? మనంబుఁ
గొనుట యెద్దాన? బగ వలపునన! తెలిసె॥ 925

(మఱియొకధ్వని) క॥ ఔనోయి! కాశి గుడిలోఁ
మానినుల జైనకినపుడు మనతిగయుకుపు
ల్కా_నము వనితాద్వయముం
గానము నాఁటిసుత వారె కాఁగూడదొకో?॥926

(ప్రథమధ్వని) క॥ ఆయె న్గారాయెన్ నృపుఁ
డేయెడ సౌందర్యలోలుఁడేకద, యిదియుం
దాయల కొకయపకృతి, ముం
దీయుగ్మము రణపణంబ యిరుకతకులకున్॥ 927

(ద్వితీయధ్వని) క॥ మేలుగవచించితివి, మన
యేలిక కెక్లైనఁ బ్రీతియేయగు, జాలం
బేల యిఁకఁ —దాళు— మదుగో!—
గాలిన్ సంభాషణంబుగా వినవచ్చెన్॥ 928

(ఒకయువకయోధుఁడు)

తే॥ గీ॥ "జనకు నారోగ్య మెట్లుండె వినఁగరాదు
నా వలపురాశివార్త యింతయును లేదు"

(ప్రథమధ్వని) గమనించితివా! యాయసహాజకంఠధ్వనిని?

(ద్వితీయధ్వని) మగధరా జస్వస్థుఁడని వినికి, యింక సందియంబేల?

(రెండవయువకయోధుడు)

"దిగులులే, దార్తి కొలఁదిలోఁ దీఱు, మనకుఁ
గలన సందేహమా జయోత్కర్ష మరయ?"॥ 929

(ప్రథమధ్వని) పట్టు!

(ద్వితీయధ్వని) కట్టు!

తే॥ గీ॥ అనుచు నుభయులుఁ గవయ వేయరుగుచుండ
యువకయోధులుఁ గత్తులఁ దివియుచుండ
నినుమడించిన తెంపున వెనుకఁ దగిలె
భారవి "నిలుండు! చెడుదొంగలార!" యనుచు॥ 930

క॥ "ఆగొంతుక మావారిది
భాగ్యో" నటంచు లక్ష్మి పలుకురహస్యం
బూఁగించువింత ముదముగ్
రేఁగింపఁగ రాజపుత్రి! రెచ్చునెనరునన్॥ 931

చ॥ రభసముతోడ డీకొనెఁ; బరాత్పరుఁడా! భటుఁ డేనుఁగంతవాఁ
డిభసమయాన యామెయని యిట్లు ఘటించితె పోరుపొందుఁ? జూ
డు! భయము లేదు లేడి కనుడొంకెనదాఁటులఁ జూపుఁద్రిప్పడు
ల్యుభహరిమధ్య చెంగుత్వరలోనడలో వెలయించె నద్దిరా!॥ 932

ఉ॥ ఈఁగను ముట్టి సాలెపురు వేఁచి పరిభ్రమియించులీల మే
లౌగుటి వ్రేటు లాత్మతినువందుఁ బోరి స్రుథిరంబు లేపఁ బో
రీగక రానెలంత తన కింతయు సందిడక్కున్న నొచ్చి దు
ర్యోగమున న్భటుండు చెడు యోజనపై శ్రమఁగూర్చుపూనికన్॥ 933

తే॥ గీ॥ ఆత్మరక్షణమునకె తా ననువుపడియె
నెదిరి యలసిన నొకపెట్టు నుదుటుకొనఁగఁ,
దా నొకటి నెంచ నెంచుఁబో దైవమొకటి,
దాయపడ భారవియు వచ్చి తాఁకె నతని॥ 934

తే॥ గీ॥ లలన లిరువురుఁ బోరుఁ దొలంగిచూడ
హన్నునకు భారవికిఁ బెద్దయయ్యె దురము,
పడినయోధుఁడుఁ దెప్పిఁటి పైకినడువ
దాఁకె వానిని లక్ష్మి వితాకు లేక॥ 935

క॥ ఈరవళి చెవులసోఁకఁగ
భారవియనుచరులు పరుగుపరుగునరా ని
స్సారులయి హన్ను లప్పుడు
పాఱఁగసాగి రెటొ పిక్కబలముకొలఁదిగన్॥ 936

తే॥ గీ॥ కొంతద వ్వేగి యట నున్నగుల్మములను
బెండుఫ్హాన్నులు పఱవఁ "బోనిం"డటంచు
మగిడె భారవి, ప్రియము శంసయును దెలుపు
చూడ్కు లల్లంత సతిని రాసుతను బొదువ॥ 937

భా॥ ఆ॥ వె॥ "స్వాగతంబు మాళ్వయావరాజ్ఞీమణి !
కమ్మ! యాలుమగల నలివఁ జేరఁ
దీసి దానిభర్తఁ దెగనాడఁ జూతురే?
కొనుఁడు దీవనలను గోటిగాఁగ"॥ 938

య॥ఆ॥వె॥ "రాజ్యమిచ్చి యావరాజ్ఞిఁగా నొనరించు
వారి వదలు పిచ్చివారుఁ గలరె?,
వాగె చేతఁజిక్క వార్వ మెందే గెడు
వచ్చుననుచు నమ్మవలయుఁగాదె?" 939

భా॥ ఆ॥వె॥ "భక్తి కిక్కయైన భర్తకోవెలనైన
మత్తునొంది మిమ్ము మఱువఁ డతఁడు,
వాగెనేల? మెయుప్రాణంబులనుగూడ
లాగఁగలరు తగునెలంత లెందు? 940

ప॥ ఆ॥వె॥ ఎవరిబలము వార లెఱుఁగరో! మఱతురో!
యిచ్చకంబులాడ నెట్లుచెల్లు?
మరులుకొల్పి సుంత తిరిగిచూడమి యెన్న
మొదటినుండి పురుషునదియెకాదె?॥ 941

భా॥ ఆ॥వె॥ విఘ్ననిహతిఁగాక వెరవొనె యీప్సిత
సిద్ధినొంద నెట్టిశీలికైన?
యుద్ధహోమ మిప్పు డూర్జితంబై వచ్చె
ఫలము చేతిలోనఁ బడినయట్లె॥ 942

క॥ అను సాభిప్రాయవచో
వినిమయముల నింగితముల వినుచుకొను చటఁగ
జను సీమూవుర కెదురై
చనుదెంచిరి ముగురుజనులు సంతస మొలయన్॥ 943

భా॥ ఉ॥ "మంత్రివరా! నమస్కృతులు, మాకొలఁది న్గనుఁగొన్నవై రిదు
స్తంత్రము లన్నియు న్సువిదితంబులయంచుఁ దలంతు మీకు, త
ద్గంత్రి యొకం డొకింత విఱుగన్బడె నింతకుమున్న నింక నే
తంత్రక మెత్తునో మిహిరతజ్జుఁడు, కుట్ర నసాధ్యుఁడే సుమీ! 944

తే॥ గీ॥ వానిభటు లిర్వు రిందులవచ్చి, వీరి
నిర్వుర న్బట్టుకొనిపోవ నెదిరి తాఁకి
వీరిచే భగ్నశౌర్యులై వెడలి చనిరి"
నాఁగ జరిగినదెల్ల విన్నపముఁ జేయ॥ 945

శ్రీ॥ క॥ "హన్నల వదలుట మిక్కిలి
యెన్నఁదగిన పన్నుగడసుమీ! భారవి! "యీ
తెన్నో మగధ తెన్నో తనకు
మున్నుచిత"మటంచు వాఁడు మున్నెరిఁకఁబడుఁగా"॥ 946

నా॥ శా॥ "ఓహో!భారవి!యేది! వీరలెవరోయూహించుకోచూత! మ
ధ్యాహారంబులు చాలఁగావలెఁ దదీయాధ్యాయముంబూర్తిసం
గ్రాహింపం, దొలుతొల్త మంత్రివరు పుత్త్రిశ్రేష్ఠుఁడావెన్క సన్నాహారూఢత వారినేని నటులుండం జెప్పు విన్నాణిసూ! ॥

సీ॥ చెఱఁ దప్పుకొని తనదార నపాయమునుండి
తప్పించుకొనియె నీతండు మొదటఁ
బిదప తేనికిఁ గానఁ బిదపడింభుని హానిఁ
జేరనీకుండ రక్షించుకొనియెఁ
బదపడి కాశి నీముదిత లామిహిరును
ద్ధతి నలంగనియట్టు లాఁచుకొనియెఁ
దరువాత ధనపాలు నరనాథుకడ కంపి
తద్ధనంబునఁ గూర్చెఁ దగినసేన
తే॥ నవల నాదక్షిణాపథవ్యాయతాంధ్ర
రాజ్యలక్ష్మిసనాథమార్తాండ తేజు
సాయమును బొంది పెనుపౌజు సంతరించె
పరమగుణహేళి యుద్భటభట్టమాళి"॥ 948

భా॥ ఉ॥ "ధన్యుఁడనైతి నుద్భటవదాన్యుని సఖ్యముకల్మి లోకస
మ్మాన్యుఁడటన్న, నిత్యబహుమానపరిష్కరణానుకూలరా
జన్యుఁడటన్న, భీరహితసంతతలోకసుఖానుసారిమూ
ర్ధన్యుఁటన్న స్వార్థరహితక్రియుఁడన్న, నితండె మిత్రమా!॥ 949

క॥ ఈజనకున కీసుతున కె
రాజిలు నిర్వ్యాజమైన రాడ్భక్తియు వి
భ్రాజత్స్వదేశరక్తియు
తేజము డిందని యనర్ఘధీయుక్తి సఖా!”॥ 950

నా॥ క॥ “మనబోటివారు నేరిచి
కొనఁదగునవి యెన్నొ వీరి గొనములఁ బనులం
గనుపించుఁ, బూర్వపుణ్యం
బునఁగాదె లభించె వారి పొత్తిటు మనకున్”॥ 951

ఉ॥ క॥ “కవులును బండితులరు మీ
రవురా! యిఁక నతిశయోక్తి కమరవె రెక్కల్!
నివురుం గప్పిన నిప్పులు!
‘చెవిఁబడ’వని యెంత్రె మీవిశేషప్రజ్ఞల్?॥ 952

చ॥ జనకులమాటయే న్వదలి చయ్యన సీతఁడు మాటమాత్రకే
మునుకొని రాజభక్తికయి ముందడుగూనుట యొక్కయెత్తు, దీ
నిని మఱపించు దివ్యతరనీతినిబద్ధము శ్లోక మొక్కయె
త్తనుటఁ, దదీయవాక్కు లతిపత్తములౌట జగం బెఱుంగదే!॥ 953

క॥ ఇఁక నారాయణుఁడో! క్రీ
డికి నారాయణునిపోల్కి, డిల్లపడనిపై
త్రికి గుటిల్లై పైపెచ్చుగ
నొకఁడై తనసౌఖ్య మింతయుం గనఁ డదిరా!॥ 954

క॥ ఇదిగాక మాళవాధిపు
వెదకుటలో, మిహిరుకుట్ర విఱుచుకొనుటలో,
బెదరక త్రోవ న్మన్నుల
గదుముటలో, నిచట, మీప్రకర్ష తెలియదే?” 955

శ్రీ॥ ఉ॥ “ఇన్నిటికంటె మిన్న,తగు నెన్నఁగ మున్నుగ,నన్నుమిన్న, యా
చిన్నది, లక్ష్మి, మొన్నగద చెన్నున కన్నునొసంగుసన్న రా
క న్నను ‘దన్నుగా’దనువగ న్సమయస్ఫురణంబుఁ దిన్నఁగాఁ
బన్ని కిరాతహన్ను తెగువ న్నగి ప్రన్నని తెన్నుఁజేర్చుటల్”॥ 956

ల॥ఉ॥ "పెద్దలు సద్దయన్బలుకు పెంపులు తత్కరుణ న్వేలార్చఁగా,
కొద్దికయేడః నేనెచట!, నుర్వికి మిన్నున కంతదవ్వు, రా
ముద్దియ, పూవులన్బెరిగె, ముంగిలి వీడియెఱుంగ, దట్టిచో
నద్దిర! కాలిబాటల, హాయంబున, నాజిని మించె నెల్లరన్"॥ 957

శ్రీ॥మ॥ "అసలే తెంపరిగాచబిడ్డ, పయి బాలాదిత్యశ్రీమన్నృసిం
హాసుతాగ్రేసర, వింతయే యఖిలశంసాయోగ్యశక్తిప్రభా
వసుసారళ్యము? చక్రవర్తినిగ సంపన్నంబు సాముద్ర మా
నోస లత్యంతమురాపయోజనలకు న్జోటాటఁ బాటింపరే!"॥

య॥క॥ "ఎన్నఁగఁ బనిలే దిట మా
యన్నిఁట గురు లీరకారె, హన్నుఁ డిటకు రాఁ
బన్నినచోఁ గికురించుచు
మున్నగ మాళవముఁగొనుట ముఖ్యముకాదే?"॥ 959

శ్రీ॥క॥ గురువుల మించెడి శిష్యుల
తెఱఁగిట్టులె, కనుఁడి! వ్యాహతీవ్రత! మేల్మే
ల్బరవసమున నాకొండల
మఱుఁగుగ నుజ్జయినిఁజేర మంచిది మనకున్"॥ 960

క॥ అని పయనముఁ జాటం బం
పినఁ గాల్వురు, నిండ్లవారు, వేదండఘటల్
ఘనతురగానీకినులును
వెనుక శకటచయము సర్వవిధసంసిద్ధిన్॥ 961

ఉ॥ సాగెడు సన్నకై నిలువ, సాది యొకండు మెఱుంగు మించనా
వేగముతోడ డగ్గఱుచు "విస్మయ, మే"మని యబ్బులెత్తి యా
యాగెడవారు చూడ, సచివాగ్రణి, వాకొనఁబోవుదాని నే
సాఁగుకొనంగఁ, దన్నికటమందుఁ దురంగము నాఁపి యాతఁడున్॥

క॥ "దేవా! హన్నులు వెడలిరి
తీవరముగ నడిమిసేనఁ దివిచికొనఁగ మీ
రేవడిఁ గొందురొ తూరుపు
లోవకు వారరుగులోన లోఁగొనవలయున్"॥ 963

శా॥ నాఁగా నొక్కఁని "వీరధర్మధరణీనాథాగ్రణిం గాంచి యీ
లాగీలాగు వచింపు మేఘములపై లంఘింపుమీ!" నా నతం
డేఁగన్ బ్రెగ్గడ చేయివీచె "నడువుండీ ! లోయకు న్బశ్చిమా
శాగాఢోరువనంబువై"పనుచు నుచ్చైర్ధ్వాన మొప్పారఁగన్॥ 964

ఉ॥ అంతట గుఱ్ఱపుందళము, లా వెనుక న్గజసేన, దీనికి
న్జెంతల విండ్లపౌ, జవలఁ జేవలకాల్బల, మాపిటిందిగా
సూతనకట్టి బండ్లవరుస ల్వడిసాగఁగఁ దద్బలంబు నా
ద్యంతములందు మిత్రయుగ, మాజనకాత్మజు, లొజ్జలై చనన్॥ 965

ఉ॥ ఆగజఘంటికాస్వనము, లాహయరత్నఖురధ్వను, ల్భటా
వేగితవీరవాక్యములు, విస్తృతవారణఘీంకృతు, ల్రయో
ద్వేగితవాజిహేష, లవధీరితవన్యమృగాండజార్భటుల్
మ్రోఁగు గుహాప్రతిధ్వను లమోఘత వారిధిమ్రోఁత మించెడిన్॥

క॥ ఘనజలధిశ్వసనములం
బెనుతరఁగలపోక పోల్కి మిట్టను బల్లం
బునఁ జను చతురంగబలం
బున నుబుకుట యణఁగుటొప్పెఁ బొరిఁబొరి రవళిన్॥ 967

ఉ॥ రేఁగెడిదువ్వ, పైఁబయిని వ్రేలుచునుండుటఁ జూడ, యుద్ధపు
న్యాగముఁబోని, ముందఱ జయప్రదయా రణదేవతన్మహో
ద్యోగముతోడఁ దెచ్చుచు, నయోద్గతిఁ బైన గుడార మెత్తిరో
నాఁ, గనుపించెఁ గత్తుల నినద్యుతు లానుడుకోలలై తగన్॥ 968

ఆ॥ వె॥ అట్టు లరుగునప్పు డాసేనలో సాగె
నందు నందు మాటలాడుకొనుట
విషయ మొకటికాదు వితతము న్వితముకా
దెవరిచిత్తవృత్తి యెట్టు లట్లు॥ 969

క॥ నారాయణుఁడు, న్భారవి,
నారీమణిలక్ష్మి, రాజనందనె యొకఁడౌ
బారఁన వారువములఁ జను
వారలు నొండొరులఁ బల్కువా రెదిమెదిమో?॥ 970

నా॥శా॥"ఏమోయీ! తలిదండ్రుల న్మఱచినావే! బంధమోక్షంబుమ్మా
టే మానంబడె!, మేనమామ ననుకొంటే లేడ!, వా రందు నం
దేముప్పు న్బడుచుండిరో! 'కనఁగరాఁడే'యంచు వాపోవువా
రో! 'మాచేసినపాప మార!' యనువారో! సుంత యోజింపవే?"॥

భా॥శా॥ ఓ నారాయణ! నీవు నిట్లడుగుదే? యొక్కింత వీక్షింపు మీ
సేనావారము, వీరికై యెచట నేచిన్నారి లేకూనలో,
యేనారీమణులో, హితప్రచయమో, యేతల్లియో, తండ్రియో,
నానారీతుల నంగలార్చెదరొ? పొంగంబాఱు కన్నీరులన్॥ 972

మ॥ వసతిన్, భార్యలఁ, బుత్త్రిల, న్జనకుల, న్వర్జించుటే కాద, గ
డ్డిసమానంబుగఁ బ్రాణము న్దలఁచి "యెల్లే నేఁడొ రేపో చనం
గ సమారబ్ధముజన్మ మట్టియెడ శంకల్చన్నె, మాభూమి మా
యస" మంచు న్దమనెత్తు రోడ్చుటకె కాదా! వచ్చి రీయందఱున్॥

నా॥వ॥ వినుండు వినుం డెల్లవారు నెల్లలవారును వినుండు॥ 974

భా॥మ॥ కఱకుంగత్తుల, మందుగుండములఁ, బల్కన్రాని ఘోరంబుల
న్జఱపు ల్కోఁతలుఁ గాల్పులు న్బఱపి దౌర్జన్యంబు పేటెత్త నెం
దఱ హింసింపరుహన్నులొక్కమొగిఁ, గంటన్నీరొర క్తంబొ కా
ర్చిరి హిందూప్రజ, లింతయున్మఱువ నాచే బ్రహ్మచేనైనన్॥

మ॥ తెగులే, న్బిట్టలమూఁకలే, న్మిడుతసంతే, న్గాటకంబేని, నా
పగపొంగే, న్జలరాశియుప్పెనల సంపాతంబులే, నిట్లు మూ
లుగఁ గర్షింపవు మూలముట్ట తెగ, 'నల్లో!' యంచు వాపోవు నో
ళ్లే గరాసు ల్కడువేడినూనె నిడి పైర్ల నొస్తుల న్దోయరే! 976

ఉ॥ ఎన్నిగృహంబు లొడ్డిగిలె!, నెందఱు పోయిరి కానపాలుగా!,
నెన్నిపొలాలు బీళ్లుపడె!, నెందఱుమానము మాసిపోయెనో!,
యెన్నిపురాలు కూలె!, మఱి యెందఱు క్షుత్తున నొచ్చి చచ్చిరో!,
యెన్నఁగ శక్యమా!; తెలియ నెక్కువలా! మనప్రాణమానముల్?॥

క॥ కల్లయు, స్వామిద్రోహము,
గిల్లి జగడ మూనుకొనుట, కృత్రిమ వినయం,

బల్లరి, దుర్వ్యసనాఢ్యత,
కొల్లఁగొనుట, హిన్నునైజగుణములుకావే! ॥ 978

ఉ॥ తల్లికిఁదండ్రికి న్నైజఱగదా! తొలఁగింపు మటందు, వెందు భూ
వల్లభునందు దైవకళ వర్తిలు టెంచవె? దేశమాతకుం
దల్లులఁ దండ్రులుం గొలుచుదాసులఁ బిల్లలు జల్ల లంద ఱి
ట్లిల్లము తల్లడిల్లుచెఱ నుండుట కోపిక పెల్లగిల్లదే! ॥ 979

చ॥ వెలుపలనున్న యీమనకె, విన్నకబుర్లకె, గుండెవ్రీలు, హా
న్నులగడిచున్న సోదరుల నొవ్వు లిటెట్టనఁగల్గువారమే?
బలఁగము లెల్లఁబో బయిసిపాడుగఁ దొల్లిఁటి గొప్పవారలుం
గలఁగి కృశించి సేవకులుగా నట దాస్యముసేఁత పెంపకే?॥ 980

చ॥ భుజబలము న్ధనంబుపస బుద్ధివికాసము సర్వశక్తులుఙ్
బ్రజ లిపు డైకమత్యమునఁ బాటునకుం గదియించి భవ్యసం
ఘజనితదార్ఢ్యసంపద లఖండములై విలసిల్ల దుష్టహా
న్నుజనుల గెల్వకున్న నగునో తల లెత్తఁగ నింకమీఁదటఙ్?॥ 981

మ॥ ఎట మాగోలియ? యెందు కర్మభువి? యీయీలోన దవ్వెంత? య
చ్చటివా రిచ్చట సీమల న్గెలిచి రాజ్యా లొందుటా? సేవ న
చ్చటులు న్మచ్చట లేమిలే కిచటివా ర్చానుండుటా? యిట్టిలం
పట లీనాఁ డరినోంపకుండినను గావా శాశ్వతావర్తముల్॥ 682

ఉ॥ నూఱిన కత్తివాదరకు నూఱుమడుంగులవాఁడిఁ జిత్తము
త్తేఱఁగఁ దత్సతాధికత దేహము లుబ్బునఁ దత్క్రియాపరి
ష్కారతమీఱ నెల్లరము జన్యమున న్బరిపంధివార్ధిపై
వారధిఁ గట్టి యీయదరిపా టడఁప న్దగుఁ గాదె మిత్రమా!” 983

నా॥శా॥ “సేబా! సల్లదె! యుబ్బుదేహములవాసి “న్మేలు మే” లంచు సే
నాబాహుళ్యము వార్ధిపొంగువలె నౌన్నత్యంబుఁ బ్రాపించె, బా
బూ! బయ్యన్నలుఁ, బందలు, న్బైదరుజీబు, ల్పాఱుఁబోతు ల్గలా
రే? బాహాబలధైర్యశౌర్యసుయశశ్శ్రీయుక్తు లీయందఱుఙ్॥ 984

శా॥ గుండెల్తీసినబంట్లు వీ రొకొక రేగు ర్మ్యాగు రాయోధుల
న్జెండంజాలుసు రొక్కదెబ్బఁ దమ తేజీలట్లు తేజంబు లు

ద్దండప్రౌఢిమఁ జెంగలింపఁ, బగతు ర్దర్పంబుఁ జాలింప, నా
గండాగొండికి వచ్చెఁ గాల, మమరె న్గాలంబు హన్నాళికిన్"॥ 985

మ॥ అనివీరోక్తుల నాడుకొంచు మజిలీ లందందుఁ గావించుకొం
చు నియామంబు తొలంగకుండఁ జను నచ్చో సప్తమాహంబుమా
పునకు న్నోయకు రెండుక్రోసుల యెడంబు న్జేర యాచాయ నుం
డిన హన్సేన లెఱుంగకుండునటు లెంతే నేర్పు దీపింపఁగన్॥ 986

ఉ॥ క్రమ్మెడు చిమ్మచీఁకటియె గాఢతరప్రతిసీరగాఁగ నా
ద మ్మొకయింత రేఁగనివిధమ్మున ముంగలి వాజిసేనలో
నమ్మగలారితోడ మననల్వురుయోధులు సాగి వైరికృ
త్యమ్ము లెఱుఁగ నందరుగునప్పుడు చప్పున వారిముందటన్॥ 987

క॥ యోధత్రయంబు రాఁ గని
సాధనములు సజ్యములుగ సాదులు నిల సం
బోధనమునన్న చెవి నా
రాధించె "వీరధర్మరాజా!" యనుచున్॥ 988

మ॥ "అది చండాంకుని గొంతుసవ్వడి, హితంబా" నంచుఁ దా నయ్యెడ
న్ముదితుండై కవి "వీరధర్మ!"యనఁ జండుం డల్లన న్జేరి "మీ
రుదయంబా మునుమున్న యుజ్జయిని కై యొక్కింత సాగుండు పం
పెద వృత్తాంతముఁ దాఁకువేళ"కని తామిస్రంబులోఁ జొచ్చినన్॥

క॥ కరముఁ దెమల్చుచు రుచికస
గరులు తెలుపుకొనుచు నరుగఁగా, భారవి, యీ
తెఱఁగు నమాత్యున కెఱిఁగిం
చి రయంబున సేనలెల్ల సిద్ధముగాఁగన్॥ 990

వ॥ నిర్దిష్టస్థానంబునకు దండులం జేర్ప నందు కనుమ కెదురుగ గరుడ వ్యూహంబు నుద్భటుండును నుజ్జయిని దెసకు మండలవ్యూహంబు శ్రీభట్టారకుండునుం బన్నుకొని చండాంకునివార్తకై వేచియుండు నెడ॥ 991

సీ॥ కైరవంబులును గోకములెగా కుపరతి
గైరవంబులును గోకలును ముగుడ

సారసంబులును వాసరమెగా కభిరుచి
నాసరసంబులును వాసములు నిగుడ
నారజంబులును సంధ్యాళ్ఘరమేగా కెందు
నారజంబులును సంధ్యయును జెలఁగ
మారుతంబులును సామములెగా కబ్జసీ
మారుతంబులును శ్యామలును వెలయ
ఆ॥ వె॥ వేగుచుక్క వెల్లి పిచ్చుకుంటు నినుండు
సరవిఁ దోఁచి లేపె జగమునెల్ల
తమముతెర తొలంగ క్రమమున నారణ
స్థలిసమస్త మెఱుఁగఁగలిగి రపుడు॥ 992
సీ॥ దక్షిణంబున వీరధర్మభూధవు నాధి
పత్యమందలి సేన వైపునుండి
పశ్చిమంబునను శ్రీభట్టారకునిక్రింద
ననువుగా మెలఁగు వాహినులనుండి
యాదిత్యదిశను బాలాదిత్యశ్రీనృసిం
హామాత్యజనసమూహములనుండి
యుత్తరదిగ్ధరాభృత్తటప్రతినద
ద్బహుదీర్ఘతర గుహాపటలినుండి
తే॥ వేగుచుక్కకుమున్నె యావిర్భవించి
క్రమముగా మేళవించి యుగ్రముగఁ బొదలె
పటహదుందుభినిస్సాణభయదరణర
ణార్భటులు హన్నుగుండెయ లవియునట్లు॥ 993
క॥ ఆలోనన హన్నులకుఁ
జేలోకువ నిలచి పనులఁ జేయు వెరవరు
ల్మ్యాళవయోధు లఖిలశ
స్త్రాలన్నెటి సంగ్రహించి చనిరి పిటిఁదికిఁ॥ 994
క॥ సేనాముఖమున మహితా
జానేయముపైన వేగఁ జనుదెంచుచు బ

ల్మానిసి చండాంశుఁ డభి
జ్ఞానముగా మాళ్వకేతనము కైనెగురన్॥ 995

ఉ॥ చేరిన యుద్భటుం డతని శేముషి మెచ్చుచు, “వార్తలేమి?, నాఁ
గా, “రణనంబు దక్షిణముగా వినవచ్చెటు వైరిమీఁదికిన్
దారసిలంగ గుర్తు, కలదారులఁ గ్రమ్మఁగఁ జెట్లపై ధను
స్సారుల నుంచు టొప్పు మనసైన్యముఁగావ విరోధినేయఁగన్”॥

మ॥ అన “మేల్మే”లని యుద్భటుండును దదీయంబైన యేర్పాటుఁ జే
సిన యొక్కింతకు మేఘగర్జనలవాసి న్మీఱుగంభీరతన్
వినవయ్యె న్రణవాద్యఘోషములు విన్వీథి న్విదారించునే
పొనర న్దక్షిణసీమనుండి పరదిగ్యోధు ల్బదుల్రేఁపఁగన్॥ 997

ఉ॥ యుద్ధమె నిర్ణయించుకొనెనో మిహిరుం డదె? బార్లుగట్టి స
న్నద్ధముగాఁగ సాఁగెడిఁ దదాశ్వికసైన్యము ముక్తబాణవే
గోద్ధతి, ముందుపంక్తి నదిగో! బడిగుఱ్ఱము లందునం, దహాహా!
బుద్ధము! వింటినేర్పు! పడఁబోలును రౌతులు సాయకాహతిన్॥ 998

ఉ॥ ఎప్పుడు సాగెనో శరము లింతయుఁగన్పడలేదు, వింతగా
నప్పుడె రోదసి న్దఱుచులై యహిబృందమొ!, సంపముంపొ! నాఁ
జొప్పడి తాఁకుచుండె నరిశూరుల, మళ్లుతరంగ ముర్వడిం
దెప్పున వచ్చుపర్వమును దీకొనునట్లై సుడిపాట్లు కూర్చుచున్॥ 999

చ॥ పలకల నాదసంబులకుఁ బట్టి త్రిశూలము లొప్పుసూటుఁల
న్నిలిపి ప్రచండవేగమున నిశ్చలులై పఱతెంచు వీరహ
న్నుల తెర లంబుధిశ్వసననున్నతరణ్యతివేలధావనం
బులఁ దలపించె వాజితుడుము ల్శరపాళియు వీచులైతగన్॥ 1000

క॥ శరపాతము శరపాతము
తరమై హన్పృతన బింబితమొ దాన ననం
బఱఁగె నెదు రంపజడిక్రీఁ
దెరువులలో నాంధ్రతురగదివ్యబలాంబుల్॥ 1001

ఉ॥ కేడెముఁ దాఁకి తున్గునవి గెంతున మిట్టెడునట్టి వెచ్చట
న్గాడక తప్పిపోవునవి కాయముల న్జొరఁభాఱునట్టివై

యాడఁ ద్రిశూలము ల్చెలఁగియాడె గుదుల్గుదులౌచు నాయువుల్
మూడినజీవు లాపొడుపుమూలమున న్చెనుతావళాలు గాన్॥ 1002

ఉ॥ ఆజియుఁదీరియున్నబల మల్లరిచిల్లరమూఁకకాదు హా
స్వీరులు నాంధ్రశూరులుఁ బ్రవేశకసంగ్రహనిష్క్రమాజివి
ద్యారుచిరు ల్పురశ్చలనదక్షులు డీకొనఁగాఁ జరస్పరా
పారరణార్భటి న్గదనభైరవనాట్య మట న్బురి న్గొనెన్॥ 1003

శా॥ శూలంబేగినఁ గత్తిదూసుకొని రెచ్చు న్వైరిఁదర్శించుచు
న్వాలుం బోయిన శాత్రవాశ్వముపయి న్లంఘించి త్రోపాడుచు
న్గాలు న్గూలఁగఁద్రోయుఁ గాఁగిలులబాగు ల్వీడకే చచ్చుఁ గీ
లాలంబు ల్ధరణీపరాగముల జోల ల్కొట్ట నం దుద్భటుల్॥ 1004

క॥ పొడుచుటో పొడువంబడుటో
గెడపుటయో గెడపఁబడుటో కృత్యము లట నొ
క్కఁడు నొక్కడుగు న్దొలఁగం
డుడికెడి రక్తంబు కడుగు లుడుగ కడరిన్॥ 1005

ఉ॥ రౌతులుకూలఁగాఁ గెలనిజంతులకు న్బెదరెక్క మావు లు
ఱ్ఱూఁతలఁ దాఁటుచో ఖురపుటోద్ధతమర్త్యతురంగమాంససం
పాతము లం దెసంగ రణభూమిని మృత్యువుతోడఁగూడి చే
సేతుల బంతు లాడుకొను చెల్వమొకో యన భీకరంబుగన్॥ 1006

క॥ విఱిగిన విఱుగని రణపరి
కరములపైఁ దెగిన వీరకరములపైఁ గం
ధరములపై మొండెంబుల
తెఱచుపయిన్ బోరు పొరలెఁ దార్మొరగుచున్॥ 1007

ఉ॥ హన్నతురంగసేన పొలియ న్బొలియ న్బొరిఁ దాఁకుచుండె నా
వెన్ననునున్నమూఁక సరవి న్మనయాంధ్రమహాశ్వయోధులఁ
న్మిన్నక; గ్రీష్మతప్తమయి మించు నెడారుల సైకతస్థలి
న్జెన్నఱు పెన్నదీజలము చిక్కక దానిని దాఁటఁ జాలునే! ॥ 1008

చ॥ ఇట నిటులుండఁగా దరిసె నింతటనంతట హాన్బలంబు ను
త్కటముగ వీరధర్మవసుధాపతియు న్మగధేంద్రమంత్రి; యం

తట నట నంతట న్వ్రాలిచె దారుణమహా రణమారణంబు, మి
క్కుటముగ రెండువైపులను గూలఁ దొడంగిరి వీరపుంగవుల్॥

ఉ॥ త్రోపున నాంధ్రుల న్దటిమి తొందర నుజ్జయినీపథంబుపైఁ
గా పిడనెంచె హన్నుఁ డది కాద సుసాధ్యము దాన నింతలో
నేపడె వచ్చి పెన్తుఫము లింక స్వరక్షణ మందు ముందు కా
నౌపని; తోఁటలో మిహిరుఁడా! కనుఁ డిత్తటి వాని దక్షత॥

ఉ॥ మైమఱ పింతయేర్పడదు మాళవయోధుల మోసమైన లోఁ
బ్రామదుజుకు, నాంధ్రనికరంబు లశిక్షితసైన్యమన్న పె
న్దిమస మన్యథాత్వమున దిమ్మరవో దట నెట్లుఁ బోవఁగా
లేమికి డిల్లవోవఁడుఁ జలింపఁడు నెంతటి గుండెధైర్యమో!॥ 1011

చ॥ బలముల మూఁడుపాయలుగ భాగమొనర్చి విరోధిమూఁడుసే
నలదెస వ్యూహము ల్కొలిపి నమ్మిననాయకు లందు దక్షులై
నిలువ వ్యవస్థ నన్నిఁటను నేర్పునఁ గూర్చుచు నిందు నందు నెం
దులఁ గనఁ దానయూ మిహిరు దొడ్డమనీష ప్రశంసనీయమౌ॥1012

శా॥ సాగె న్భోరిత మన్నిరంగముల నిస్సాణార్భటు ల్వెల్లుగా
మ్రోఁగ, దువ్వలు మబ్బులై ముసరఁ, దెంపుంజూపు వీరోక్తులు
న్రేఁగ ఘీంకృతి హేష ఘట్టన మన న్లెనట్లు సర్వధ్వను
ల్మ్రాఁగ, న్రోదసి నాయుధంబు లిటు నట్లు న్బర్వ నత్యుద్ధతి॥

సీ॥ కొండ పెల్లునొనాఁగఁ గుంభస్థలంబుల
డీకోలురవము గుండియల నిలుపఁ
దొండము ల్మలిపైచి త్రోపాడుచోనైన
ఘీంకారముల దెస ల్కారలిపడఁగ
దంతతాడనములఁ దందర చిందఁగా
దిగ్గజంబులు నుల్కి మ్రొగ్గతిలఁగఁ
బైకొనుపర్వులం బదఘట్టనముల నా
దిమకూర్మ ముదుటున దిగ్గురనఁగ

తే॥ గుంభములరాయిడి న్దిరుగుడుల కుభయ
వాహినుల సుడిగుండము ల్బహుళములుగ

మత్తదంతావళఘటాప్రమత్తఘోర
భండనము గండుమీఱె నుద్దండలీల॥ 1014

సీ॥ ఒండొంట డీకొనునుసికి మూవటు లుప్ప
రమునఁ బాఱెడు కందుకములుగాఁగ
నుఱుకుతీండ్రముల కాయోధను ల్కాలబంద
మట్లలై చప్పగా మట్టఁబడఁగ
దంతకుద్దాలకోద్ఘాటనంబుల నేన్గు
డొక్కలు ల్లంకులై నిక్కి యెగుర
హస్తగ్రహణమార్జనాదులఁ బోటరు
ల్చిచ్చుమిణ్గురులట్లు చిందిపడియ
తే॥ బొందిఁ దూఱిన తోమరభిందిపాల
కుంతపరిఘుంబులఁ జరించుకుజము లనఁగ
మత్తదంతావళఘటాప్రమత్తఘోర
భండనము గండుమీఱె నుద్దండలీల॥ 1015

ఉ॥ సూటి బలేయనందగదె! చూడుఁడు సాంతతచాలనక్రియా
పాటవ మూను హస్తిగిరిబాహువులందలిరంధ్రపాళుల
న్నాటుకొనెన్ జలద్ద్విపఘనస్థితవీరభటేంద్రచాపసం
పాటితసచ్ఛరావళు లిభంబులు గొల్లున గీక వెట్టఁగన్॥ 1016

శా॥ సందేలేక శరీరమంతటను గ్రుచ్చంబడ్డశస్త్రాళి నో
ర్వం దర్పంబును రేఁగ లోఁగఁ, జలనంబు స్సన్నగిల్ల, న్బడు,
న్నందుల్గ్రుందఁగఁ, బర్వతంబులనఁగా మత్తేభము, ల్నల్ల, సం
ధ్యం దోపుంగళ మీరువాహినులనంగా, నుబ్బున న్బాఱఁగన్॥

శా॥ అంగు న్బొంగు నశింప ఛిన్నకరపాదాది న్గరు ల్గొప్పలా
గంగాళంబులు మోటబొక్కెనలు దుంగ ల్పెద్దపీపాలుగా
రంగంబం దమరంగ వింధుసమకూర్ప న్నాకిను ల్వస్తులై
ల్లం గుంపించెడునట్లు తోఁచె సమరోల్లాసంబు చల్లారఁగన్॥ 1018

మ॥ అయిన న్బోరిసుమంతచప్పఁబడ, దాహా! యోధు లంతంతకు
న్బయిపైఁ బర్వులఁ దాఁకుటేపనిగఁ జేవల్చూపుటేగాని యిం

తయుఁ గన్గొ రటు నిట్టుఁ జుట్టు నగుపెన్నాశంబు, రోషంబు ర
వ్వయు బీర్వోదు పొటేళ్లొ కోళ్లొ భుజగవ్రాతంబొనాఁ బోరెడిన్॥

ఉ॥ ఆత్రముతో భటు ల్కవియునప్పుడు తత్పదఘట్టనంబుల
న్బొత్రములట్లు దోర్లు కరము ల్పదము ల్తల, లుర్లు మొండెపు
న్నెత్రులు నాంత్రము, ల్మిడిసినిక్కశవంబులు నయ్యె ర క్తపు
న్ధాత్రుల జారుపాట్ల నరితాఁకుడులం దపమృత్యు వొందఁగన్॥

తే॥ ఎమరుతాఁకుడుల న్నేన లేచి పొడుచు
సందడి న్వక్రవేటుగా సాగి తగులు
దండ్లు, మధ్యంబుననె వాని ధాటి నణఁచు
నురవడింపులడీకోళ్లు వఱలె నందు॥ 1021

తే॥ కల్లవెనుతగ్గుటలుఁ దోడఁ గవయుపగతు
మల్లి పొడుచుచుఁ దఱుముట మాఱుకొనుట
వెలయ నోహారిసాహారి కలఁత కలను
పొలిచె నుప్పెనగాలికి జలధిరీతి॥ 1022

క॥ కత్తుల బాకుల గుద్దుల
జిత్తుల మెలిపట్టు మల్లుచేపోరులలో
సత్తువలు స త్తి మిత్తుల
గు త్తములుగఁ బోటుమత్తుఁగొని పొడిచి రటన్॥ 1023

క॥ కొలనన్ గలభంబుగతిన్
బలముల గగ్గోలుఁ గొలుపుబలుమానిసి! యా
బలమును మెలకువ చలనము
కలిమిఁ గనుఁడు సాటిలేనికడఁకఁ జెలంగున్॥ 1024

క॥ క త్తళము శిరస్త్రాణము
బొ త్తిగ మైఁగప్ప నెవఁడొ పోల్చుకొనఁగరా
ద త్తలమున న త్తలమున
గ త్తరగాఁ గ త్తలొని గడుసుగఁగవయున్॥ 1025

తే॥ గీ॥ పార్శ్వరక్షకు లిరుపంకఁ బ్రొఢిఁ జూప
మెరికెలగుపోటరు ల్వెంట మెఱవడింపఁ

జిచ్చు వని నేర్చుపస నరి న్జిమముచుండె
బరవసముఁ దెంపు మెఱయంగ వాఁ డెవఁడొ!॥ 1026

క॥ కడలిఁ దిమింగిలము వడిన్
జడిసి పఱచు నీటి చిన్నసత్త్వము లనఁగాఁ
బఱచు న్లేచుచు దాయల
తుడుములు వెసఁ బఱచె వాని త్రోపుల పటిమన్॥ 1027

క॥ ఈఁటెలయిపోవ నడుముల
మీటికరాచూర్లు దూసి మిఱుమిట్లువడన్
బాటవమునఁ దాటించుచుఁ
దాట లెగపి దాఁటు వా రదాటునుదుటులన్॥ 1028

క॥ అదె యింకొకపదు వెదురుగ
గదుముకొనుచుఁ దగిలె నడుగు కదలఁగనీ కా
మొదలిటిగుంపును; బోరిత
మెదిగి మదము సదమదముగ నెక్కిళ్ళువడన్॥ 1029

క॥ తలకాపులుఁ గంకటములు
నిలువెల్లం బొదువఁ, బొదువ నిగుడుదొరలు "వీ
రలె" యనరా, దిట్టలపుం
జలమున బెడిదముగఁ జెనక, సమరము హెచ్చెన్॥ 1030

క॥ కొదమసివంగులా! పులులో!
మదదంతావళములో! ప్రమథనగిరులొకో!
యుదధులో! నా నిరువాగుల
పెదపెదనాయకుల కందు పెనకువ చెలఁగెన్॥ 1031

ఆ॥ మబ్బు మబ్బు నొఱయ మంట మ్రోఁగువిధాన
యోధ యోధ తాఁకు నుగ్రమునకు
కత్తితళతళలును గుత్తపుం బొబ్బరిం
తలును నిగుడ పుడమి దద్దరిల్లె॥ 1032

తే॥ గీ॥ ఒడలు పెఱిగినవడువున నొడుపుఁ బెఱుగఁ
దరము నొఱకట మెన్నునంతరము నిడక

విడక మునుమును మునుమున్నఁ గడక సెలఁగఁ
జెలఁగెఁ జలపాది యులివు లబ్బలములందు॥ 1033

ఆ॥ వె॥ పొట్టఁబొల్లవోవ గట్టిగింజలు నిల్చు
రీతి నలఁతిభటులు మృతులుగాఁగ
నిందు నందు నిలిచె నేడ్తెఱ నిద్దంపు
మగలు పగలు మిగులఁ దగిలి రగుల॥ 1034

తే॥ గీ॥ గొంతుకవళిక లవె కొంతకొంత తెలియు
సగరచండాంకరుచికుల జాడ లొప్పె
వీరధర్మయశోధనక్ష్మారమణుల
సింహనాదంబు లవిగో! గ్రసించు నరుల॥ 1035

ఉ॥ మూఁకలుగాఁగఁ దాఁకు నరిముట్టడి కిం దొకరేని బెగ్గిలం
బోక, రవంతయే నలఁతఁ బొందినయట్టులుఁ గాక, కాఁకలున్
ఢాకలు రేకులెత్తఁ, గెరటాల మహత్తరసౌకజోక, న
స్తోకరణక్రియాక్రమణశూరత మీఱు నదే యుదీర్ణతన్॥ 1036

మ॥ కసికే ప్రాగ్రసరత్వ మిచ్చినటులే కన్పట్ట దాకత్తినే
ర్పుసి మేలౌగుఱి!, తాఁకువైరితతి కేదో యంగవైకల్యమే
పొసఁగం జేసి క్రమించుఁగాని, యసువు ల్పోఁగొట్టఁ డావీరధ
ర్మసునాసీరుఁడు; శాంతవీరగుణధర్మం బాజి నిట్లొప్పునే!॥ 1037

మ॥ పరవల్గ న్వడిఁ జంక్రమించు నసిసంపాతంబు నిర్ఘాతమై
పరుల న్బల్వురఁ బిల్కుమార్పఁ, బరవ న్భంగింప, నాయోధన
త్వర పొంగొంద, యశోధనుం; డదిర!, తద్వ్యాఘూర్ణనం బబ్ధిఁ జి
చ్చుఱకొండ న్మఱపించు, వైరితతిఁ జించు న్దంచు నొంచు న్జడిన్॥

ఉ॥ ఆయువకుం డెవండొ? జవుకాఁడు నడ న్దొలికారుమెఱుపుగా
డాయుచు నేయుచు న్బెనుకడంక యశోధను వెంబడించు నా
యీయెడ నంగరక్షకుని యేడ్తెఱ, నాతనిపైన వెన్కగా
దాయలు ముట్ట డీకొని యదాయదగూర్చుచు మెప్పునొందుచున్॥

శా॥ "ఓరీ! కేవలబాలకుండ, వరచే! యుద్రేక మున్నంతనే
యారీతిన్ దరమెన్నకే చెనకుటయ్యా? వైరి, నయ్యయ్యో! దు

ర్వార స్వైరరణోన్మదుం డెఱుఁగలేవా! వానిఁ, జెండ్లాటగా
బోరన్ బట్టి గిరాటువేయఁడె యిభంబుం బోలువెన్నోర్వ్యధులన్?॥

తే॥ గీ॥ వంగి సేనలలోఁ జొఱఁబాఱి బొమిఁడె
కంబుపైని కటార్ల ఖడ్గమృగమట్లు
తుండెములుగాఁగఁ గూల్చఁడే ద డిమగల
దండి యనుకొంటె? కనుము! నిదాన మమర ॥ 1041

ఆ॥ తొండమునను బొదివి దొడ్డవృక్షంబుల
నురలద్రోయు పెద్దకరి యనంగ
బాహుదండములను బలువుర లంకించి
పఱచె భూమి వాని బలముఁ గనవె?॥ 1042

తే॥ గీ॥ కాలితాఁపుల కరులు గ్రక్కదలి పడరె
గుదులు గుదులుగ, నెంతటి గుండె నీకు?
తగరు కొండను డీకొనుదారిఁ గవయ
సిద్ధమైతివి దవ్వ యోజింపవైతి''॥ 1043

క॥ మనమాటల వాఁడు చెవిం
గొనఁడో వినఁబడవొ?, లేడిగొంటరిదాఁట్లన్
దన కెదురువాని మేనన్
నినిచెను కత్తికొన గీట్లు నెత్తురు లుబ్బుకన్॥ 1044

క॥ వాఁ డలజడిఁ గినిసి యముని
యీడై యుగ్రముగఁ దొడరు నీలోపల నం
దేఁడో "హుజూ"రని బిగ్గర
నాడెఁ గెలన నంత నట్టహాసముతోడన్॥ 1045

॥ "చేడెరొ! నీకుగా రణముఁజేసెద నింతటిపట్టుపట్టి నీ
వాఁడను, నన్నుఁ జంపుటయె వాంఛితమేని భవత్కరాసి నీ
జాడనె దూర్చు"మంచుఁ బెలుచన్ గవచంబును జించె కత్తితో
నాడ సమస్తయోధు "లవురా! పులి! పిల్లి!"యటంచు నివ్వఁగన్॥

క॥ ఎచ్చటి పో రచ్చటనే
ముచ్చముడిగె మాగధియును మోమటుగా నా

కచ్చె విడి చనఁగ మిహిరుఁడు
నచ్చటి తనవారిఁ దోలఁగ నాజ్ఞాపించెన్॥ 1047

క॥ తనతోడునీడగా రణ
మునఁ బాల్గొనువ్యక్తి, చిత్తమునుగొన్న యశ
శ్విని యెయశోధరయే! యన
వినుట యశోధనుఁడు మోదవివ్హలుఁ డగుచున్॥ 1048

ఆ॥ కనుపుగొట్టుచూపు గాంఁడ్రింప దూఁకుతో
మిహిరు నెదిరి "యోరి! మెచ్చువచ్చె
నీమనడత. కీవు నేను నా నెలఁతకుం
గూర్చువార మగుట కూడునొక్కొ॥ 1049

క॥ ననుఁ దా రక్షించుకొనుచు
నినుఁ దాఁకుట వనితమనసునిలకడ నీకుం
గనుపడదె గౌరవముఁ జూ
పిన సేతకు లేతపని నపేక్షించెదవే?॥ 1050

క॥ నీబలమున సాఁబాలుం
బైఁబాటుగ మడిసె, నెదురువాహిని తఱుచె
యేబాటయు విడువదు నీ
కేబరవస మిక తొలఁగుమీ! వెరవరివై॥ 1051

క॥ రాకన్నియకుం గౌరవ
మీకరణిఁ జూపియుంట హేతువుగా నీ
పోకకు నే సాయపడుదుఁ
గాకుండిన నిన్నుఁ గూల్చకయ కసిచనునే!॥ 1052

శా॥ స్వామిద్రోహివిగావె? బాలకుని న న్గంపింప యోజింపలే
దే? మోసంబున రాజురాజ్యమును సాధింపంగలేదే? ధన
వ్యామోహంబున రాష్ట్రపుంబ్రజల నత్యాపన్నులం జేయలే
దే? మోమోటమివీడి దోఁచుకొనలేదే! వారిసాస్థ్యంబులన్?"॥

క॥ అనుచుండఁ గినలుమైమఱ
పున ఖడ్గమునెత్తి కొట్టఁబో మణికట్టుం

దన పిడికిట గట్టిగఁ బ
ట్టె నృపుం డావేళ కచ్చుటికి వచ్చి వడిన్॥ 1054

క॥ "తనయా! మనపోష్యుఁడుగా
మనియె నితఁడు కొన్నినాళ్ళు మన కీతనిపైఁ
గినుక చన దూరకుండుము
జనులప్రమాదంబు పతికి క్షంతవ్యముసూ!॥ 1055

తే॥ గీ॥ డింభుఁడా!, కాదు, మిహిరుఁడా! డిల్లపడకు
క్రూరతరమైన నీగుండెఁగూడ తావు
కలదు స్వార్థపరిత్యాగకలనమునకుఁ
బ్రేమ మొంతెంతపనుల నల్పింపలేదు!॥ 1056

ఆ॥ మాతృభూమిపైన మలయుప్రేమముననే
యాంధ్రమగధమాళవానుగతులు
చావు లెక్కఁగొనక యీవైఖరిని దూఁకి
నిల్చుకొనిరి వారినీతి జాతి॥ 1057

ఆ॥ వీరమాతలైన వీరియాంధ్రుఁను గచ్చు
గిట్టి మాతృభూమిఁ గాచుకొనఁగ
వారిఁ దేఱిచూడవచ్చునే యెంతటికి
వారికైనఁ దేఱిపాఱఁ గనుము!"॥ 1058

క॥ అన మిహిరుం డిట్లను "నో
జనపతి! మీవారికట్టు సాహసముఁ గనం
గన నాకుఁ గ్రొత్తయే? వెఱు
వను సుంత బిభీషికలకు వల దుడికింపన్॥ 1059

తే॥ గీ॥ ప్రేమరాజ్యముఁ గొనలేనిభీరువునకు
లోకసాంబ్రాజ్యమేల? వివేకమేల?
ప్రేమభిక్షకయోగ్యత వఱలువాని
కేల కోర్కులుఁ గక్షులు నేల బొంది?॥ 1060

తే॥ గీ॥ ప్రేమతత్వ మెఱుంగనిపిఱికిఁగాను
ప్రేమమెఱిఁగియు భీష్మించుపెంకెఁగాను

ప్రేమపద మొందు మొదటఁ జిత్రింపఁబడియె
నచట నద్దానికే బలి యఖిల మింక॥ 1061

తే॥ గీ॥ ఏలుకొనుఁ డెల్లరాజ్యంబు హితము లొలయు
నెంతదనుక నా ప్రేమాబ్ధిహిమకరుండు
నిండుజ్యోత్స్నల విలసిల్లుచుండు నెంత
దనుక నాహృదయోర్వి చైతన్య ముండు"॥ 1062

తే॥ గీ॥ అనుచుఁ దనమూఁకలకు మళ్ల నాజ్ఞ నిచ్చి
వైరిబల మడ్డువీడుచుఁ బాయబడఁగ.
నేగె మిహిరుఁ డదేపోక నెటకొ, వచ్చి
మాళ నెటని ల్చెనో మన కద్ది యేలః?॥ 1063

ఉ॥ అంతట వీరధర్ముఁ డభిమాతులలోన స్వకీయ సేనలో
నంతముఁగన్నవారి కపరాచరణంబులు, గాయపడ్డవి
క్రాంతులకు న్సపర్యలును, గల్పనఁజేయఁగ నాజ్ఞనిచ్చి, సా
మంతులతోడ నుజ్జయిని మంగళమొప్పఁగఁ జేరె; నచ్చటన్॥ 1064

శా॥ శ్రీభట్టారకసైన్య ముజ్జయిని రాశీభూతదర్పావహా
న్స్వభ న్మాపుచు నాక్రమించుకొన, నెంతో కౌతుకానందముల్
శ్రీభూతు ల్విలసిల్ల నానగర మర్థి న్సర్వకైంకర్యాది
వ్యాభ ల్గైకొని యంతకే పొలిచె భవ్యాలంకృతు ల్వెల్గఁగన్॥ 1065

ఉ॥ మంగళతూర్యము ల్చెలఁగ మంగళపుష్పతరంగరాజితో
సంగతిగా సువాసినుల సంభ్రమకౌతుకమోదభావ పా
రంగతవీక్షణంబులపరంపర లయ్యెరు క్రేవ ప్రాల స
త్సంగులు రాజవీథుల నెసంగిరి తేరుల రాజదంపతుల్॥ 1066

ఉ॥ ఏయెడఁ గన్నఁ దోరణము లేయెడఁ జూచిన రంగవల్లు లిం
కేయెడ విన్న "జే"పదము లేయెడ నున్న సుగంధసార మం
దేయెడ బాణసంచుప్రభ లేయెడ గాయకన ర్తకస్వనం
బే యెడ మింత లేక సిరి యెల్లెడఁ దాండవమాడె నాపురిన్॥ 1067

సీ॥ పట్టాభిషేకవైభవముతో యువరాజ్య
పట్టాభిషేకంబు పరిఢవించె

గురిసె సువర్ణంబు కుప్పతిప్పలుగాఁగ
బీదసాదులును దృప్తింబడంగ
విందులతోడ గోవిందనామధ్వనుల్
వాడవాడల నింగిజాడఁ బొంగె
దీపికాతోరణాలాపణంబుల నిండ్ల
నంచెలంచెలుగ నెం దవతరించె
నాశుకవిరాజకృతనాటకాభిరామ
నాట్యరంగస్థలంబుల నాఁటి జయము
తతరసోద్రేకదివ్యప్రదర్శనముల
నమృతవాక్పూరణంబుల నందఁజేసె॥ 1068

తే॥ గీ॥ సేవకులు సైనికులు బాంధవావసరులు
విప్రులేగాక మూకాంధభిక్షుకాదు
లొంది రాయుత్సవంబులయందు వారి
వారియోగ్యత కనుమడిబహుమతులను॥ 1069

ఉ॥ ఎల్లలఁ గోటల న్నగర నెల్లపను ల్కడుజాగరూకత
నెల్ల వ్యవస్థఁగూర్చి ధరణీవరుఁ డొక్కదినాంతమందు శ్రీ
లుల్లసిలంగ నిండుకొలువుండినవేళ వచించె మంత్రి "రా
ట్పల్లజ! శ్రీనృసింహవసుధాపతి యేస్థితి నున్నవాఁడొకో!॥ 1070

ఉ॥ ఆతనిపుత్త్రియు న్ముదితన లాజి నొనర్చినమేలు మించుసం
గాతము లెంతయొప్పునె, రణంబున సాయమెకాదు, చేసె ము
న్నాతఁడనేకము ల్ప్రియము లట్టుల నీసుతుఁ డేను దిక్కులే
కేతెఱఁ గింతతోఁపక చరించు దినంబుల జీవగఱ్ఱయై॥ 1071

ఆ॥ అట్టిసరసుఁ డిప్పు డస్వస్థుఁడైయుండె
ననఁగఁ మనకుఁ బోయి కనుట తగదె?"
నాఁగ నృపతి పలికె "నాతలం పట్టిద
యెల్లి పయన మాచరింత" మనుచు॥ 1072

ఉ॥ ఆసమయంబునందు బ్రతిహారి సమాగతుఁడై వచించె "దే
వా! సనుదెంచె నామగధవార్తికుఁ డొక్కఁడు బ్రాహ్మణుండు తేఁ

గా నెలవైనఁ దెత్తు"నని; క్ష్మాపతి "సత్వర మిట్లు తెమ్ము" నాఁ
గా నని తోడితేఁ దగినగద్దె వసింపఁగఁ జేసి మన్ననన్॥ 1073

సీ॥ ఉ॥ "పెద్దలు దవ్వునాక కృపపేరిమి నాగృహపావనంబుగా
నిద్దెస కేగుదెంచితిరి, యేయలపెత్తదుగాదె, మీనృపుం
డొద్దికయైనసేమమున నుండునె, రాసుత సేనతోడ మీ
యొద్దకుఁ జేరి సౌఖ్యమున నున్నదె, యెక్కువలెల్ల తెల్పుఁడీ!"

బ్రా॥ఉ॥ "శ్రాంతి యొకింతలే, దచట సర్వమనామయ, మావసుంధరా
కాంతుఁడు మీశుభం బడిగె, కాంతయశోధర యూరుఁ జేరె,ని
శ్చింత సమస్తదేశములఁ జెన్నమరు, న్బరమేశ్వరాజ్ఞ దు
ర్దాంతులు హూన్ను లెల్లరు పరాజితులై రిఁక లోపముండునే॥

క॥ ఆనిగమాఁతోచ్ఛ్వధర
న్మానమె వ్యాఖ్యాన మనెడిమాదిరి నిపు డేఁ
బూనినదౌత్యమున న్వ్యా
ఖ్యానము మానంబెగాఁగఁ గనుపడు నాకున్॥ 1076

ఉ॥ నిన్నటిదాఁక నిర్వ రతినిష్ఠ నొనర్చిరి యుద్ధయజ్ఞము
న్దిన్నదనంబునం దొకరితేగడ కొక్కరు తీసిపోవ రా
చెన్నునమిన్న యెల్లరకుఁ జేఁగలయామలకంబ, వారి నే
నెన్నఁగఁబోయి చిన్నఁదన మేటికిపొందఁగ?, జాబె తెల్పెదున్॥"1077

క॥ అని యుత్తరీయముఁగొం
గున ముడిచినయుత్తరమును గొని యీఁబో దా
నిని నందుకొనుచు భారవి
వినిపించెన్ లిఖిత మిట్లు వీను లలరఁగన్॥ 1078

భా॥ క॥ "శ్రీశ్రీశ్రీమాళవరా
జ్యశ్రీరాజాధిరాజశౌర్యౌదార్య
ప్రశ్రయపరమయశశ్శ్రీ
విశ్రుతగుణవీరధర్మపృథివీశునకున్॥ 1079

క॥ శ్రీమగధచక్రవర్తులు
ప్రామాణ్యయశస్సమేతబాలాదిత్య

శ్రీమన్నృసింహభూప
గ్రామణు లభివందనముల వ్రాయు శుభంబుల్॥ 1080
ఆ॥ డింభమిహిరుహోవడి న్స్వప్రతాపార్చి
చే నతిక్రమించి జీవకళల
నెల్లదేశములను జల్లుగా వెదచల్లు
వీరశాంతధర్మ! వీరధర్మ!॥ 1081
తే॥ పద్మినీభాస్కరప్రేమబాంధవంబు
సహజమా! సాధితమ! తద్వశంవదత్వ
కృతుల జగమెల్లఁ గొనదె యుద్రిక్తసుఖము
నమరె నేఁడల్లె మనకు విందైనపొందు॥ 1082
క॥ మిాతనయుఁడు నాతనయ య
రాతిదమనఘోరసవనరక్షాదీక్షా
పూతఖ్యాతులు ఫలకలి
తాతతకళ్యాణులగుట యానందమొకా!॥ 1083
ఉ॥ కానఁ గళత్రపుత్రహితకాండపురోహితబంధుబృందసే
నానివహాదియుక్తముగ నన్ననియింపఁగ నేగుదెంచి నా
చే నగుమన్నన న్దనిసి చేసికొనుండు వివాహ మార్యసం
దానితసన్ముహూర్తమునఁ దత్సమయోచిత మంగళాదులన్"॥ 1084
క॥ అని చదువఁగ ముసిముసినగ
వెనయించు ముఖంబువిప్ప నేయితరముచే
తనొకప్పు తనయుహితవ
ర్తనము న్గని నృపతి సమ్మదంబునఁ బలికెన్॥ 1085
తే॥ "ఇంతకంటెను సంతోష మేమికలదు
వరుఁడు వరయిత్రి మున్నె యేర్పఱచుకొనిరి
మేము మాపెద్దతనము నిమిత్తమాత్ర
మనుపుఁ డీవార్తఁ! దర్లి పోఁ గనుఁడు వేళ!"॥ 1086
తే॥ ఆజ్ఞ నెఱవేర్పఁబడియె బ్రాహ్మణుఁడు చనియెఁ
బెండ్లివార్తర్లి రొకనాఁటి వేగుజాక

తేని సెలవొంది తమయూరుఁ గానఁ జనిరి
భారవియు మిత్రుఁ డౌత్సుక్యభరము విరియ॥ 1087

తే॥ బాట నీమాట నామాటఁ బలుకుకొనుచు
గ్రామ మదెయిదె యంచు జంకలనుగొట్టు
కొనుచుఁ జనువారి కొక్కమాపునను దోఁచె
నగ్రహారంబుసెలయేరు నవలవటము॥ 1088

ఉ॥ సూర్యుఁడు మందరశ్మియగుచు న్జరమాద్రిశిఖ న్వెలింగె సౌ
కర్యముఁ గూర్చుచు న్జిఱుతగాడ్పులు వీచె సుధాకరుండు సౌం
దర్యమిమీఱఁ దూర్పుకెలన న్వికసద్రుచి సంచరించె నా
శ్చర్యముగా శరద్ఘనజశాబకము ల్దివి నిండుచుండెడిన్॥ 1089

సీ॥ చల్లనిగాడ్పు లుత్సాహంబుల వెలార్పఁ
బక్షులు పట్టీలఁ బాఱదొడఁగెఁ
బశువులు కుప్పించి పఱవఁల్లుగొనెఁ బూల
మొగ్గలు విరిసి పుష్పౌడులఁ గుప్పె
బుడుతలు సైకతభూములం దఱిముఱి
మురియుచు దుముకులఁ బొర్లఁబడిరి
కాంతలు వేఁశిసింగారింపఁ బూఁదోఁట
లందుఁ బుష్పాపచయంబుఁ జేసి
రితరకూపాలనుండి నీ రెత్తికొనుచు
నందుఁ గొందరు తమయిండ్ల కరుగుచుండి
రిండ్ల లేఁగలు మోఱల నెత్తి యఱచె
రమ్యమైనతదగ్రహారమున నపుడు॥ 1090

నా॥భారవీ! తే॥ మాకు నీకును గ్రమ్మఱ మైత్రి నొసఁగి
వెలసె 'సంధానవట' మనుబిఱుదుపేర
నెద్ది యామట్టి యదె చూడు మెట్లుపిలుచుఁ
జిగురుచేతులఁ బిలుపులఁ దొగరుపసల॥ 1091

భా॥ క॥ ఓరోరి! సంగడీం డ్రా
చేరువఁ గూర్చుండి యెదియొ చెప్పకొనెద రీ

తీరమున నిలిచి విందమె
వారిసమాచారక్?, మదిగో! వాసునిపలుకుల్॥ 1092

చ॥ "కవిహృదయంబ! కష్టతరకల్పన లోక్కడ బాలబాలికా
నివహపరిగ్రహానుగతి నింపెదు, వేఁటోకచోటఁ బండిత
ప్రవరసుసూక్ష్మధీబలవిపాకకళాదురవాప్యభావగా
రవరచనాగభీరతను వ్రాసెదు నీప్రభ నెన్న శక్యమే!"॥ 1093

నా॥ ఓహో! మిత్రమా! తీరమునందలి భంగముల సంఘర్ష
ణములు సముద్రమధ్యగతపర్వములకు లేనట్టు లీమన
స్నేహితు లెంతనిశ్చింతగాఁ దమకవిత్వాభ్యాసముం జేసెదరో!॥

భా॥ ఆఁ! తాళు మదే మధుసూదనుని గాత్రము!॥ 1095

చ॥ "నవరసయానపాత్రము, సనాతనమధ్యనవీనసత్కవి
త్వవిభవశోభితావిరళభావనిబద్ధనిసర్గకల్పితో
త్సవవిమలాకృతిగ్రహణతత్పరమంగళదర్పణంబు స
త్కవివరమానసంబుఁ గుణగౌరవలాలస మెన్న శక్యమే!॥ 1096

నా॥ బలే! యేమి వీరి యస్ఖలితానందము! 1097

భా॥ ఉండు మదుగో కృష్ణుఁడు! 1098

శా॥ "ధీరానీకముహుర్ముహుర్లలితభక్తిజ్ఞానవైరాగ్యయో
గారూఢాఖిలధర్మసంచయసుఖవ్యాఖ్యాతృసద్దేశికా
చారప్రేరితసన్మతప్రబలకృత్సంజ్ఞాప్రచారక్రియా
ధౌరంధర్యము సత్కవీంద్రహృదయాస్థానంబు సామాన్యమే!"॥

నా॥ ఆహా! యెన్నినాళ్ళ కిట్టిసంతోషము మఱలఁ గలిగె! ॥ 1100

భా॥ వాఁడుగో! గోఖేలుఁడు! 1101

సీ॥ "కోమలపదనియుక్తామల రామ భా
రతకథాకలితపురాణశైలి
సకలసమ్మోదకాష్టాదశవర్ణన
ప్రాగ్భారసహితప్రబంధశైలి
నఖిలప్రపంచ వృత్తాదర్శకప్రాయ
నాటకానీకబాహాటశైలిఁ

జిత్రచిత్రకథావిశేషగర్భితమహా
ఖ్యాయికాచిత్తాపహారశైలి
తే॥ శమరగంగాప్రవాహరవానుకరణఁ
బుస్తకాఖ్య సమీచీనభూతలమునఁ
బ్రతిభగీరథవిఖ్యాతిఁ బ్రబలఁ జేయు
సార! కవిహృదయప్రౌఢి నరయ వశమె!"॥ 1102

నా॥ బాగు! బాగు! వాగుజ్జృంభణము!॥ 1103

భా॥ నాగేశ్వరుఁ డెద్దియో పల్కెడు॥ 1104

"మిత్రులారా! కవియొకయెత్తు, లేఖిని మఱియొకయెత్తు, కలమే
లేకుండినఁ గవికల్పితములు నిమిషభంగురములే కదా! 1105

క॥ కలామాన్నం బొక్కని కా
కల మన్యన కొసఁగుచుండు వహాహా! యెన్నం
గలమా! యధికారి కయిం
గల మాహాత్మ్యమున నీవుఘనత న్గలమా!॥ 1106

నా॥ ఓహో! సన్నిహితవిషయమునే చేకొనెనే!॥ 1107

భా॥ రఘురాము నుడి! 1108

చ॥ "కలిమిఁ జెలంగువారలకు గౌరవ మిచ్చెదు వారిబుద్ధిఁ బు
ష్కలముగ దాతృతాగరిమఁ గల్పనఁజేసి, తదన్యులైనపే
దలకు నినుంగన న్నవనిధానముఁ జూచుతెఱంగుగాదె, యో
కలమ! సమస్తభక్తగణకార్యఫలాచరణానుకూలమా!॥ 1109

నా॥ ఏమియహూహా! 1110

భా॥ వాఁ డశ్వఘోషుఁడా! 1111

మ॥ "కలమా? ఖడ్గమ? రూఢగౌరవపదాగ్రస్థాయికొ నెద్ది యుం
చలఘుప్రక్రియ హేతువాదముల మోహావేశులై మానవు
లెలియన్నేరు తదీయశాశ్వతగుణాధిక్యత్వము న్దానినిం
దలకుం దావగునశ్వరస్థితియు స్వాంతంబందు సుంతేనియున్॥ 1112

నా॥ తగుఁదగు వీని తర్కసిద్ధాంతములు! 1113

భా॥ మోహనుఁడు! మోహనుఁడు! 1114

సీ॥ "అనురాగబలసమ్యగాకర్షితులలేఖు
లందుఁ జిందులు ద్రొక్కుచుండుగాదె!
కలుషీకృతాంతరంగంబుఁ గల్గినవారి
నులికించి యుడికించుచుందుగాదె!
వైరివీరోగ్రయుద్ధారంభసమయంబు
లందుఁ జిందులఁ ద్రొక్కుచుందుగాదె!
కవితారసాపూర్తి కలచోట్ల సకలభా
వోద్రేకమూర్తివై యుందుగాదె!
తే॥ నీమహిమంబు లివియని నిర్వచింప
నలువకైనను వేనోళ్లచిలువకైన
నలవికాదన మాబోంట్ల మలరి తలఁపఁ
గలమ! విద్యాస్థలీమహాహాలమ! కలమ!"॥ 1115

నా॥ మంచియుపమానము! 1116

భా॥ అదివినుము! శంకరుఁడో! 1117

మ॥ 'కలమా! దివ్యశిలీముఖావళులు ప్రజ్ఞావంతుచేఁ బ్రేరితం
బులెయైన న్విఫలంబులై చనఁగనొఁబో యొక్కచోఁ గాని త్వ
ద్బలవిన్యస్తమహాక్షరావళి ఫలప్రస్తారితోద్యత్కళా
విలసద్గారవగర్భితంబెయగుగా వేయేండ్లకైన న్భువిన్'॥ 1118

నా॥ బాగు! పడికట్లకేమిలే! 1119

భా॥ విశ్వనాథుఁడోయ్! 1120

చ॥ "అలవికిరాక దేశములనన్నిఁట నన్ని తెలుఁగుతాచు వి
చ్చలవిడి సంచరించు నెఱజాణ ప్రసిద్ధత రేందర్జాల వా
గ్లలన తదున్నియంతృపదలాలస మక్షరపంక్తి దాని కీ
వలసట నీని యాయుధము వయ్యెదుగా కలమా! తలంపఁగన్॥

నా॥ "చక్కఁగాఁ జెప్పినాఁడు! 1122

భా॥ ఈగాయకుం డెవ్వఁడో!॥ 1123

గీ॥ చిఱుబుఱ్ఱాడు మానిసి చేతియందు
గడుసుపోకలు కలవాని కరమునందు

శాంతమతియగు నరుని హ_స్తంబునందు
భళిరె! యనువ_ర్తనముఁ జూపఁ గలవు కలమ!॥ 1124

గీ॥ నలువ తాసృజియించు జీవులకు నొసట
భావిగతి వ్రాయఁదలఁచి నీవలనఁగాదె
తనదుకార్యంబు నెగ్గించుకొనుచునుండు
కలమ! యాద్యంతరహితభాగ్యంపు పొలమ!"॥ 1125

నా॥ ముద్దుగా చెప్పినాఁడు! విక్రముఁడుకాదూ!॥ 1126

భా॥ ఓహో! భానుమల్లుఁ డెవ్వఁ డిచ్చటికివచ్చె! 1127

సీ॥ "వ్యంగ్యప్రధానభావప్రగల్భత లొప్ప
వ్యాసార్ష సాంప్రదాయములు నిలువ
ఘనసుశబ్దాద్యలంకారపాండిత్యధూ
ర్వహులకావ్యము లతిప్రతిభ నొంద
భాషార్ణవరసప్రవాహంబు లరికట్టు
లక్షణగ్రంథము లర్థిఁ జెలఁగ
శబ్దప్రయోగవైశద్య నైఘంటిక
భాస్వత్కళాప్రభావంబు మెఱయ

తే॥ యుష్మదీయసహాయసంయోగగరిమ
కాక కల్గునె వేఱొండుకారణంబు?
సకలభాషాభివృద్ధికి సాధనంబు
కలమ! నీయొర్పుగలచర్యగాదె తెలియ!"॥ 1128

నా॥ (పోఁబోవును) 1129

భా॥ (చేయిఁ బట్టుకుని) నిలువుము. వారియుత్సాహ మాపకుము!

శా॥ "ఉత్సాహానిలసంతతోద్ధతములై యూహాతరంగంబు లు
ద్యత్సౌధాగ్రసమున్నతోద్గతులఁ జిత్తాంభోధి నుప్పొంగ నే
తత్సౌభాగ్యము నక్షరాళి కిడి సత్కావ్యాదుల న్నిల్పు సం
విత్సౌరభ్యము నీకకాక కలమా! వేఱెరికి న్గల్గునే?"॥ 1131

నా॥ అతిశయో_క్తి, గంగాధరుఁడా? 1132

భా॥ అవును — వాసుదేవునికంఠము! 1133

సీ॥ "సంగరరంగనిస్సాణధాణాంధణో
ద్భటవర్ణనప్రభావంబుఁ జూపఁ
గరవాలవివిధచంక్రమణప్రసారఖం
డితశత్రులగుశౌర్యనిధులఁ దెలుప
ఢమఢమార్భాటతాండవమర్దితారిప
త్తనసంచయోగ్రశస్త్రముల నెన్నఁ
బ్రళయతరాగ్నిప్రవాహసంజనకబా
డబసుప్రయోగపాటవము వ్రాయ
వైరిమారకవిషరసాపూరితాస్త్ర
మహితహాలాహలాభీలమహిమ వినుప
యుష్మదీయప్రసాదసంయోగగరిమ
కాక తెలుఁ గొందు కల్గునే? కలమ! తెలియ" ॥ 1134

నా॥ ఔరా! భానుమల్లుని యనుకరణము! 1135

భా॥ ఆనాగేశ్వరుని ! 1136

సీ॥ "కాముకు లమితమకామితరూపము
ల్చిత్రంబుల లిఖించి చెలఁగ నేర్చ
ననురూపముగ మలంచినవిగ్రహంబుల
నందంపు సత్కళ ల్హత్తనేర్చ
నవలామనోజ్ఞమౌ నవకంబు నవలీల
నవలీల రచియించు కవులు నేర్చ
బుధుతల తడబాటునుడులెల్లఁ గడుమోద
మెసఁగించుపస వ్రాసి యిడెదు నేర్చు
తే॥ వాణి యసహాయయై తనభక్తవరుల
కొసఁగనేర్చునె కోరిక యున్ననైన?
యుష్మదీయప్రసాదసంయోగగరిమ
చెలఁగి తోడ్పడిననెకాక కలమ! తెలియ॥ 1137

లా॥ యోగ్యముగనే యున్నది. కాని మకుట మదియే!॥ 1138

నా॥ మఱల భానుమల్లుఁడు! 1139

చ॥ "పలుకువెలంది చిత్తమును బ్రామినధీచతురాస్యుఁ గొల్చి రో
జులు నెలలు న్గన బ్రసవసూచకవేదన స్రుక్కుచుండ నా
సలుపులఁ దీర్చి యూహలను సంతతి నోముచు మంత్రసాన్నివై
కలమ! ప్రమోద మిచ్చెదవుగాదె భవత్స్వతిరమైనవాణికిఁ"॥ 1140

నా॥ ఆహా! యేమియూహ! ఆ'సలుపుల'ననుటలో నెంతయైనఁ గలదు మాధుర్యము. ఈచెట్లగుబురునుంచి యొకగమ్మత్తుఁజేసెద. నీవును వారి కంటఁ బడకుండ నొత్తిగిలి చూచుచుండుము. (మాఱు గొంతుతో) 1141

సీ॥ కలమాని వెగటుపోకలమాని శృంగార
కళ మాయశోధర న్బలుకు కలమ!
కలమాధురీవిశృంఖలమాన్యలావణ్య
కళ మాయశోధర న్గిలుకు కలమ!
కులమార్గశుభనిరాకుల మహాసౌశీల్య
కళ మాయశోధర న్దెలుపు కలమ!
వీలసత్పికారావతులనాదసంగీత
కళ మాయశోధర న్గొలువు కలమ!
తే॥ పట్టి వ్రాయింపకున్న నీగుట్టు బట్ట
బయలుగా నట్టనడివీథిఁ బడదె కలమ!
సంతతాన్యావలంబనజడతఁ దగులు
నీకుఁ గలదే స్వయంకృషి నెగడఁ గలమ!॥ 1142

వ॥ అన సంగీతసాహిత్యరసప్లావితులై యచలితులైయున్న యచటి వారందఱు 'ఎవ్వరెవ్వ'రని లేచి పరిక్రమించి కని 'యోరీ! నారాయణా! ఓహో! భారవీ! ఎంతకాలమునకు పునస్సందర్శనము కలిగె'నని కౌఁగిలింతల గడబిడలతో వారి నూఁపుకొనుచుం గొని చని వటవిటపిక్రిందఁ బునరాసీనులై 'భారవీ! ఎవరికిం దెలుప కెందే గితి వేమియొనర్చితివి? నారాయణా! వీనిని నీ వెట్లు లెచ్చటం గనుఁగొంటివి? యశోధర యెవరు? విశేషములెల్లఁ దెల్పుఁ'డన నక్కౌతూహలంబున కనువుగా జరిగినదంతయు నభివర్ణించిన వెనుక.

నా॥ఉ॥ "పెండిలి మాళ్వమాగధులఁ! బ్రీతిగ మేలగు పప్పుదప్పళాల్,
మెండుబహూకృతుల్ కృతు లమేయవిలాసవినోదలీలలున్,
రండు ప్రయాణమై వెడలి; శ్రద్ధ నిట న్బడి నేర్చువిద్య లా
దండిసభ న్గనంబఱచి తద్దయుఁ గీర్తి గడింపఁగాఁ దగున్"॥1144

క॥ అన నందఱుఁ దడఁబడువడిఁ
గొనిచని పినపెద్దలెల్లఁ గూడి పయనమై
మనభారవి నారాయణు
లనువుగఁ దోఁగాఁగ మగధ కరిగి రెగుఫుల న్॥ 1145

చ॥ అట రణసీమలో మిహిరు నట్లు యశోధర ధిక్కరించియే
గుటఁ గనినంత, 'నోసి!ప్రియ! గొబ్బునఁ దోఁ జను'మన్న నాథుము
చ్చటనుడి యాజ్ఞగాఁగ శిరసావహియించి, వితాకుఁగుంచి, య
ప్పటి కటులేగె లక్ష్మి పరివారములు న్వెసఁ జీలి సాగఁగన్॥ 1146

మ॥ "చెలియా! నీప్రియుఁ గొల్చిపోవలదె!, నీచేఁ గొన్నసాయంబు నా
కొలఁది న్మించినబాకియయ్యె, నిఁక మీకు న్గూర్పఁగానోర్వ నో :
క్కలవంబే నెడబాటు, హా!"మ్మనెడి రాట్కన్య న్విలోకించి మం
జులత న్గొల్పెడి విప్పుమోముదరున న్జూకాలు దూఁకులూర్కన్॥

క॥ తొలఁగించుకొనినతలపొద
వులకనఁ గై వెలయఁ దొడిగి యూఁగించుచు వె
న్నెల లుబికెడి మెలనగవులఁ
బలికె లలన లక్ష్మి, వీణెఁ బలికించులలిన్॥ 1448

క॥ "రాకన్నెరొ! మావారికి
నాకును బంపిల్లుజరిగె నాణెంబుగ మా
మాకార్యసమారాధన
మీకరణి న్నన్ను మిత్రహితమునఁ జేర్చెన్॥ 1149

ఆ॥ వారు పెండ్లికొడుకువై పేరుకొన నేరు
కొనని నేను? పెండ్లికూఁతుఁ జేర'
చెలిమికలిమివెలయఁ గలుగునే స్వార్థప
రత్వమెందు సరులరహికి ముందు?॥ 1150

క॥ 'వినిచెవుడు స్గనిగ్రుడ్డియు
జనపతులు, పరాకుఁ దెలుపఁ జను'నను లోకో
క్తిని సార్థకంబుఁ జేసెదు
మును పొసఁగినముదల మఱచిపోయితివె? భళా!॥ 1151

క॥ నాయ త్తమూమలను గన
నాయి త్తముగాఁగఁ గూర్త యత్నంబును ర
మ్మా! యనవే! యిపు డి ట్లీ
మాయ నవేక్షింతె? మిత్రమా! యిది పంతే?"॥ 1152

క॥ నా నానతశీర్షయు ముఖ
నానారసభావధావనారమ్యయు నౌ
నానారి యశోధర, "లల
నా! నాప్రాణావనక్రియానందమయీ! ॥ 1153

ఉ॥ మాటలలోఁ జెు? బ్రాహ్మణకుమారివి, సత్కవిభార్య, వూహల
న్మేటిపదంబ, వీ విటు గమించిన మోదము తైలధారనాఁ
బాటిలు నాకు, నాతొలిభవంబునపున్నెము కల్మి కాదె యి
ప్పాట ఘటిల్లె నేస్తము, భవాదృశ లుండరు వాస్తవమ్ముగన్" 1154

ల॥ ఉ॥ "ఏమి! యశోధరా! కవులు హెగ్గడికత్తెలు వందిబృంద మే
మేమని స్తోత్రపాఠముల నెప్పుడొసర్ప విలాసరీతి నా
యామధురత్వ మెన్నుసుగుణాఢ్యవు రాసుత వీవు నిన్నె యి
ట్లేమటి వందివయ్యెదు భళీ! యెకసక్కెము చాలు కోమలీ!॥

క॥ రాయంచ నీరు విడి పా
లే యానెడులీల నా మలీమసకృతులం
దోయమ్మ! మంచినే కొనె
దీయౌదార్యమ్మె నెంతయే నెన్నఁదగున్॥ 1156

క॥ నీ వని యెఱుఁగక యున్నను,
నీ వని తోఁగవయు, నెట్టి నిర్ణిద్రగతిన్,
దావిఁ గను తేఁటివలె, వడిఁ
దా వెదఁగి చరించె తే; డతనుబంధ మహా!॥ 1157

ఆ॥ ఎఱుక మఱుఁగు వడిననేని, సంబంధబాం
ధవముఁ గల్గియున్నతావులందు,
మనసు మనసు నురక మాటాడుకొని కూడఁ
బడు నటంట కిదియె ప్రబలసాక్షి"॥ 1158

క॥ అను మేలంబులు బార్యా
రను మేళంబులను దమరహాస్యస్థితి మే
లను మేళంబుగ వెలయఁగ
ననుమేయసుమధ్యమలు హయంబులఁ జనఁగన్॥ 1159

క॥ అందందు విడియు చరుగుచుఁ
జిందంబుల విజయఘోషఁ జెవులదరఁగ న
య్యంద ఱొకదినమున న్నగ
ధం దరిసిరి సమ్మదములు తద్దయు నిగుడన్॥ 1160

క॥ బాలాదిత్యనృపాలక
బాలకుఁడున్ యావరాజ్యపదలలితుం డాం
దోళికలతోడ నెదురై
హాళిం గొనిచనియె నప్ప నాలక్ష్మియు రాన్॥ 1161

క॥ తనమేడకు దాపున ల
క్ష్మిని మేల్ప్రాసాదమందు శిష్టుత సరిగా
నునిచి, యశోధర, యనుదిన
మును నుద్యానమునఁ గలియ ముదల నొసంగెన్॥ 1162

తే॥ శ్రమము విరియంగ రాజోపచారములను
నాఁడు మఱునాఁడుఁ జన, మఱునాఁడు లక్ష్మి
తనదు హర్మ్యంబు దిగి కేళివనముఁ జొచ్చె,
మనసుపదరుట లోకకొంత మాఁపుకొనఁగ॥ 1163

తే॥ పాప మాపతివ్రత కెద నాఁపుకొను టె
కార్యముదినంబు మొదలుగఁ గానువాయి;
యెంతనిబ్బరమో గుండె, యెవరితోడఁ
జెప్పుకొనఁగల దెటువంటి చిన్నమాట!॥ 1164

తే॥ నడువనట్లగు నడచుచు, ననలదెసలఁ
జూడనట్లగుఁ జూచుచు, సుదతిమిన్న,
నడక యెచటికో; చూపులఁ బడున దెదియొ!,
వాచకముసేయ వాచామగోచరంబు॥. 1165

క॥ ఆచూపుల రోదసిలోఁ
జూచునో కో! గవాక్షి ధవునిఁ జూచుకొనుపసఁ
జూచునో కో! చీటి నోసఁగుటఁ
జూచునోకో! గరిడి ధవుని సుగతమకంబుఁ॥ 1166

ఉ॥ "బేలతనంబున న్ప్రియుని ప్రేమము నాఁ డటు నిల్వరించుదో
పాలఘుకీల వెంటఁబడి యాఱుఁగఁ బోవని చాటుచిచ్చుగా
నీలలి నాసుఖంబు నిగిరించెడినో!" యని వంతనొందునో
బాల? మఱేమికారణమొ పక్ష్మము లానఁగ నూరె నశ్రువుల్॥

శా॥ "అయ్యో! మూఢ నదృష్టహీన నిటు భార్య న్గాకయేయున్న నా
నెయ్యం బెంతటిసౌఖ్యవంతుఁడగునో! నిర్భాగ్య నన్గొంటనే
డయ్యం జొచ్చె నిరంతరాపదలయొద్ధారంబు పైముట్ట!", నా
చయ్యేణాక్షి తపించునో! కనులు బాష్పాక్రాంతిఁ దొట్రిల్లెడిన్॥

ఉ॥ ఆ విరిగుత్తిచాలుపుల నా వరచంపకగంధవీచులం
దా విలసత్ప్రికార్భటులయాదముల న్బతి బ్రహ్మచారిగా
భూవరదివ్యపారిమదభూముల నొందినమెప్పు, గేస్తుగా
నావడిపాటుఁ జూచునొకొ యన్నులమిన్న తపించు బిట్టుగన్॥1 169

ఉ॥ కన్నుల నిండునశ్రుజలకందముఁ దూటి కనీనికారుచు
ల్భిన్నములై వనావనిక వ్రేలఁగఁజేసెనొ నూత్నరంగము!,
ల్కన్నె, లతానికుంజములఁ గన్గొన, కన్పటఁ జూచు, నాథు నా
పన్నత, ఖిన్నభావము, విపత్స్థితి, ము న్దనపుట్టినింటిలోన్॥ 1170

ఉ॥ పేరునకేవివాహిత యపేతసమస్తతదీయసౌఖ్య నా
నారిని కన్నెయన్నఁ 'దగునా?' యనలేము వ్రతంబుపేర ము
న్జేరికనాఁడె దాపరిలెఁ జిచ్చుపృథక్శయనంబు, పిమ్మట
న్దీరదు వారలిర్వు రొకదిక్కున సంస్కృతిసౌఖ్య మొందఁగన్॥ 1171

సీ॥ పెనిమిటి తనుఁజేరి కొనవ్రేలుఁ గొన మీఁటు
కుతుక మెట్టులొ ప్రింగుకొనియె మొదట
ధవుని పాదము లొత్తుతఱి మేన గతిదేఱ
నివురించె ధైర్యంబు మివులఁ జూపి
తలయెత్తి భర్త కోర్కులఁ దల్పమునఁ గొల్వ
నవరించుకొనె నచంచలత వెలయ
మగఁడు కాలంకసీమలఁ జాప రేఁగు మై
జలదరింపుఁ దొలంగి చంపుకొనియె
తే॥ నాఁటి తమిపొంగు, నదిలొంగ దాఁటుహంగుఁ,
జెంగుచెంగున మదిని గలంగఁజేసెఁ
గొవలయుఁ, జింత కుమిలి పై లేవవలయు,
మైనపుఁదివ్వె క్రిఁదిఁగె మలయుమాద్రి॥ 1172

ఉ॥ "వ్రత మయిపోయెఁగా" యనెడిపర్వము మున్నుగనత్తమామల
న్వ్రతకుటకల్లె, వారు కనుపింపకమున్నె కిరాతహన్నుచే
వెత సమకూరె, నయ్యదియు వీఁగకమున్నె ప్రపంచనాశనో
ద్ధతసమరంబుసాగె, నహాహా! గ్రహచార! మయో! విచారముల్!॥

ఉ॥ ప్రణయునియానపైఁ గలుగుభక్తివిశేషతఁ గొన్నినాళ్లు, ర
క్షణగతి రాసుత న్గనుచుఁ గ్రాలుటలో నొకకొన్నినాళ్లు, మా
రణరణసంవిధానగురురంగతలంబులఁ గొన్నినాళ్లుఁ బా
రణము ఘటిల్లె, నేఁటికి భరంబయి మోహము చింతఁ గూర్చెనో!॥
తే॥ 'విఘ్నపతిపెండ్లి కన్నియు న్విఘ్నము' లను
సామెతగ నిప్పటికినైన సౌఖ్య మబ్బ
నున్నదో! లేదో! ముం దెట్టు లుండఁగలదో!
అత్తమామలఁ గనమైతి మనెడివగపొ! ॥ 1175

క॥ చనుచున్నది కాళ్లెట్టులఁ
గొనిచన నాదారి, నడుమ గునుపునఁ దేఁటుల్
నవల మధుపానుకొను చా
మె నుధురుపయి ముసర సంభ్రమింపనిగతితోన్॥ 1176

ఉ॥ మల్లెపొద ల్గులాబులును మాలతులు న్బొగడ ల్జపావను
లొమ్మల్లలు మున్నుగాఁ గుసుమమోహనవృక్షలతామతల్లు లం
దల్లలనాడుచు న్నెలకులందు సుమాంజలు లీ గ్రహింపఁగా
నొల్లక దాఁటిపో నచట నొప్పుకలంతలు నంతయొప్పునే!॥ 1177

తే॥ గ్రుడ్లకన్నీరు గ్రుడ్లనే క్రుక్కుకొనుచు
మెడ్డుకొనువంత లోననే మ్రింగుకొనుచుఁ
'గలవె యగచాట్లు పడినంతకాల మింక'
ననుచు నోదార్చుకొను చంత ననుచు పురిని॥ 1178

క॥ ఒక క్రొత్తయుపమ యాక
స్మికముగ మదిఁ దట్టెనేమొ మేనెల్ల జెకా
చెకలవిలసిల్ల నుఱికెడి
వికచానన; బోధనగము విడుబుద్ధుఁ డనఁ॥ 1179

తే॥ విడిదిమేలింటిలోఁ జొచ్చె, వెడల దెంత
సేపటికి, రాజపుత్త్రి విశేష మెఱుఁగఁ
బోవుదమ! పాఠకా!, - తాళు, - పొరయొ! నిజమొ!
హర్మ్యమును వీడునామోహనాంగుఁ డెవఁడొ?॥ 1180

సీ॥ కుచ్చుజరీపాగ కెచ్చుసోయగ మిచ్చు
కస్తూరికాతిలకంబు దిద్ది
తిలకంబునకు సొంపుఁ దేఁజాలు కెంపుత
మ్మాటులఁ జెవుల కొక్కంటఁ బెట్టి
తమ్మంటులకు దీప్తి యిమ్మడింపఁగ మేనఁ
గడుఁదెల్పుటంగరకాను దొడిగి
యంగరకాకు సొరందించుమేల్పట్టు
పుట్టంబు నుపవీతముగ ధరించి
సరిగదోవతి క్రిందుగాఁ దుఱఁగలింప
రకపుమేజోళ్లపైఁ బాదరక్షలూని
చేతఁ జిఱుబెత్తమును హొయల్చిందఁ ద్రిప్పు
కొనుచు సౌధంబు విడె నెవం డనఁగవలయు?॥ 1181

క॥ "ఎవ రక్కడ! నిలు! నిలు! మను
జవముంబింకపునదపుసడిఁ బ్రాసాదం
బు వెలికి నడిచె నికొక్కం
డవురా! గారడియొ మేడయద్భుతమొక్కో!"॥ 1182

ఆ॥ నీరుకావియంగి జీరాడఁ, బావాలు
నులియ, గుండి చేత వెలయఁ, గొండి
ముడిగ వేణిఁ జుట్టి, మొగము విభూతితో
దండిదండినా నతంకు తోఁచె॥ 1183

క్రొత్తమనిషి. క॥ ఓహో! పస్బైరాగివ!,
యేహామిక నగరుఁజొచ్చి యేగెద విటుసం
దేహంబులేక, దేహం
బైహికమును హేయమయ్యెనా!, నిలు మచటన్!॥ 1184

ల॥ క॥ నామాట నుంచుమటు, నీ
వీమాదిరి జంకులేక యిటువోఁటఁబడి, పై
నే మొ బెదిరించెదవు, విను!,
నామంత్రం బొక్కఁడే ననంతఫలదమా!॥ 1185

క్రొ॥ తే॥ అట్టులైనను గలహింప ననువుకాదు
దొరకిపోయితి వీవు, నా మఱుఁగుఁ జెడియె,
నామతంత్రంబు నీదుమంత్రమును గలియ
మనపనులు నెగ్గు, రా! రాకుమారి వచ్చు!॥ 1186

బై॥ తే॥ అట్లు దారికి రమ్మి!, యన్యోన్యమైత్రి
నూరుపనులున్నఁ గలుగు నన్యోన్యజయము
యుద్ధముల శాంతి నెప్పుడ న్యోన్యసంఘ
బలమె బలమగుఁ, బద! లక్ష్మి వచ్చు నేమొ!॥ 1187

క॥ అనఁ బ్రక్కప్రక్కలుగ నా
తనుఁడున్ బైరాగి నడుచుతఱిని జరమది
క్కునఁ బొద్దు బారెడుండెఁ, బ
వను-డల్లనఁ జల్లన న్బ్రివర్తిలసాగెన్॥ 1188

ఉ॥ మల్లెల నాని సంపెఁగలమాటున సాంద్రతనొంది విస్ఫుర
త్ఫుల్లసరోజవాసనలఁ దోఁచి సమస్తసుగంధపుష్పవ
ద్వల్లరు లీనుతావిఁగొని భార మపారముగాఁగ మెల్లఁగా
నెల్లెడ నందు గుంగుమ రహింప సమీరుఁ డెసంగె లాహిరిన్॥ 1189

తే॥ తలఁచి కారణ మడుగ నిద్దఱికిఁ జిత్త
మిద్దరికిరాదు, గుట్టు భేదిల్లు ననుచు,
తోఁటసొబగులపైన సపాటఁ బాఱు
చూపు సెలయేర్లు తొనఁకుల సోకి మగుడు॥ 1190

చ॥ పలుచని మబ్బువెన్కఁ బలవల్వడుకాంతి నినుండు తోఁచుచె
ల్వ్వల నటఁ బ్రొద్దుతిర్గుడుపువ్వు ల్నతశీర్షముల న్హసింప, న
వ్వ్వలుపు గ్రహింపకే యెదురఁబోని కనీనికలట్లు, వారిచూ
డ్కులును బరస్పరంబుఁగన గుబ్బటిలు న్వడి దొంగదాఁటులన్॥

క॥ బడిబాట విడిచి విడిచిఱు
నడవ న్బడి కొంతవడిఁ జన నగ్డుమఱుఁగొ
నెడఁ గానఁబడియెఁ దాళముఁ
దొడిగినద్వారంబు, తెఱవఁ, దోఁచె న్బయటన్॥ 1192

క॥ సోపానపంక్తి, యవ్వల
సొపగుసికతాస్థలంబు, జాహ్నవి; మోడ్పుం
జేపట్టుల 'జే'పెట్టుచు
నాపట్టునఁ గొంతనిలిచి రాప్యాయముగన్॥ 1193

తే॥ వాకిలికి బీగమును వేసి పలికెఁ గ్రొత్త
మనిసి, "యో! సాధువా! చెవిం గొనుమి యిదిగో!
నాకుఁగల దింకొకటి, యేపరాకు లేక
కార్యము ముగించుకొనుచు రాఁగలవుకాదె?" 1194

వై॥ వెరవరీ! "సాప్తపదీన మ్మైన్నహా"మ్మనుట లోకప్రసిద్ధము. అందును ప్రపంచసౌభ్రాతృతను బాటించుమాబోంట్ల కవస్యానుసరణీయము. నేను లక్ష్మీబాయి కొనరింపఁ దలఁచినసహాయము జాగు నోర్వ నిదియైనను రాజలక్షణలక్షితుండవయ్యు వినయాన్వితుండవగు నీవు

'నీమంత్రమును నాతంత్రమునుం గలియ మనపనులు నెగ్గు" నను వాక్యముల సూచించియుండిన నీకార్య మెద్దియో తెలిపిన నావల నగుసహాయ్యముం జేసి పదపడి యామెపనిం గూర్చుకొనియెద. ఏమి యనియెదవు? 1195

క్రొ॥ అయ్యా! లక్ష్మమ్మగారిపనియనిన రాకుమారి ప్రథమానుసంధేయముగా గణించుచుండును. నాకు నామెకుంగల చిన్ననాటి నుండి పెఱిగినచెలిమి కతంబున నామెకోర్కులే నాకోర్కులుగా నేఁ జూచుకొనుచుందును. కావున నాకిపుడు లక్ష్మమ్మగారి కార్యముంగూర్చి యత్నించుటే యవశ్యాచరణీయము. దయయుంచి తెలుపుఁడు! మనయిరువురి బుద్ధిబలముకలిమి నది నెరవేరిన యనంతరమున శ్రీయశోధరాదేవివిషయముంగూర్చి తెలిపెదను.

బై॥ అట్టులైన మీయిష్టము. మేముకోరు నెద్దానవైన మాకు పట్టుదల యుంచుకొనము. నీవుకోరినట్లే లక్ష్మమ్మపనిమీఁద సరుగఁదగును రమ్మా! 1197

ఉ॥ ఆయమయత్తమామల రహస్యముగాఁ జెఱనుంచినాఁ డట
య్యా! యెదికోరియో యొకమహాప్రభు వీనగరంబునందు, వా
రేయెడ, నున్నవారో పరికించి తదీయసుపుత్త్రిఁ జేరఁగాఁ
జేయుటె లక్ష్మికోరునది; చేనగునంతకుఁ జేయఁ బూనితిన్ ॥ 1198

క్రొ॥ ఓహో! అట్లైన మన మేకకార్యార్థులమే! 1199

బై॥ ఎట్లు?, రాకుమారి ని న్నిందులకే నియోగించెనా?

క॥ "వినిచెవుడు నగ్రిగుడ్డియు
మనుజేశ్వరు" లన్నమాట మాగుణవతియై
వినుతిఁగను " శ్రీయశోధర"
కనువర్తింపదు కృపారసాపూర్ణసుమీ! ॥ 1201

క్రొ॥ ఆమెను 'మాగుణవతి' యనునంతచనువు మీ కెట్లుకలిగెనో! 1202

బై॥ సాధువులకు సుజనులందఱు స్వజనులేగదా! 1203

క్రా॥ సరియేకాని, మీాలక్ష్మీసతికి రాకుమారిప్రాపకము కలదు గదా! రాకుమారికి తండ్రితావున నధికగౌరవంబుండ నామెయాజ్ఞ చిటికెలో నెరవేర్పఁబడదా? ఇట్టిచో మిమ్ముశ్రమపెట్టనేమికతమో?

భై॥శా॥ అయ్యా! చెన్నటిహున్నుఁ దోలుటకునై యీాబాలగోపాలము
న్గయ్యంబందుఁ దదర్హసేవల నోసంగంగాదె యీారీతిగ
ల్పయ్యె; న్నంతస మంద ఱొందఁదగుమధ్యంబందు దుఃఖార్తుగా
డయ్యం జేయుట పాడియే యొకని నాటంకంబు సంధించుచుణ్? 1205

క్రా॥ అయిన నిప్పు డేమియొనర్ప నిశ్చయింపఁబడియె? 1206

భై॥ వా రున్నతావుం గనుంగొని మెలఁకువతో విడిపించుకొనుటయే లక్ష్మీబాయి పట్టుదల. 1207

క్రా॥ పోనిం డీనిర్ణయమునైన యశోధరాదేవికిం దెలిపిన ... 1208

భై॥ వలదు. ప్రస్తుతస్థితిలో నామె కలజడిం గూర్చుట లక్ష్మీబాయికి సమ్మతముకాదు. 1209

క్రా॥ కతము నడుగఁ దగునా? 1210

భై॥ అది నా కవిదితము. 1211

క్రా॥ ఏమి అది మీాక విదితమా? 1212

భై॥ (నిదానించిచూచి) ఓహో! దేవీ! మీాకుఁగూడ విదితమే: 1213

య॥ ఇంతవఱకుఁ బోల్చుకొనకుండుకారణముగూడ తమకు విదితమే కదా? 1214

ల॥ తోడుదొంగలమే లే. ఏమియేమియోవాగించితి వెఱుంగనట్లుండి.

య॥ అగును. తమ్ముఁదామెఱుంగక వెత్తివనవిహారముసేయువార లెదుటిసంగతులనే తెలిసికొనలేనపుడు వెనుకగా గృహముం బ్రవేశించువారి విషయ మెట్లు తెలిసికొనఁగలరు. 1216

ల॥ ఎంతటి జాణవమ్మా! 1217

య॥ గురువులకడ శిష్యులపస లెంత! అప్పుడే జగచ్చక్షువగుసూర్య భగవానుఁ డస్తగిరిసమీాపించుచున్నాడు. సాయంసంధ్యార్ఘ్యప్రదానమునకై యీాగంగాఘట్టమున సమాసీనులయియున్న బ్రాహ్మణుల మధ్యమున ఖీామామగా రగుపడఁగలరేమో! 1218

ల॥ మంచియూహ. అచటఁ దిలకించి యావిశ్వేశ్వరాలయమున కరుగ
నగు. శ్రీగౌరీదర్శనమునకై యత్తగా రచటికి వచ్చియుందురేమో!

వ॥ అని గంగాతీరమునఁ బరిక్రమించుచు నెడనెడం దోఁచుదివ్యభవ
నంబుల గంభీరసౌందర్యాదుల కద్భుతంబందుచు గంగలో నీటి
పయికి దుముకుచుండు చేపల నంతరిక్షమున నాడువిహంగములు
మెలపువడుపు లడరఁ దన్నుకొని పోవులాఘవంబున కబ్బురపడుచుఁ,
బ్రవాహంబు నడిసీమం గలయిసుకతిన్నెల ఱెక్కలల్లార్చుకొనుచుఁ,
జూచినిలుచుచు, యోగనిద్రాముద్రితములోయన నచంచలములై
మెడలనిక్కించుకొనుచు ననేకరీతుల వెలయుకొంగలఁ గొక్కెరల
గ్రద్దల గరుత్మంతుల రాఁబందుల విలాసములకు విస్మయ
మొందుచు, నడుమనడుమ నీటఁ దలముంచి చిఱుబేడిసల
లంకించుకొనుచు నీదు మరాళముల విరాళసరాళములకు సంత
సించుచుఁ దేటిన నదీయుదకగర్భతలంబుల మిలమిలలాడుచుఁ
బలుపోకల గుంపులై శ్రేణులై పఱచు చిన్నపెద్దనీటిజంతువుల విహా
రముల కానందమొందుచుం జనువారి కొక్కనిశాంతాంతికమున॥

ఉ॥ "వింటివఁటే విచిత్ర! మొకవిప్రుఁడు చూచుటతోనె నీమనం
బంటినప్రశ్న ముత్తరము హాయిగఁ దెల్పెడు" 'దానికేమిటే!
గెంటెడుగా! తరంబులుగఁ గీల్కొని వీడనిజబ్బులెల్ల!' 'ము
క్కంటివొ!' 'తమ్మిచూలివొకొ!' 'కాకొక కేవలవిప్రమాత్రుఁడే!'

క॥ అని జను లనుకొనుమాటల
విని కౌతుకముబ్బ "దీని విధమంతయుఁ గ
న్గొని సత్యమైనచో మన
మును బ్రశ్నము వేయనగును పోవుద" మనుచున్॥ 1222

క॥ బైరాగియు వ్యాపారియుఁ
గారాజిలు లచ్చిరాచకన్నియ లాశ్రం
గారాగారముఁ జొచ్చిరి
వారందఱుఁ గలిసి వేఱుపడి ముచ్చటతోన్॥ 1223

క॥ దారినిడి మ్రొక్కువారికి
'నారాయణ' యనుచు లక్ష్మి నడువఁగ, 'సాక్షా
న్మారుఁడొ'యని స్త్రీపురుషులు
తేఱి కనఁగ నడిచె శీవి దేవేరి యటన్॥ 1224

ఉ॥ వచ్చువిరాగినిన్ వెనుకవై పున రాగిని గాంచి యోజన
మ్మైచ్చఁ బరాగియామిహిరు లీల వహించుముఖంబు సద్దకొం
చచ్చతురావనీసురనరాగ్రణి లేచి జొహారు స్వాగతం
బిచ్చి వివిక్తమాగదికి నిద్దఱఁ జేరిచి పల్కె సాత్వతిన్॥ 1225

ఉ॥"వారలనెల్లర న్బనిచివచ్చెద" నైరణ నంతదాఁక నీ
చేరువ మేలిపీఁటల వసింపుఁడు నన్ను మియించి, కంటి మీ
కోరికఁ, జేకుఱు న్ఫలము గొబ్బున, యోగ్యపురంధ్రులార!, నా
నారసరామణీయకపినద్ధము మీచరితం బెఱింగితిన్"॥ 1226

మ॥ అని విప్రోత్తముఁ డేగ, వేషధరు లన్యోన్యాస్యసంవీక్షణం
బున నబ్రంబు ప్రదర్శితంబుగ ముదంబుం జొంది "యోయమ్మ! మొం
దును గన్గో మిటువంటిచోద్య!", మన 'నెంచు న్విన్నదేలే' దటం
చును బుష్టీకృతకౌతుకం బెగయ నచ్చో వేచియున్నంతటన్॥ 1227

వ॥ సమర్ఘ్యములగు చీనిచీనాంబరంబు లలరు పసిడిపళ్లెరంబుల నెలవ
యసుమిటారికత్తియలు కొనిరా నన్నేలవేలు పరుదెంచి, తళియల
డించిచన నయ్యకించనమధ్యమల కాజ్ఞపాలించి వారు నిష్క్ర
మించిన వెనుక కించిదాకుంచితోత్తమాంగుండై॥ 1228

వి॥శా॥ఓలక్ష్మీసతి! నీవు దేవి భగవద్యోగంబున న్నేఁ డిటు
ల్మాలోగింటిని జేరఁ దత్కళలు నూత్నశ్రీల రాజిల్లు న
మ్మా! లెమ్మా! పనిలేదు వీడుఁ డిట మీమారేషము లీకువే
వేలై కోర్కులు చెల్లుఁగావుత పతిప్రేమానుసంధానతన్॥ 1229

క॥ అని బ్రాహ్మణుండు చన న
వ్వనితాద్వయ మద్భుతంబుఁ బ్రాముకొనుమదిన్
"మనగుట్టు నీతఁ డెట్టులఁ
గనెనో!" యనుకొనుచు మార్పుఁగడఁగిరి దుస్తుల్॥. 1230

తే॥ అంతలోపల నేపథ్యమందు వినఁగ
నయ్యె, "నోపూర్ణమాంబరో! అరయుమమ్మ!
నాపలు కసత్యమగునె విన్నాణికోడ
లాగదిం గల"దనెడి బ్రాహ్మణునిమాట॥ 1231

ల॥ క॥ ఓదేవీ! మాయత్తయ!
టాదైవముచలువ యింతయద్భుతకరమై
మోదంబు నిట్లొసంగునె! (నేపథ్యమున-లక్ష్మి!)
లే దేసంశయము కౌఁగిలిం గొన రమ్మా!॥ 1232

య॥ తే॥ తాళుమోచెలి! పరవశత్వంబుఁ గొనకు!
దైవమున కొక్కపరి నీకృతజ్ఞతాను
బద్ధవందన మెద:సమర్పణముఁ జేయు
మదిగో! విను మామె పలుకు నెమ్మదిగడించి॥ 1233

పూ॥ (నేపథ్యమున)
"సీ॥ ఉదయింపఁబోవు కుముదబాంధవుని యగ్ర
కిరణంబుల క్రమప్రకీర్ణకంబు
లీలఁ బెండిలినాఁటి మాలక్ష్మిసోయగం
బిప్పటి కెంతయే నెసఁగియుండు,
వ్యక్తురాలవునాఁడుఁ, బతిఁ జేరునాఁడు, నా
కానంద మొదుభాగ్యంబు కలుగ,
దెందేని బిడ్డల పొందు పొసఁగి యుంటె
పదివేలని మనంబుఁ బదిలపఱచు
కొనుచు మెలఁగ, హన్నుకుజనదౌర్జన్యంబు
వార్ధి కలజడులను మీఱఁజేసె,
నిప్పుడైన దైవ మింతవాత్సల్యంబుఁ
జూపెఁ గూర్తు వేలజోత లిట్లు"॥ 1236

య॥ "లక్ష్మిసతీ! వింటివా! మీయత్తగారికి నీపైఁ గలప్రేమాతిశయము. ఆలసింపక గొబ్బునఁజని యామె కాశ్లేషసౌఖ్య మొసంగుము. పొమ్ము! పొమ్ము. (అని గదివెలికి నెట్టి తలుపువేయును.)

లII (పాదముల వ్రాలి)

శాII అత్తయ్యా! యిట మామగారుఁ దమ రన్యాధీనులైరంట మా
చిత్తం బుత్తలమొంది యెత్తలమున న్జిక్కొందువారో! యటం
చాత్తార్తి న్వదరక న్గ్రమించునెడ ధైర్యంబిచ్చి చేయూతయై
యుత్తీర్ణస్థితిఁ గూర్చె నందఱకు నేరో వారి నీక్షింపరే!II 1238

కII అన గ్రుచ్చియెత్తి యెద బి
గ్గనఁ గౌఁగిలిఁ గొనుచు "మేలెగా! కోడల! నా
కనుపండువయ్యె మా నా
యన ధన్యుఁడు నిన్నుఁబోటి యాలగుకలిమిన్II 1239

కII ఏరీ! వా రిచ్చట ను
న్నారే? చూపింపు నానెనరుఁ" దెల్పుకొన
న్మీఱెడి కుతుకము, వేల జొ
హారులు వా రెట్టివారలైన నొసర్తున్ II 1240

వII అన లక్ష్మి గదితలుపుఁ దీయుచు "నత్తగారూ!

సీII ఖలశిక్ష శ్రితరక్ష ఘనులు బాలాదిత్య
నరసింహు లేయమ్మ నాన్నగారు
రణకర్కశుండు సరసుఁడైన శ్రీయశో
ధర్మఁ డేతల్లి కాత్మప్రభుండు
నిరతపరోపకారరతియుక్ ధర్మాను
సరణ మేమాత కాచరణపథము
రాచరికంబున న్రణభూమి నవనవో
న్మేష మేజనని విశేషశక్తి
చూడుఁ మద్దేవి యదిగో! యశోధరాఖ్య
సార్థకంబుగ విశ్వవిస్తారకీర్తి
వెలయు రాజసనాత్వికాకలితసుహిమ
రవిశశుల వేగుపున్నమదివి విధమునII 1241

పుII తేII వింటి వీనులవిందుగాఁ, గంటిఁ గనుల
పండువుగ, నేఁడు ఘగధమాశ్వప్రబంధ

ఘనకథానాయికామనోజ్ఞతను,(యశోధరనమస్కరింప)తల్లి!
శీఘ్రమేవ వాంఛాఫలసిద్ధిరస్తు॥! 1242

య॥ క॥ మాతరో! మీతనయుని వి
ఖ్యాతకవిత్వంబు నీమె కంటువడియె నిం
కేతరుఁగో! యతిశయోక్తుల
పాతర తెగబాట నిట్లు పాతరలాడున్॥ 1243

ల॥ క॥ ఏమందు నత్తగారూ!
సామాన్యకవిత్వ మీమె సకలగుణములం
దేమాత్రమొకాక వినుచు
సామర్థ్యముఁ గొనునె? వట్టిసాహసమెకదా!॥ 1244

సీ॥ సొగ సందమా! వేల సొగసుకత్తెలఁ గొన్న
హాన్ను నే న్పైనతిక్క నట్టుముంచె
నిబ్బరం బందమా నిష్ఠురుండగుహాన్నుఁ
గోరచూపున గుండెజాఱఁ జూచె
ధైర్య మందమ! కాశిఁ, దప్పుకొంటను, బోర,
కనకనగస్థైర్యమునఁ జెలంగె
వినయ మందమ! చెప్పుకొన నక్కఱయ లేదు
సాకృతి మీముందె యవతరించె
సాహసౌదార్యములకు సాక్ష్యంబు వేఱె
నెమక నేటికి చాలదే నేఁడు మాఱు
వేసమూని నాతో నిట్లు వెడలిరాక!
అగునె యెపుడే న్స్వభావోక్తి యతిశయోక్తి?॥ 1245

య॥ తే॥ వదినెరో! తెల్లమయ్యె నీప్రజ్ఞ యెల్లఁ
జెల్ల! యాత్మస్తుతిం గొల్లఁ జేసికొనఁగ!
కాశి నాపద మొదలీవె కాదె నేఁటి
దాక నామార్గదర్శివి? తాళు మింక!॥ 1246

తే॥ ఇట్టి యెకసక్కెముల వార లింపుఁ గొనుచుఁ
పూర్వవృత్తాంతములను దెల్పు కొనుచుండి;

రచట భారవి మిత్రసమావృతుఁడయి
దఱియుచుండెను మగధ సంబరము నిగుడ॥ 1247

క॥ ఆయూరి బయటిడొంక, న
దే! యెవరో? యెవరికొఱకొ యెదురులుచూచుఁ
జేయిఁ గనుబొమలపై నిడి
కాయము నిక్కించి; యెవరిఁ గనమిఁ జలించుఁ॥ 1248

మ॥ తడవయ్యె, న్వడిగా నినుం డపరసంధ్యం జేరఁగా నేగెడి,
న్నడిమింట న్జలదంబు లూఁగెడిని, వానా!, యల్లదే ముందురా
లెను, నేఁ డిందులఁ జేరుకొందు మనఁగా లేదే హితుల్; ద్దారి నె
క్కడ నేయాపద సోఁకలేదుగద? మేల్గానం బదే! యేరిదో? 1249

(నేపథ్యమున)
చ॥ పదులను నూర్ల తేంట్ల నొకబంభర మాసవ మాను కాంక్షచే
నెదిరిచి తోలి తానొకటియే కడుపారఁగఁ బుష్పగంధ మం
దదిమి గ్రహించెడి, న్వలవదా! పరిపంథిసుధీజనాళి వా
క్కదనమునందు నోంచి పసఁ గాంచినభారవి పోల్కి యన్నటుల్॥
"అది నారాయణుని కంఠము! ఆజోన్న చేని మలుపునుండి యేతెం
చెను. బలె! నాజనకునికోర్కెఁ దీర్ప నేఁటికి భగవత్కృప కలిగె.
వారుగో! మిత్రులు మలుపుఁ దిరిగి వచ్చుచున్నవారు." 1251

నా॥ భారవీ! ఏమి! యీపురాంతికసీమల నరాళిగతులఁ బరిభ్రమించు
నీసుకుమారసమీరకిశోరుని తుందుడుకుచేష్టలు. మిహిరు నేడ మన
చర్యలం దలఁపించుచున్నవి. 1252

ఉ॥ కమ్మనిసారు ముమ్మరముగా సకలమ్మునఁ గ్రమ్మ జీవసం
ఘమ్ములు సౌఖ్యవార్ధి నవగాహనముం బొనరించుచుండఁ బు
ష్పమ్ముల కార్తిఁ గూర్చునలషట్పదధార్త్యము వమ్ముగాఁగఁ బూ
దుమ్ముల వాని కన్గవలఁ ద్రోసి యథేచ్ఛఁ జరించుచుండెడిఁ॥ 1253

భా॥ నారాయణా! ఇట్టి సంతోషసమయంబున నాదుర్జనునిం దలపెట్ట
కుము. సహజసౌరభ్యతాస్ఫూర్తి నెసంగు నీములయపవనకుఢుంగ

తరంగంబులకుఁ జేదోడు వాదోడుగాఁ జెలంగు నీవసుంధరాసౌగం
ధ్యంబు నెంతయని వర్ణింపనగును. 1254

౨॥భా॥ పొలములను జలజలని పలువగల వలిచినుకు
లెలమిఁ బడ నలఘుతరలలితసుఖదంబై
వెలసెఁ బరిమళ మిచటఁ గలువలకు నలినముల
కొలకులకు నిలఁగలుగు నలరులకు నెల్లన్
దళమగుచుఁ, జిలువలకు బలమగుచుఁ, గిలకిలను
పులుఁగులకుఁ జెలియగుచుఁ బొలతులకు మేనన్
బులకలను జిలుకుచు నరుల నెలమిఁ గొలుపుచు న
ఖిలదిశలఁ గళకళను చెలువ మమరంగన్॥ 1255

మధు॥ ఈసువాసనల నూతనోత్సాహంబు సమకూరఁగానోపు నాపాక
దళి నాలేఁగదూడ. 1256

తే॥ పాలు కడుపారఁ ద్రావి, 'యంభా' యటంచుఁ
దల్లి యఱచుచునుండఁ, బాదములమీఁద
మేను వంచి ముంగాళ్ళపై మెడకుదించి
తటుకున న్దూఁకి తోఁకాడఁ దఱలుచుండె॥ 1257

భా॥ ఆభృంగరాజములం గనుంగొనుఁడు పరస్పరోద్గమనకాంక్షల
నాపుష్పంధయమ్ము లెల్లయెడలం దామరైయె కన్పట్టెడు॥ 1258

మ॥ అలవోక న్విలువీడి తీవ్రగతి గమ్యస్థానలగ్నంబులై
నిలువం జాలినసాయకావళివలె న్నిర్ణిద్రరావంబుతో
నళిబృందంబులు నూత్నపుష్పములచాయ న్జెంగునందూఁకి యుం
దలఁతి న్బ్రోక రసంబుఁ గ్రోలుకొను నాద్యంతంబు నుత్కంఠతన్॥
నారాయణా! వాఁడుగో! మనభామల్లుఁడు 1260

భా ॥మిత్రులారా! మీ కెల్లరకు స్వాగతము. మీకొఱకే యిట్లు వేచి
కొనియుంటి. రండు రండు సంధ్యాసమయమునకు విడిదలం జేరు
కొందము. 1261

క॥ అన నందఱు శకటంబుల
నినుమడివేగమునఁ బోవనిచ్చుచు భామ

ల్లుని నిర్దేశమ్మున నొక
ఘనసౌధము కెలన డిగిరి కౌతుక మెగయన్॥ 1262

క॥ వారల కాభవనాంత
ర్ద్వారంబుననుండి యెదురుపడియె నిగమసా
కారుఁడు ముదిపాఱుఁడు హా
సారభటు ల్తొంగియాడు నాస్యముతోడన్॥ 1263

క॥ ఏమీ వింతగ భారవి
భామల్లుని మొగముఁ గ్రొత్తభావనిమోము
న్వేమారుఁ జూచి "యారా!
భామల్లా!" యనుచుఁ జేర్చె బాహులనతనిన్॥ 1264

క॥ పదపడి సాష్టాంగంబుగ
ముదుకని పాదములఁ వ్రాలి ముదమున ననియెన్
"సదయా! మీయభిమానము
బదులిడ సాధ్యంబుగాని భారం బయ్యెన్" ॥ 1265

ము॥క॥ ఓసర్వజ్ఞా! భారవి!
యాసభ వాదంబుసుతఁ ద్వదాలోకన మె
న్నోసార్లు కోర దైవం
బీసాయాహ్నమున నిట్టు లిచ్చుటఁగూర్చెన్॥ 1266

నా॥ తే॥ భారవీ! తెల్లవన్నియుం బాల? నల్ల
వన్నియు న్నీళులా వెట్టి వయ్యెదేల?
మనకు భామల్లుఁ డెట్టి సంబంధియైన
నీదుపితరుల నితఁడె బంధించి యుంచె॥ 1267

భా॥ మ॥ సఖ! నారాయణ! నాగురూత్తముల వాస్తవ్యంబుగా నీయుదా
రఖనిశ్రేష్ఠుఁడె నిల్పుకొన్న, నది శాస్త్రవ్యంబున న్గా దటం
చు ఖరాగా నెదనమ్మ, యెవ్వరనుకొందో వీరి, బ్రహ్మర్షిను,
మ్మఖిలప్రస్తవనీయసాత్త్వికగుణఖ్యాతుండు సామాన్యుఁడే!॥ 1268

చ॥ ఎఱుఁగమి నేదియో పలికె నీతఁడు మీ రది యన్యథా తలం
పరని యెఱుంగుదున్, గురుసమా!, మము నెట్టుల దిద్దుకొంద్రో య

తెలుఁగుననే చరింతును వదింపుఁడు
ము॥ భారవి! నీవు మంచినే
ర్పరివి భవచ్చరిత్రఁ బొరపాటును గల్గునె యొండ్ల కెన్నఁగన్?॥1269

క॥ నాసుతుఁ డగుభామలుని
తోఁసరి మీ, రింక కడిగి తోడి వాయుసుతా
ర్చాసమయమునకు రం డట
నాసామీరారియె వచించు నర్థాపథంబున్॥ 1270

క॥ అని ముకుకఁడు లోనికిఁ జన
మనకవియుం దోడివారు మజ్జనములఁ దే
లినబుద్ధి సంధ్య వార్చి ప
వనసుతగేహంబుఁ జేరఁబాఱిరి తమితోన్॥ 1271

భామ॥ క॥ నారాయణుఁడా! మన కీ
భారవి బడిపెద్ద కానఁ బ్రథమ మతని వం
తోఁరసిలి నిలుము!, చనుమీ!
భారవి! గదిలోని కేము వత్తుము పిదపన్॥ 1272

క॥ అన నాతఁడు లోపలి కే
గిన వెలుపల చిలుకువేసి గేలింతలతోఁ
గనుగిఱపుచు భామల్లుఁడు
కొనిచనె వేఱొక్కదారి గుడికి హితాళిన్॥ 1273

తే॥ ఆంజనేయులుగాని నాయనయు నమ్మ
గాని వృద్ధుండుగాని యాలోన లేరు
భారవి, 'యిదేమ్మి!' యని వింతపడెడువేళఁ
దోఁచె నొకప్రక్క లక్ష్మి సంకోచ ముడుగ॥ 1274

ఆ॥ కలికి కలితనమునఁ బులుకుపుల్కులఁజూపు
కొలికికెక్క మారు ములికిలెక్కఁ
జిలుకఁ, జిక్కి, నిక్కవలపు త్రొక్కుడులాడ
పలుకుఁదక్కి పఱచి తలఁకుఁ జెక్కి॥ 1275

ఉ॥ బిగ్గఁ గవుంగిలించుకొనె బిట్టుగ మూర్కొని ముద్దులాడె, నా
నిగ్గుసుఖంబునందు సతి నిశ్చలయై మెదవ్రాలఁ, బాపటన్

బుగ్గలఁ, గంఠసీమల, కపోలములన్; దనివోక, ముప్పిరిన్
దిగ్గున మోవిపై మలసి తీఱనివాంఛల నానెఁ దత్సుధన్॥ 1276

క॥ ఆదీర్ఘ చుంబనంబునఁ
బైదలికిం దెలివివచ్చి బరవసమున మా
ఱాదగ స్మరవిస్మృత్సం
పాదనమున సుఖము తెరలు పర్వెఁ దనువులన్॥ 1277

ఉ॥ అంతట నిబ్బరించుకొని "యాగడ మాఁగుఁడు మిమ్ముఁ జూడఁగా
నెంతయొ ప్రేమ దార్లు పరికించెద ర త్తయు మామగారు, రా
కాంతను నేను క్రమ్మఱఁ సుఖంబుగ నంతిపురంబుఁ జేర్పఁ బో
ల్పాంతముబూని యేగుఁ" డని చాన వచింపఁగ నిల్వరించుచున్॥

భా॥ క॥ ప్రాణప్రియా!, మఱలఁ గ
ళ్యాణానంతరమునందె యగుఁ గలియఁగ, సు
త్రాణ మిడి కాచితివి మన
రాణిని, బసదనముఁ గోరు, ర, మ్మేగెదు లే!॥ 1279

ల॥ క॥ మీప్రేమ మొసంగితి రది
యే ప్రియతమమైనయీవి యిఁక నన్యము లే
లా? ప్రాణనాథ! మీపద
వప్రారాధనమె నాకుఁ బసదన మగుతన్॥ 1280

భా॥ తే॥ అతివ! నీపేరు శాశ్వతంబై చెలంగ
సర్గసర్గాంతముల శ్లోకసమితిలోన
శ్రీకిరాతార్జునీయసత్కృతిని నిలిపి
నాఁడ వినియెదు సభఁ బాడునాఁడు రమ్ము"॥ 1281

క॥ అనుచు న్వేఱొకయంగణ
మునకున్ జన నెదుఱువచ్చి మొగిసి కవుఁగిలిం
గొని తండ్రి "నాయనా! తీ
ఱెనె నీవ్రత మింక మము భరింతువుకాదే?"॥ 1282

క॥ అనఁ దల్లి "బిడ్డఁడా! ని
న్గన కన్నులు కాయకాచె గౌరీకృప దు

ర్దినములు చనె నిఁక నైనన్
మననిచ్చుదె గుండె కుదుట మంచిఁ జెలంగన్"॥ 1284

క॥ అని జనని పరిరంభణ
మును గొన సతితోడ దండముగ వందనముల్
బొనరిచి దీవనలను గొని
ననిచిన మోదంబువెల్లునన్ గుడిఁజేరన్॥ 1285

చ॥ చను నెడ, "నాయనా! సరభసంబున యాత్రల కట్లుతర్లి యే
ఘనతరపట్టణంబులను గాంచితి రెయ్యెయిక్షేత్రతీర్థదై
వనికరసేవనంబుల శుభంబులఁ జెందితి రీమహాత్మునిం
ట నిలుచు టెట్లు కల్గెనో వినందగిన న్నెలవిందు సద్దయన్॥" 1286

క॥ అని భారవి యడిగిన నా
తని జనకుఁడు పల్కెఁ బ్రణయతరళితమగు సూ
క్తిని "వరుస నన్నిక్షేత్రము
లను సేవించుకొను చియ్యెలాతలమునను॥ 1287

మ॥ ఒకవేఁబోకను జేరి సత్తరువునం దొక్కంటఁ గాలూఁది ని
త్యకలాపంబులఁ దీర్చి పాపడుడు మధ్యాహ్నంబున న్నీదు త
ల్లికి వేపెట్లుగ వేఁకి సోఁకె స్పృహయేలేకుండ, "హాదైవమా!
యిఁక నేఁదీగతి!"యంచు"మం దొసఁగలే రేవైద్యు"లంచార్తితోన్॥

శా॥ వారిన్ వీరిని నాఁక, కన్పడిన నెవ్వారి న్విచారించుచున్
దార ట్లాడుచు నుండఁ, జేరి యొకపుణ్యబ్రాహ్మణుం డీసమా
చారంబంతయు నాలకించి 'భయ మీషన్మాత్రము న్లేదు రం
డారోగ్యంబగు మీసతీమణి" కటం చాతండు మమ్మాదకున్॥1289

ఉ॥ చేరిచినంత, నీపరమసిద్ధుఁడు మం దిడి పల్కెఁ "నార్య! మీ
రారట మొందఁబోవకుడి యాత్రలనైనగిజాటెగాని వే
ర్కారణ మేమిలేదు త్వరగా నయమౌఁ, బరమేశ్వరాజ్ఞ మీ
యూరికిఁ గొద్దిలో నరుగనోపుఁ, గనుం డిది మీగృహంబుగన్"॥

శా॥ ఆయాదార్యము ముగ్ధుఁజేయఁగఁ గృతజ్ఞానందవాక్యాళి నే
ఘో యేఁ బల్కుచునుండఁ "సాధుజనసంపూజ్యా! భవద్గ్రామ మే

దీ? యుష్మచ్ఛుభనామ మెద్ది? కలదే యేమైన సంతాన”మం
చాయాప్రశ్నల వేయ, నుత్తరము లీయన్, డిగ్గున న్లేచుచున్॥

క॥ “ఎట్టెట్టూ! శ్రీభారవి
భట్టారకు జనకులా! శుభం బయ్యెను వా
డిట్టరి యతం డేఁడీ! యి
ప్పట్టున మీతోడ రాఁడె? భవ్యచరిత్రా!॥ 1292

క॥ భామల్లా! యలభారవి
కీమహితులు తల్లిదండ్రు లిది వింటివె!, యో
స్వామీ! రం” డని మాకే
మేమో మర్యాద జరిపె హితబంధువులన్॥ 1293

ఉ॥ అప్పటినుండి యిప్పటికి నవ్వల కేగఁగనీఁడు ‘మీర లీ
చొప్పున కేలవచ్చెదరు, చూతురు చిత్రము లూరనంచు, మా
కెప్పటికప్పు డేదియొ వచించుచు నిల్పుచునుండ హాన్ను చే
ముప్పు ఘటిల్లె దేశమున మోపుగ నాపఁగరానికోపునన్॥ 1294

ఉ॥ నీకొఱ కంగలార్చునను నీజననిన్ దగ నాశ్వసించి, నీ
కై కొడుకున్ బను ల్కఱపి “కన్గొనిగా కిటురాఁ దలంపుఁ జే
కొ”కని కట్టడ ల్పలికి గొబ్బునఁ బంపె, మహాతపస్వి, సు
శ్లోకు డితండు, సిద్ధుఁ డనుచు న్నడిఁ ద్రోయఁగలేమ మేమునున్॥

కం॥ అట్టులె యాయన మాకుం
బెట్టినగడు వరుగకుండ మీరందఱు ని
ప్పట్టున మమ్మిం గలిసితి
రట్టిట్టయి చెడదు వారియభిహిత మెప్పుడున్॥ 1296

క॥ పావని ప్రత్యక్షం బీ
పావనున, ‘కొహరా’ యటంచుఁ బలుకు పిలచినన్
బోవును గాఱులు గత్తర;
లివిధముగ నిసుక ప్రాలనీరు జనంబుల్”॥ 1297

తే॥ అనుచు నందఱుఁ బూజాగృహంబుఁ జేర
యర్చనానంతరమునఁ దీర్థాదు లంది

చనిరి తరువాత నెవ్వరిపనికి వారు,
లక్ష్మియు యశోధరయు రాకలాఁగ యేఁగ॥ 1298

క॥ మఱుసటిదినమున మాళ్వము
దొర లం దరుదేఁ దద ర్హాతూర్యాదికబం
ధురగౌరవార్చనంబుల
వరుసగ విడిదలల పీఁరబలుఁ డమరించె॥ 1299

తే॥ తనప్రవాసంబులను యశోధనుఁడుగాఁగఁ
దనరె నేమాళవము యశోధర్మనృపతి
సూనుఁ డాతఁడు జితహూన్నశౌర్యవరుఁడు
వరలె వేడ్కలఁ దనపీఁరబలునితోడ॥ 1300

వ॥ ఆయశోధరాయశోధర్ముల పరిణయమహోత్సవమున కాహూతులై దేశదేశములనుండి రాజశ్రేష్ఠు లనేకు లరుదెంచిరి. అందు ముఖ్యులలో ముఖ్యుండు దక్షిణాపథమండలచక్రవర్తియు హూన్నదార్జన్యనాశనంబునకుఁ దోడుపడిన భారతీయదేశభక్తుండునగు శ్రీపులకేశిరాజేంద్రుండు. తరువాత ఘూర్జరదేశాధీశుండగు శ్రీవర్మలరాజశ్రేష్ఠుండు. ఈతని మంత్రిసత్తముం డుత్తమబ్రహ్మవంశసంభూతుండగు సుప్రభదేవుండు. తనూజుండగు దత్తుఁడును మనుమఁడగు మాఘదేవుండునుం గూడ రాసీమంత్రిశేఖరుండు నేతద్వివాహమునకు నిజధరాధినాథు ననుగమించె. ఈసమయమునకు పదిపండ్రెండేండ్ల యీడువాఁ డగుమాఘదేవుండు మొదుగఁ దన భావిపాండిత్యసూచనముల నగుపఱచుచుండెడివాఁడు. నాఁటికే యతఁ డనర్గళధార ననేకసంస్కృతశ్లోకముల నల్ల సమర్థుండై యుండె. తద్భావము పండితశ్రేష్ఠులకేని మిక్కిలిదురవగాహముగనుండు చుండ నొకమాత్రకవియగు నతనిమేనమామ యల్లునికి బుద్ధిమాంద్యమును సమకూర్ప మాషచక్రముల దండిగఁ దినిపించుచుండువాఁడు. ఇట్టిపండితులతో నిట్టిమాండలికచక్రవర్తులతో నాఖండలవైభవంబున వెలయు నాపెండిలిదినముల నొక్కనాఁడు నిండోలగంబున వివిధవినోదముల నం దంద అమందానందకందళిత

హృదయారవిందు లగుచుండ శ్రీమద్భారవికృత కిరాతార్జునీయ కృతి తద్గ్రంథకర్తృగానకళానైపుణ్యంబు సభనెల్లర నుయ్యాల లూఁప గానం బొనర్పంబడియె. ఏకసంధాగ్రాహియు భావరసాస్వాదనదక్షుండగు మాఘదేవుండు సర్గసర్గాంతమున సంతోషపారవశ్యంబున 'మేలుమే'లని గంతులువేయుచుండ సదస్యుల కయ్యర్భకుని యద్భుతకరబుద్ధినైశిత్యంబునకు నల్లారుముద్దుతో నబ్బురంబును బ్రబ్బందొడంగె. ఆకృతిసముద్రమున నక్షయంబుగ వెడలు శయ్యాపాకభావగాంభీర్యరసామృతమహానందదాయకవీచికాపరంపరల నానందసమగ్రసంప్లావితచిత్తులై శ్రోతలెల్ల రచేతనులయ్యుఁ నెడనెడఁ బ్రశంసాగర్భితచలనవాచకంబుల నప్రయత్నకంబుగఁ జేతనత్వంబు సూచించుచు బ్రహ్మానందభరితులైరి. తదుపరి సముర్హపారితోషికంబుల నబ్భారవి నర్చించినవెనుక బాలాదిత్యనృసింహచక్రవర్తి విశేషవాంఛ యెద్దియైన నున్న సెలవిమ్మని యనుజ్ఞ నొసంగ నక్కవిశేఖరుండు తా మున్ను స్థాపించిన వేదశాస్త్రపాఠశాల సమస్తముఖ్యపట్టణముల వెలయుశాఖోపశాఖలతో నుద్ధరింపంబడ వలయునని విన్నవింప నారాజశేఖరుండేగాక తత్రస్థసమస్తనృపసంతతియు నయ్యుపపాదనంబు నామోదించి యతని సంతోషపెట్టిరి. తరువాతఁ గళ్యాణంబు దేవబ్రాహ్మణభూతతుష్టి సమగ్రముగఁ దనర నత్యంతశోభాయమానంబుగఁ జరుగ సముర్హసత్కృతు లంది యెవ్వరి పీండ్లకు వారు చనిరి. జగద్విఖ్యాతుఁడగు భారవింగూర్చియుఁ దద్విఖ్యాతికి మూలకందంబగు నతని కృతిం గూర్చియు నెవ్వ రేమి యనుకొనిన శ్రీమహాకవియగు మాఘదేవుని యనుకరణమే వేనోళ్ల మాతృకయొక్క గొప్పదనమును జాటుచున్నది. చిన్నచిత్తరువును ఛాయాగ్రాహకయంత్రనైపుణ్యంబునఁ బెద్దదిగా నొనర్చినట్లు కిరాతార్జునీయము శిశుపాలవధగా మాఘకృతియై పరిణమించె ననిన సత్యమునకు దవ్వుకాదు. భేదము నెన్నవలసినచోఁ దక్కినవి యెట్లులున్న నౌచిత్యము ననుసరించి దిక్ప్రదర్శనముగా భారవి తనపాండిత్యప్రకర్షము నటనట దనకావ్యమునఁ గనుపరచియుండ దదనుకరణవ్యక్తి యనుకరణమాగ్ధ్యమునఁ

పాండిత్యప్రకర్షమునకు మిక్కిలి తావుం గైకొనిరె. ఇయ్యది గర్వ్య మనుటకాదు. లోకోభిన్నరుచిః! 1301

ఉ॥ భారవి యత్త మామలును బావలు బంధులు మేనమామయుఁ
సారతరానురాగములసందడి సత్కవికార్యభారము
న్వారికి వారికి న్దగిన వైఖరిసాయముఁ జూపి తేర్చి య
వ్వారిగ సౌఖ్య ధాన్య ధనవైభవ భూ సముపేతులై రటఁ॥1302

శా॥ లక్ష్మీభారవు లాపయిఁ మనిరిశ్రీలల, స్ఫీర్తి, సంతానభా
గ్యశ్రీసంపదలుల్లసిల్ల, బహుశిష్యస్తోమముల్గొల్వఁ, బై
సూక్ష్మాలంబనమూని కీర్తితను విచ్చోనిల్పి నక్షత్రి ది
వ్యశ్రీభారవులైరి స్వస్తిజగమత్యానందము న్జెందఁగఁ॥ 1303

ఓం తత్సత్.

---

# సవరణలు.

| పద్య సంఖ్య. | పాదము. | ఉన్నది. | ఉండవలసినది. |
|---|---|---|---|
| 11 | 2 | స్థ్వం | స్థ్యం |
| 24 | 7 | యాగు | యాఁగు |
| 71 | 3 | చుఱు | చుఱుకుఁ |
| 75 | 3 | పెన్న | పెద్ద |
| 88 | 2 | ఱోఁకలి | రోఁకలి |
| 100 | 2 | గనిన | గసని |
| 104 | 6 | దులుగొ | దులకొ |
| 116 | 1 | భారవి | భారవియొక్క |
| 122 | 1 | ఆడు | ఆఁడు |
| 123 | 1 | చక్కనిఁవాడు | చక్కనివాఁడు |
| 127 | 2 | లింట | లింటం |
| 134 | 3 | మఱిగి | మరిగి |
| 138 | 3 | మునుపుఁజె | మునుపుచె |
| 143 | 3.4 | మైలపస్లీ | పైపనుల్వీ |
| | | మటకేగెదు | మటువెళ్లెదు |
| 177 | 4 | నబ్బారవి | నభ్భారవి |
| 185 | 1 | గట్టులఁగం | గట్టుఁలగం |
| 204 | 4 | యథేచ్చల | యథేచ్ఛల |
| 210 | 1 | ఆత్తకు | అత్తకు |
| 211 | 4 | బయసే | బయిసే |
| 251 | 2 | కే్రఁగను | క్రేగను |
| 261 | 3 | య్యాడరు | య్యాడలు |
| 277 | 1 | ఆని | అని |
| 288 | 3 | చికిలచే | చికిలిచే |
| 296 | 3 | జ్ఞ | జ్ఞ |
| 297 | 3 | త్రి | త్రి |
| 299 | 4 | వంతుల్దర | వంతుల్దల |
| 332 | 3 | లిరలు | లీరలు |

| | | | |
|---|---|---|---|
| 357 | 4 | గాదున | గాదునా |
| 362 | 2 | ఝ్ఞ | జ్ఞ |
| 369 | 3 | గడ్డ | గడ్గ |
| 372 | 1 | బృా | భృా |
| 375 | 1 | వృతం | వృంతం |
| 410 | 3 | ఘోఅ | ఘోర |
| 434 | 4 | పపడి | పడి |
| 438 | 2 | బొడిగిరేయి | బొదుగుచురే |
| 443 | 11 | నాయ | నారాయ |
| 476 | 1 | భారము | భారముఁ |
| 478 | 1 | జ్ఞాసులు | జ్ఞానులు |
| 487 | 3 | లలిరత | లలితర |
| 519 | 3 | గౌగిలింను | గౌఁగిలించు |
| 547 | 1 | చ॥ | క॥ |
| 554 | 3 | లన్నియ | లన్నియుఁ |
| 596 | 3 | నెప్టు | నెప్డు |
| 643 | 4 | యచు | యంచు |
| 628 | 5 | మెమో | మేమో |
| 651 | 3 | యూట | యాట |
| 683 | 2 | తక్షణ | తత్క్షణ |
| 685 | 4 | దాగు | దాఁగు |
| 688 | 3 | బిచ్చి | బిచ్చు |
| 700 | 11 | మీదు | మీఁదు |
| 730 | 3 | సౌభాగ్యం | దాంపత్యం |
| 755 | 2 | యూనో | యానో |
| 796 | 1 | మున్నఁ | మున్న |
| 789 | 2 | యెంచి | యుంచి |
| 1058 | 2 | గిట్టి | గట్టి |
| 1078 | 1 | యముఁ | యముం |
| 1106 | 1 | కలామాన్నం | కలమాన్నం |
| 1121 | 4 | య్యాయుధము | య్యాయుధమ్ము |

# ప్రకటనము.

---

## గ్రంథకర్తగారి గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| శ్రీగణేశ్వరీయము | రఫ్ 0—12—0, | గ్లేజు | 1—0—0 |
| భారవి (జీవితచరిత్రము) ప్రథమభాగము | | ... | 0—8—0 |
| భారవి (జీవితచరిత్రము) ద్వితీయభాగము | | ... | 1—0—0 |
| భారవి (కిరాతార్జునీయము) తృతీయభాగము | | ... | 1—8—0 |
| శతకస్తబకము | ... | ... | 0—4—0 |

## భువనగిరి కోదండపాణిగారి గ్రంథములు.

(అరండల్ పేట, గుంటూరు.)

| | | | |
|---|---|---|---|
| అద్వైతబ్రహ్మేశ్వరతారావళి | | ... | 0—4—0 |
| పసిపాప | ... | ... | 1—0—0 |
| రామశతకము | ... | ... | 0—1—0 |



## భువనగిరి బుచ్చిపరదేశిసోమయాజిగారివి

(గుంటూరు)

| | | | |
|---|---|---|---|
| సౌగంధికపుష్పాపహరణము (నాటకము) | | ... | 0—8—0 |
| కోటప్పకొండ ప్రహసనము | ... | ... | 0—2—0 |
| జానకీపతిశతకము | ... | ... | 0—2—0 |

☛ ఈ ముగ్గురిలో నెవరికి వ్రాసినను పైపుస్తకములు వి. పి. గా పంపబడును.